# పురిపండా భాగవతం

---

## కళాప్రపూర్ణ
## పురిపండా అప్పలస్వామి

నవజ్యోతి పబ్లికేషన్స్
ఏలూరు రోడ్ విజయవాడ2

# పురివండా భాగవతం

రాముడి కథ రామాయణం
కృష్ణుడి కథ భాగవతం

## యాదవులు

మాథుర, శూరసేన దేశాలు యాదవులు ఏలుతూ వుండేవారు. వీరి రాజధాని మథుర.

యయాతి మహారాజు కొడుకులలో పెద్దవాడు యదుడు. అతడి వంశం యాదవవంశం.

యాదవులలో సాత్వతుడూ, చేదీ, మహాభోజుడూ, వృష్ణీ, అంధకుడూ సంస్థాపకర్తలు. వీరి పేర వరసగా మాధవ వంశమూ, చేది వంశమూ, భోజవంశమూ, వృష్ణివంశమూ, అంధకవంశమూ ఏర్పడ్డాయి.

అంతేకాదు. అక్రూరుడూ, సత్రాజిత్తూ, బభ్రుడూ, కృతవర్మా, సాత్యకీ, ఉగ్రసేనుడూ, శూరసేనుడూ- ఇలా ఎంతోమంది పేరుపడ్డ యాదవులు పుట్టారు. వీరందరి సంతతితో యదువంశం తామరతంపరగా పెరిగింది.

శూరసేనుడి కొడుకు వసుదేవుడు. ఇతడు రోహిణీ, పౌరవీ, భద్రా, మదిరా, రోచనా, ఇళా అని ఆరుగురినీ, ఉగ్రసేనుడి అన్న దేవకుడి కూతుళ్ళని ధృవదేవ, శాంతిదేవ, ఉపదేవ, శ్రీదేవ, దేవరక్షిత, సహదేవ అని ఆరుగురిని పెళ్ళి చేసుకున్నాడు.

రోహిణి కడుపున బలరాముడూ, గదుడూ, దేవకి కడుపున కృష్ణుడూ, సుభద్రా మొదలైనవారూ పుట్టారు.

శూరసేనుడికి వసుదేవుడేకాక, దేవభాగుడూ మొదలైన మరి తొమ్మండుగురు కుమాళ్ళూ, పృథా, శ్రుతదేవీ, శ్రుతకీర్తీ, శ్రుతశ్రవా, రాజాధిదేవి అని అయిదుగురు కూతుళ్ళూ కలిగారు.

పృథని కుంతిభోజుడు కూతురుగా పెంచుకున్నాడు. అందుకని ఆమెని కుంతి అన్నారు. స్వయంవరంలో పాండురాజుని వరించిందీమె.

శ్రుతదేవి కరూశదేశం రాజుని పెళ్ళాడి, దంతవక్త్రుణ్ణి కంది.

శ్రుతకీర్తి కేకయదేశం రాజుని పెళ్ళాడింది; అయిదుగురు కేకయుల్ని కంది. వీరు భారతయుద్ధంలో పాండవుల వేపున్నారు.

రాజాధిదేవి జయసేనుణ్ణి పెళ్ళాడింది; విందుణ్ణీ, అను విందుణ్ణీకంది. ఈ విందానువిందులు భారతంలో దుర్యోధనుడి పక్షం పోరాడారు.

శుతశ్రవ చేది దమఘోషుణ్ణి పెళ్ళాడింది. శిశుపాలుణ్ణి కంది. కృష్ణుడంటే పడేదికాదు శిశుపాలుడికి. దంతవక్త్రుడు అతడితో బుజాలు కలిపేవాడు.

ఉగ్రసేనుడు భోజవంశం యాదవుడు. మాధుర, శూరసేన దేశాలరాజు. అతడికి కంసుడు, న్యగ్రోధుడూ, సునాముడు, కంకుడు, శంకుడు, సుహుడు, రాష్ట్రపాలుడూ, సృష్టి, తుష్టిమంతుడు అని కొడుకులూ; కంస, కంసవతి, కంక, శూరభు, రాష్ట్రపాలిక అని కూతుళ్ళు కలిగారు.

కంసా మొదలైన కన్యల్ని వసుదేవుడి సోదరులు పెళ్ళి చేసుకున్నారు.

కంసుడు ఉగ్రసేనుడి భార్యకి ద్రవిళుడి వల్ల కలిగిన క్షేత్రజుడు; నల్లమాలిన బలవంతుడు. కనికరం లేని కరుకుమనిషి.

మగధ జరాసంధుడు కంసుడుకి పిల్లనిచ్చిన మామ. అందుకని ఇతడి పొగరు ఇంతా అంతా కాదు. పైగా, ప్రలంబుడూ, బకుడూ, బాణుడూ, తృణావర్తుడూ, అఘుండూ, ముష్టికుడూ, అరిష్టుడూ, ద్వివిదుడూ, ధేనుకుడూ కేశీ మొదలైన రాక్షసుల స్నేహమూ, సహాయమూ వుండేవి. పూతనవంటి రాకాసులు చెప్పుచేతలలో వుండేవారు.

ఉగ్రసేనుణ్ణి ఖైదుచేసి తానే రాజ్యమేలుతూ

వచ్చాడు కంసుడు. దేవకీ వసుదేవుల్ని ఖైదులో పెట్టాడు. వాళ్ళకి పుట్టిన బిడ్డల్ని ఎప్పటికప్పుడు చంపిపారేశాడు. అతడికి భయపడి యాదవులు చెట్టోపిట్టయి పారిపోయారు. కొందరు కురు, పాంచాల దేశాలకి; కొందరు కేకయ, సాల్వ దేశాలకీ, కొందరు విదర్భ, నిషధ దేశాలకీ; కొందరు విదేహ, కోసల దేశాలకీ వలస పోయారు.

అదిగో అలాటి అల్లకల్లోలమైన కాలంలో అవతరించాడు కృష్ణుడు.

## మబ్బులేని పిడుగు

కూతుళ్ళందరిలోకీ దేవకి అంటే ప్రాణం దేవకుడికి. ఆమెపెళ్ళి కళ్ళ వేడుకగా జరిపించాడతడు. బంగారం హారాలు వేసిన నాలుగు వందల మదపుటేనుగులూ, పది హేను వేలు ఎంపిక చేసిన గుర్రాలూ, వెయ్యా ఎనిమిది వందల బంగారం రథాలూ, వయసులో వున్న చక్కని చుక్కల్లాంటి రెండు వందలమంది పనికత్తెలూ కూతురికి సారెగా పంపాడు.

మగడి వెంట అత్తవారింటికి బయలుదేరింది దేవకి. శంఖాలూ, తూర్యాలూ — మంగళవాద్యాలు మోగాయి. దేవకీ వసుదేవులు రథంమీద కూర్చున్నారు. ముస్తాబు చేసిన రథం ముచ్చటగా వుంది.

దేవకిఅంటే కంసుడికీ ఎంతో స్నేహం. అందుకని చెల్లెల్ని తానే దిగబెట్టాలని షయనమయాడు. రథమెక్కి తానే స్వయంగా సారథ్యం చేశాడు.

రథం నడుస్తూవుంది. అంతా సవ్యంగానేవుంది. ఇంతలో వున్నట్టుండి "కంసా!" అని బయలులో ఒక కేక వినపడింది–"దేవకి ఎనిమిదో కానుపు నిన్ను చంపుతుంది."

గతుక్కుమన్నాడు కంసుడు. అతడి మతిపోయింది. చేతి పగ్గాలు జారిపోయాయి. గుండె బేజారయింది. ఏం చెయ్యాలి? క్రూరమైన తలంపు తన తలలో మెరిసింది–"మొదలు నరికేస్తే కానుపే వుండదు."

కత్తి దూశాడు కంసుడు. దేవకి జుత్తు పట్టుకున్నాడు. "అన్నా!" అని అరిచింది దేవకి. కొత్త పెళ్ళికూతురామె. రెప్పపాటులో ఆమెతల తెగిపోతుంది!

"బావా!" మెరుపులా వురికి అడ్డుకున్నాడు వసుదేవుడు. "ఆగు. రవంత ఆలోచించు బయలుమాటే నిజమయితే నీ చెల్లెలువల్ల నీకు అపాయంలేదు. ఏదైనా వుంటే ఈమె కానుపువల్ల కదా! అదీ ఎనిమిదో కానుపువల్ల. అయినా ఈమె కన్న ప్రతిబిడ్డనీ పురిటిలోంచే తెచ్చి నీకు అప్పగిస్తాను; చంపు. ఏ పాపమూ ఎరగని బేల దేవకి. ఇన్నాళ్ళూ నిన్ను నమ్ముకున్న నీ చెల్లెలు పెళ్ళిముస్తాబుతో వుంది కనికరించు" అంటూ కాళ్ళా వేళ్ళా పడ్డాడు.

ఆలోచించాడు కంసుడు. 'నిజమే పుట్టినవాళ్ళని పుట్టగానే చంపేస్తేసరి. చచ్చినవాళ్లు చేసేదేమిటి?'

దేవకి మొహం చూస్తే తన మనస్సులో ఏ మూలో జాలి కూడా కదులుతున్నట్టుంది. వసుదేవుడు అన్నమాట తప్పడని కంసుడికి తెలుసు. దేవకికి పుట్టిన బిడ్డల్ని తప్పక

తనకి అప్పగిస్తాడనడంలో అనుమానం లేదు. అందుకని వసుదేవుడి మాట ప్రకారం దేవకిని వొదిలిపెట్టాడు.

గండం గడిచి ఇల్లాలితో ఇల్లు చేరుకున్నాడు వసుదేవుడు.

కొన్నాళ్ళకి నీళ్ళాడింది దేవకి. తొలికాన్పు మగబిడ్డని కంది.

కన్నకొడుకుని చంపుమని కంసుడిచేతిలో పెట్టాలి. దేవకీ, వసుదేవుడూ వలవలా ఏడ్చారు. అయినా తప్పదు. కంసుడు కసాయి.

మాట ఇచ్చినప్రకారం కొడుకుని - నెత్తురు కండని తెచ్చి కంసుడి ముందు పెట్టాడు వసుదేవుడు.

అతడి నిజాయితీకి తలవూపాడు కంసుడు.

"బావా! ఈ మేనల్లుణ్ణి నువ్వే తీసుకుపో, పెంచుకో. దేవకి ఎనిమిదో కానుపున పుట్టినవాడు కదా ఏదో చేస్తాడంది బయట!"

"వాణ్ణి మాత్రం తప్పకుండా పట్టుకురా. ముక్కలు ముక్కలు చేసి నరికేస్తాను" అన్నాడు.

అప్పటికి ఆ గండం గట్టెక్కిందనుకుంటూ కొడుకుని తెచ్చి దేవకి వొడిలో పెట్టాడు వసుదేవుడు. అయితే కంసుడు కట్టికి కసాయి. అతడి మతి ఎప్పుడు ఎలావుంటుందో తెలియదు. అందుకని దిగులు పడుతూనే వుండేవారు దేవకీ వసుదేవులు.

కుమారుడికి ముచ్చటగా కీర్తిమంతుడు అని పేరు పెట్టుకున్నారు.

# ఖైదు

అవాళ ఆకాశవాణి అన్నమాట ఆందోళన కలిగిస్తూనేవుంది కంసుడికి. ఇలావుండగా వోనాడు నారదుడు అతడి దగ్గరికి వచ్చాడు.

"కంసా! నీ కులంవాళ్ళంతా నీ చావు కోరుతున్నారు. ఎవళ్ళనీ నమ్మకు" అని చెప్పాడు.

దాంతో పిచ్చెత్తినట్టయిపోయాడు కంసుడు. ఎవడు తనవాడో ఎవడు పైవాడో తెలియకండాపోయింది. దేవకినీ, వసుదేవుణ్ణీ అరదండాలు వేయించి పట్టించుకు వచ్చాడు. ఖైదులో పడేశాడు. వాళ్ళ కొడుకుని కీర్తిమంతుణ్ణి చంపేశాడు. ఖైదుచుట్టూ కాపలా పెట్టించాడు. కావలివాళ్ళని కన్నుకప్పి గాలికూడా కదలకండా కట్టుదిట్టం చేశాడు.

తండ్రి ఉగ్రసేనుణ్ణి ఖైదులో కట్టి పడేశాడు. తానే రాజయి కూచున్నాడు. తనకి తగిన దుష్టుల్ని మంత్రులుగా పెట్టుకున్నాడు. తన చావు కోరిన కులంవారిని తుడిచెయ్యడానికి పూనుకుని, వాళ్ళని అష్టకష్టాలు పెట్టాడు. చిత్రహింసలూ చేశాడు. అతడి పేరంటే పిట్టలు నీళ్లు తాగేవికావు. చూడి ఆవులు తప్పుకునేవి. యాదవులు ఆపదల పాలయారు. ఏ అర్ధరాత్రి ఎవర్ని ఖైదుచేస్తాడో, ఏ క్షణంలో ఎవరి ఇల్లు కొల్లగొడతాడో, ఏ కుటుంబంమీద ఏ కుట్ర పన్నుతాడో అంటూ అడిలిపోయారు వారు. ప్రాణాలు అరచేతిలో పెట్టుకుని ఆడా మగా దేశదేశాలు పట్టిపోయారు.

రాజ్యం అల్లకల్లోలమయింది. కంసుడిపాలన కసాయి పాలన అయింది. రాజ్యమే వొక బందిఖానా అయింది.

దేవకి చెరసాలలో మరి అయిదుగురు కొడుకులను కంది. బిడ్డ కిందపడి ఏడ్చేవాడో లేదో, వెయ్యికళ్ళతో కనిపెట్టుకు కూచున్న కాపలాకింకర్లు కంసుడికి కబురందించేవాళ్లు. పెను భూతంలా పడుతూ లేస్తూ పరిగెత్తుకు వచ్చేవాడతడు. బిల బిలా చూస్తున్న పసికందుని చంపి పారేసేవాడు. పుట్టిన ప్రతి బిడ్డా తనని చంపేస్తాడేమో అని వొణికిపోయేవాడు. ప్రపంచమే తనమీద పగపట్టిందనుకునేవాడు.

అలా దేవకి కొడుకుల్ని ఆరుగుర్నీ చంపేశాడు కంసుడు. ఆమె ఏడో గర్భం జారిపోయింది.

ఎనిమిదో మారు మళ్ళీ నీళ్ళాడింది దేవకి. ఈ మారామె శరీరం మరింత పలకబారింది. వసుదేవుడిలో ఏదో కొత్త ఆశ అంకురించింది. అయినా కడుపుకోతతో ఆ ఆలూమగలూ కుమిలిపోతూనే వుండేవారు.

అది దేవకి ఎనిమిదో గర్భం అనగానే మతిపోయింది కంసుడికి.

"కంసా! దేవకి ఎనిమిదో కానుపు నిన్ను చంపుతుంది."

ఆనాటి బయలు మాట అతడి చెవుల్లో మారు మోగింది. కిందా, మీదా అదే మాట వినపడింది. అటూ, ఇటూ- అన్నివేపులా అదేమాట మళ్ళీ మళ్ళీ మారు మోగింది. చెవులు మూసుకున్నాడు; తలబాదుకున్నాడు. ఆగలేదు. వినబడుతూనే వుంది. తనలోంచి, తన గుండెల్లోంచి వినపడుతూ వుంది.

"దేవకి ఎనిమిదో కానుపు నిన్ను చంపుతుంది!"

"దేవకిని చంపేస్తాను." అంటూ కత్తి తీశాడు కంసుడు. కాని కాలు కదపలేకపోయాడు. చెమటలు పోసుకున్నాడు.

"ఆడది. చూలాలు. పైగా చెల్లెలు. నా మగతనానికే మచ్చ. ఇంతకీ వాళ్ళ పసికందుకా నా భయం! పుట్టనీ, పుట్టగానే చంపేస్తాను." అంటూ తనలో తాను సంబాళించుకుంటూ వచ్చాడు. నెలలు నిండుతున్న కొద్దీ నిలకడపోతూ వచ్చిందతడికి. కళ్ళు మూసినా కళ్ళు తెరిచినా దేవకి కనబోయే ఎనిమిదో కొడుకు కారుమబ్బులా నల్లగా కనబడుతూ వచ్చాడు.

శాంతీ, విశ్రాంతీ లేకుండా పోయింది కంసుడికి.

## కృష్ణుడు

అవాళ అష్టమి. నీలాకాశం నిర్మలంగా వుంది. చుక్కలు మిల మిలా మెరుస్తున్నాయి. అర్ధచంద్రుడు రోహిణితో కలిసి అస్తమించాడు. ఉన్నట్టుండి నల్లనల్లని వానమబ్బులు నాలుగు వేపులా ముసురుకు వచ్చాయి. మధురాపట్నం కారుచీకట్లో మునిగిపోయింది. జనం ఆడా మగా గాఢనిద్రలో వున్నారు. కంసుని కారాగృహం నిశ్శబ్దంగా వుంది. కాపలావాళ్ళు వొళ్ళు తెలియకుండా పడుకున్నారు. వానజల్లు చల్లగావుంది.

దేవకి ఎనిమిదో కానుపు కొడుకుని కంది. నల్లగా నిగనిగలాడుతున్నాడు కొడుకు. ముద్దులు మూటకడు

తున్నట్టున్నాడు. ఎక్కడలేని చక్కదనం పుణికి పుచ్చు కున్నట్టున్నాడు. తామరరేకుల్లా వున్నాయి కళ్లు. ప్రశాం తంగా, సాకూతంగా వుంది చూపు. నవ్వుతున్నట్టున్నాయి పెదవులు. కాళ్ళు చేతులూ ఆడిస్తూ ఆడుకుంటున్నట్టున్నాడు.

వసుదేవుడు చూశాడు. దేవకీ చూసింది. కంసుణ్ణి తలుచుకుని గజగజలాడారు. కాని అంతలోనే ఎక్కడలేని ధైర్యం వచ్చింది వాళ్ళకి. ఏదో ఎన్నడూ లేని సాహసం కలిగింది వసుదేవుడికి. ఎవరో తనను నిర్దేశిస్తున్నారనిపించింది.

కొడుకు నెత్తిపట్టుకున్నాడు వసుదేవుడు. బందిఖానా ద్వారం దగ్గిరికి నడిచాడు. చిత్రం, తలుపులు తెరిచేవున్నాయి. అనుకోకుండానే బయటికి నడిచాడు వసుదేవుడు. బయట హోరుమని వాన. కాని వసుదేవుడు మీద చినుకైనా పడ లేదు.

అప్రయత్నంగా వ్రేపల్లెవేపు నడిచాడతడు. తనకు తెలియకుండానే గబగబా అడుగులు వేస్తున్నాడు.

దారిలో యమున. చీకట్లిలో,మరింత చీకట్లిగా పారుతూ వుంది. నల్లగా మరింత నల్లగా సుళ్లుతిరుగుతూ వుంది.

కొడుకు నెత్తుకి యమునలో దిగిపోయాడు వసుదేవుడు. ఎవరో తనను తీసుకుపోతున్నారు. యమున తప్పుకున్నట్టుంది. కాళ్లు తడవకుండా యమున దాటాడతడు. తిన్నగా వ్రేపల్లె-గొల్లపల్లె చేరాడు. నందుడి ఇంటికి వెళ్ళాడు. గొల్లకోనార్ల నాయకుడు నందుడు.

మధురలాగే గొల్లగూడెమంతా నిద్దరలో మునిగి వుంది. నందుడి ఇంటి తలుపులు బిగించిలేవు. లోపలికి

వెళ్ళాడు వసుదేవుడు. అదే సమయానికి నందుడి ఇల్లాలు యశోద ఆడబిడ్డని కని తెలివిలేకండా పడుంది. ఎక్కడా చడీచప్పుడూ లేదు.

తన కొడుకుని యశోద పక్కనిపెట్టి, ఆమె కూతుర్ని తీసుకు వచ్చేశాడు వసుదేవుడు. వచ్చినదారినే యమునదాటి మధుర చెరసాలలో ప్రవేశించాడు. దేవకివొడిలో యశోద కూతుర్ని పెట్టాడు.

అతడు బంధిఖానాలో చేరాక ఎప్పటిలాగే తలుపులు తాళాలతో బిగుసుకుపోయాయి.

వసుదేవుడు యశోద పక్కనిపెట్టిన నల్లటి కుమారుడే కృష్ణుడు.

## కంసుడి కంగారు

తలుపులు తాళాలు పడ్డాక బంధిఖానాలో కేరుకేరు మని పిల్లఏడుపు వినిపించింది. తుళ్ళిపడి లేచారు కాపలా సిపాయిలు. కంసుడి దగ్గరికి పరిగెత్తి కబురందించారు. కంగారుపడిపోయాడు కంసుడు. ఇన్నాళ్ళూ తాను భయపడుతున్న దేవకి ఎనిమిదో కానుపిది!

ఉన్నపాళాన లేచాడు కంసుడు. విడిపోయిన జుట్టు కట్టుకోలేదు. జారిపోయిన బట్ట సర్దుకోలేదు. అంగలుమీద అంగలు వేసి జైలుదగ్గరికి వచ్చాడు. తలుపుల తాళాలు తీయించాడు. దేవకీవసుదేవుల గదిలో ప్రవేశించాడు.

కంసుణ్ణి చూడగానే కాళ్ళమీద పడింది దేవకి.

"అన్నా! ఇది ఆడపిల్ల, నీ మేనకోడలు. మేనల్లుడు కాదు. దీన్ని చంపకు." అంటూ గోలుగోలుమంది.

కనికరించలేదు కంసుడు. దేవకి ఒడిలోంచి బలవంతంగా లాక్కున్నాడు పిల్లని. రెండు కాళ్ళూ పట్టుకుని రాతిమీద బాదేశాడు.

రాతిమీద పడలేదు పాప. కంసుడి చేతిల్లోంచి జారి పైకి పోయింది. కళ్ళు చెదిరిపోయాయి కంసుడికి. ఆకాశం మీద పెద్ద వెలుగు. ఆ వెలుగులో స్పష్టంగా విన్నాడతడు:

"మూర్ఖుడా! నిన్ను చంపే పిల్లడు మరో దగ్గర వుండనే వున్నాడు."

కంగారు మరింత హెచ్చింది కంసుడికి. ముచ్చెమటలు పట్టాయి. తన కళ్ళని తాను నమ్మలేకపోయాడు. తన చెవులనీ తాను నమ్మలేకపోయాడు. "ఏమిటీమాయ?"

దేవకీ వసుదేవుల్ని చూస్తే భయం వేసిందతడికి. జాలీ వేసింది.

"మీ బిడ్డల్ని వూరికే చంపేశానుకదూ? మన్నించండి. ప్రాణి తాను చేసుకున్నది తాను అనుభవిస్తుంది. మన చేతిలో ఏమీ లేదు." అంటూ వాళ్ళని చెరనుండి వొదిలేశాడు. తిన్నగా తన భవనానికి వచ్చేశాడు. కానీ కంటి మీద రెప్పపడలేదు. తెల్లవార్లూ కంగారు పడుతూనే గడిపాడు.

మర్నాడు కొలువుకూటానికి వచ్చాడు. మంత్రుల్ని

పిలిపించాడు. జరిగింది వినిపించాడు. "ఇప్పుడు ఏమిటి సాధనం? నన్ను చంపే గుంటడు ఎక్కడో ఉన్నాడట! ఎక్కడున్నాడు? ఏం చెయ్యాలో ఆలోచించి చెప్పండి." అన్నాడు.

"దీనికింత కంగారెందుకు మహారాజా?" అంటూ అందుకున్నారు మంత్రులు.

"దేశమంతా గాలించేద్దాం. పిల్లలందరినీ చంపేద్దాం. దాంతో నిన్ను చంపడానికి పుట్టిన గుంటడు ఎవడైనా వుంటే వాడూ చచ్చివూరుకుంటాడు. ఆలస్యమెందుకూ? ఇప్పుడే ఆ పని మొదలెడదాం.

ఇంతకీ ఇది పచ్చిఅబద్ధం. ఏమంటే నిన్ను చంపే వాడెంతవాడుకావాలి? నువ్వు కత్తిపట్టుకుంటే, కళ్ళెర్ర జేస్తే, విల్లుపట్టుకుంటే ప్రపంచమే పరుగుచ్చుకుంటుంది.

ఈ సందర్భంలోనే నీకు వ్యతిరేకులైన వాళ్ళపనీ పట్టించవచ్చు. ఏ విచారణా లేకండా వాళ్ళని తుడిచి పారెయ్యవచ్చు"

మంత్రుల మాటలు తలకిపట్టాయి కంసుడికి. దుష్టుల్నీ, దుర్మార్గుల్నీ, నక్కజిత్తులవాళ్ళనీ, మాయలవాళ్ళనీ, పీకలు కోసేవాళ్ళనీ, వూరూరుకీ పంపాడు. పసిపిల్లల్ని పట్టుకుపోయి పాతిపెట్టమన్నాడు, మందులుపెట్టి, మాయలుచేసీ, పీకలు నులిమి చంపేయమన్నాడు. మంత్రకత్తెల్నీ, మందులమారి దాదుల్నీ నియోగించాడు.

వాళ్ళందరూ దేశంమీదపడ్డారు. పల్లెపల్లె, వాడ వాడా తిరిగి మారువేషాలువేసీ, మాయలుచేసి పిల్లల్ని చంపేస్తూ వచ్చారు. దోపుళ్ళు చేశారు. హత్యలు చేశారు.

పిల్లలతోపాటు తల్లుల్నీ ఎత్తుకుపోయారు. రాజ్యం అరాజకంలా అల్లకల్లోలమయింది. అంతయినా శాంతి కలగలేదు కంసుడికి.

## వింతబాలుడు

పిల్లల్ని చంపడానికి కంసుడు పంపిన దుష్టుల దృష్టి వ్రేపల్లెమీద కూడా పడింది. ఓనాడు ఓ చక్కని పడుచు నందుడింటికి వచ్చింది. పాలు వుబుకుతున్నాయి ఆమె స్తనాలు. నల్లమాణిక్యం బొమ్మలాగ పక్కమీద పడుకున్న యశోద కొడుకుని చూసిందామె. ముచ్చటపడుతూ వొడిలోకి తీసుకుంది. తన పెద్దపెద్ద రొమ్ములు అతడినోట కుడిపింది. రొమ్ములు పట్టుకుని పాలుతాగాడు పిల్లడు. రెండుసార్లు పీల్చాడోలేదో గావుకేకలు వేసింది పడుచు. అతణ్ణి వొదిలేసింది. కాని అతడు వొదలలేదు రొమ్ములు.

గీపెట్టిందామె. గిజగిజలాడిపోయింది. గుమ్మంవేపు పరిగెత్తింది. వాకిలి వెల్లకిలా పడిపోయింది. అందమైన రూపుపోయింది. పెద్ద భూతంలా అయి చచ్చిపోయింది.

యశోదా మొదలైనవారు ఇంటిల్లపాదీ భయపడిపోయారు. ఏమీ ఎరగనట్టు, ఆ చచ్చినదాని రొమ్ములు పట్టుకు ఆడుకుంటున్న అబ్బాయిని తీసి గుండెల కద్దుకున్నారు. ఆవుతోకతో దిగదుడిచారు. ఆవుపేడ వొంటికిరాశారు. ఆవుమూత్రం స్నానంచేశారు.

అలా పాలు కుడపడానికి వచ్చిన పడుచు పూతన

పిల్లల్ని చంపే గ్రహం. రొమ్ముకి విషం పూసుకు వచ్చింది. విషం పూదేసి దాని ప్రాణాలే పీల్చేశాడు యశోద కొడుకు.

పల్లెలోని ఎంతోమంది గొల్లలు వచ్చి, గొడ్డళ్ళతో పూతన కళేబరం తునకలు తునకలు నరికి మోసుకుపోయి పెద్ద చితిమీద తగలబెట్టారు.

మరోనాడు శకటుడు అని మరో దుష్టుడు బండిలావచ్చి ఊయలలోవున్న యశోద కొడుకుమీద పడబోయాడు. ఊయలలోంచే కాలితో బండిని తన్నేశాడు బాలుడు.

మరోనాడు తృణావర్తుడని ఒకడు సుడిగాలిలా వచ్చి యశోదకొడుకుని ఎత్తుకుపోయాడు. కాని అతడిబరువు భరించ లేక క్రిందపడి చచ్చిపోయాడు.

ఆ వింతబాలుణ్ణి చూసి అందరూ ఆశ్చర్యపోయే వారు. అందరూ ముచ్చటపడేవారు. ఆ పల్లెలో అతడు పుట్టటం అదృష్టం అనుకునేవారు.

## కొంటె కోణంగి

నందుడి ఇల్లు నిత్యకల్యాణం పచ్చతోరణంగా వుండేది. నందుడూ, వసుదేవుడూ నమ్మకమైన నేస్తులు. అందుకనే తన భార్య రోహిణినీ, ఆమె కొడుకునీ నందుడింట దాచాడు వసుదేవుడు, కంసుడి కన్నుకప్పి.

రోహిణి కొడుకుకి బలరాముడనీ, యశోద కొడుకుకి కృష్ణుడనీ పేర్లు పెట్టించాడు నందుడు. ఇద్దరూ ఇద్దరే. గొల్ల పిల్లల్ని కూడగట్టుకుని వింత వింత ఆటలు ఆడేవారు వారు.

శుక్లపక్షం చంద్రుడిలాగ పెరుగుతూవుండేవారు. తప్పటడుగు నుంచి పరుగులుపెట్టే స్థితికి వచ్చారు. ఇద్దరిలోనూ పెంకితనానికి పేరుగా తయారయాడు కృష్ణుడు. ఆకతాయితనంలో అందెవేసిన చేయి. భయమంటే ఏమిటో ఎరగడు. ఆబోతు మీదికైనా దురుసుగా ఎగబడేవాడు. ఆడపిల్లల్ని ఏడిపించేవాడు. అయినా అతడితోనే ఆడుకునేవాళ్ళు.

పల్లెలో ఎక్కడ చూసినా అతడే అవుపడేవాడు. ప్రతి ఇంట్లోనూ దూరేవాడు. వాళ్ళు పాలు పిదకకముందే వాళ్ళ దూడల్ని విప్పేసేవాడు. వాళ్ళఇంట్లో పాలూ, పెరుగూ, వెన్నా దొంగిలించేవాడు. తాగినంత తాగి, తిన్నంత తిని కడపది జట్టువాళ్ళకి పంచిపెట్టేవాడు. ఇంకా మిగిలిపోతే కోతులకి పెట్టేసేవాడు.

ఎవరింట్లో ఏముందో, ఏ వుట్టి ఎక్కడుందో కనిపెట్టేసేవాడు. ఏ కుండలో పాలున్నాయో, ఏ చట్టిలో పెరుగుందో, ఏ పిడతలో వెన్నుందో పసికట్టేవాడు. ఉట్లు లందకపోతే పీటలు దొంతి పెట్టేవాడు. ఇంకా అందిరాకపోతే రోలువేసి పీటలు దొంతి పెట్టేవాడు. అంతకీ కాదంటే కింద నించే చిల్లిపెట్టేసేవాడు. గొల్లభామలు తల్లితో చెబితే ఏమీ ఎరగనని కొంటెచూపులు చూసేవాడు. వాళ్ళ మీద తానే పోటీలు చెప్పేవాడు. వాళ్ళు అలికి ముగ్గులు పెడితే వెళ్ళి చురచురా ఉచ్చపోసి పారిపోయేవాడు.

ఓనాడు కృష్ణుడు మన్నుతినడం చూశాడు బలరాముడు. తోడివారితో వచ్చి యశోదతో చెప్పాడు. తినలేదన్నాడు కృష్ణుడు. నోరుచూపమంది యశోద.

నోరు తెరిచాడు కృష్ణుడు. అతడి నోట్లిలో ప్రపంచమే కనపడింది యశోదకి.

ఓనాడు బాగా పూంఠాము చేశాడు కృష్ణుడు. అతడి నడుముకి తాడు చుట్టబెట్టి రోటికి కట్టేసింది యశోద. ఆ దగ్గిరిలోనే రెండు జమిలి మర్రిచెట్లుండేవి. రోలు ఈడ్చుకుంటూ రెంట్రిమధ్యనించీ అవతలికి వెళ్ళాడు కృష్ణుడు. రోలు ఇవతల తగులుకుంది. ఊంకించి లాగాడు కృష్ణుడు. వేళ్ళతో పెల్లగిలి పడిపోయాయి మద్దులు.

మద్దుల చప్పుడు విని పదిమందీ పరిగెత్తుకు వచ్చారు. "ఏనాటి మద్దులు, ఎలా కూలిపోయాయి?" అంటూ నాలికలు కరుచుకున్నారు.

"కృష్ణుడే పడగొట్టేశాడు." అన్నారు అక్కడ ఆడుకుంటున్న పిల్లలు. నమ్మలేదు కోనార్లు. "ఇది ఏదో విడ్డూరం" అనుకున్నారు.

## బృందావనం

"ఇక్కడ రోజురోజుకీ విడ్డూరాలు పెరిగిపోతున్నాయి. ఇంకా ఏమొస్తాయో" అంటూ ప్రేపల్లె గొల్లగూడెం వాళ్ళందరూ గుమికూడారు. అందరిలోకీ వయస్సుమళ్ళిన కోనారి ఉపనందుడు. అతడూ, నందుడూ అందరూ ఆలోచించారు. బృందావనం లేచిపోయారు. ఆలమందలూ, గొడ్డూ గోదా, ఇళ్ళూ వాకిళ్ళూ ప్రేపల్లెనించి తర్లించారు. బళ్ళ

మీదా వాటిమీదా సామానులు వేసుకుని బృందావనం చేరుకున్నారు.

పచ్చికబయళ్ళతోనూ, చెట్టుచేమలతోనూ అందాల దీవిలా వుంది బృందావనం. ప్రక్కనే పారుతూ వుంది యమున ఏరు. ఒడ్డు, ఇసుకతిన్నెలు ఎంతో ఇదిగా వున్నాయి. ఓ ప్రక్క గోవర్ధనపర్వతం గొప్పగావుంది.

అదంతా చూసి వుప్పొంగిపోయారు గొల్లలు. ఎగిరి గెంతులేసారు పిల్లలు.

బృందావనంలో స్థిరపడ్డారు గొల్లలు.

కృష్ణుడూ, బలరాముడూ అయిదారేళ్ళ వయస్సు వాళ్ళయారు. తోడి గొల్ల పిల్లలతో కలిసి దూడలు మేతకి తోలుకు వెళ్ళేవారు. చద్దికూళ్లు పట్టుకెళ్ళి అడవిలో తినేవాళ్లు. ఆవులు మేపుతూ అడవిలో ఆటలాడేవాళ్లు. కొత్త కొత్త ఆటలు పుట్టించే వాళ్ళు. ఆబోతుల్లాగా, ఆవుల్లాగా అరిచేవాళ్లు. కోయిల లాగా, నెమళ్ళలాగా కూసేవాళ్లు. కోతుల్లాగా, కోడెల్లాగా గెంతేవాళ్లు. కొమ్ముబూరా లూదేవాళ్లు. పిల్లనగ్రోలు వాయించి పాడేవాళ్ళు. పొద్దుగూకాక దూడలు తోలుకుని ఇంటికి వచ్చేవాళ్లు.

బృందావనంమీద, ముఖ్యంగా రామకృష్ణులమీద కసిగానే వుండేది కంసుడికి. వాళ్ళని చంపడానికి రకరకాల పన్నాగాలు పన్నేవాడతడు. రకరకాల మాయగాళ్ళని పంపేవాడు.

ఒకనాడు వత్సుడని ఒక రాక్షసుణ్ణి పంపాడు. కామ రూపుడు వత్సుడు. దూడవేషంలో వచ్చి బలరామకృష్ణుల మందలో ప్రవేశించాడతడు. కనిపెట్టేశాడు కృష్ణుడు. దువ్వడానికి వెళ్ళినట్టు నెమ్మదిగా దగ్గిరికి వెళ్ళాడు. ఒడుపుచూసి, తోకా, వెనక కాళ్ళూ పట్టేశాడు. గిరగిరా తిప్పి ఓ వెలగచెట్టు మానుకేసి బాదేశాడు. చచ్చి వూరుకున్నాడు వత్సుడు.

మరోనాడు బకుడని మరో రాక్షసుణ్ణి పంపాడు కంసుడు. పెద్ద కొండంత కొంగలా వచ్చి వాలాడు బకుడు. పూతన తమ్ముడు వాడు.

చేపని మింగేసినట్టు కృష్ణుణ్ణి మింగేశాడు బకుడు. ఇట్టే మింగాడో లేదో అగ్నిహోత్రం మింగినట్టనిపించింది వాడికి. గబుక్కున కక్కేశాడు. కిందపడి లేచాడు కృష్ణుడు. బకుడి నోరు పట్టుకుని చివరిదాకా చీల్చేశాడు. రెండు చెక్కలయి చచ్చిపోయాడు బకుడు.

ఇంకోనాడు బకుడి తమ్ముడు అఘుడు వచ్చి పడ్డాడు. బ్రహ్మాండమైన కొండచిలువలాగ తయారయాడు. పెద్ద కొండగుహలా నోరు తెరిచి, దూడల్నీ, కోనారి పిల్లల్నీ మింగేశాడు.

చూశాడు కృష్ణుడు. తానూ ఆ కొండచిలువ నోట్లో దూరాడు. కొండలాగా శరీరం పెంచేశాడు. పొట్టపగిలి చచ్చిపోయాడు అఘుడు.

## తాటివనం

మరికొంచెం పెరిగారు రామకృష్ణులు. అంతవరకూ లేగలూ, దూడలూ మేపుకు వచ్చేవారల్లా, ఇప్పుడు ఆవులు కూడా తోలుకువెళ్లడం మొదలుపెట్టారు. తలకి నెమలి పింఛం కట్టుకుని, ముక్కున ముత్యం, చేతికి కడియాలూ, చేతిలో పిల్లనగ్రోవి, మెడలో హారాలూ - ఇలా ఆలమంద వెంట పెందరాళే బయలుదేరేవాడు కృష్ణుడు. పక్క బల రాముడుండేవాడు. కడమ గొల్ల కుర్రాళ్లు గెంతుతూ, పాడుతూ నడిచేవారు.

కృష్ణుడిలో చిన్నప్పటినుంచీ చిత్రమైన శక్తులు చూసి అతడంటే అందరూ ప్రాణం పెట్టేవారు.

గోవర్ధనపర్వతం మీదా, చుట్టుపట్ల అడవుల్లోనూ ఆవులు మేపుకొని, ఆటలాడుకునేవారు. అడవుల్లో పళ్లుతినే వారు. పువ్వులు కోసేవారు. చెరువుల్లో ఈత కొట్టేవారు. సాయంకాలం పిల్లనగోవులు వూదుకుంటూ, ఈలలు వేసు కుంటూ ఇంటిమొహం పట్టేవారు. ఆవులడెక్కలతో రేగిన ధూళిపడి వాళ్ల ముంగురులు సంజఎరుపులో మెరిసేవి. ఆవుల అంబారవాలూ, కొడుకుల పిల్లనగోవులూ విని తల్లులు గుమ్మాలలోకి ఎదురు వచ్చేవారు. ఊరి గొల్లపడు చులు ఎవరేపనిలోవున్నా వొదిలేసి గుమ్మాలలోంచి చూసేవారు. ముచ్చట పడేవారు. రోజంతా వాచిపోయి నట్టుండేవారు.

అవాళ అడివిలో ఆవులు మేస్తున్నాయి. రామ

కృష్ణుల చుట్టూ ఆలకాపరి కుర్రాళ్ళు కూచున్నారు. అందరూ సరదాగా వున్నారు. వాళ్ళలో సుధాముడూ, సుభలుడూ, ఇలా అందుకున్నారు:

"రామా! కృష్ణా! ఇక్కడికి కొంతదూరంలో గొప్ప తాటిచెట్ల అడివుంది. అంతేసి తాటిపళ్లు తియ్యగా తేనెలా వుంటాయట. మేమెప్పుడూ తినలేదు. అసలు అక్కడికి వెళ్ళడానికే వల్లకాదు. అక్కడ ధేనుకుడని ఒకడున్నాడు. గాడిదలా వుంటాడు. తాటిపళ్ళన్నీ వాడే చప్పరించేస్తాడు. వాడి బంధువులూ గాడిదలే. మనుషుల్నే తినేస్తారు వాళ్లు.

ఎన్నాళ్ళయో తాటిపళ్లు తినాలనుంది మాకు. మీరు తలుచుకుంటే అవుతుంది" అన్నారు.

"అయితే పదండి" అన్నారు రామకృష్ణులు. లేడికి లేచిందే పయనం. పోలో అని అందరూ తాటివనం వెళ్ళారు.

ఎన్నో చెట్లు, చెట్లనిండా పళ్లు. ఎంతో బావుంది తాటివనం. పళ్ళవాసన నోరూరిస్తూవుంది. ఒక్కొక్క చెట్టూ పట్టి వూపాడు బలరాముడు. దభీదభీ రాలిపడ్డాయి పళ్లు. చేతికి దొరికిన పళ్లు తినడం మొదలెట్టారు కుర్రాళ్లు.

ఇదంతా విన్నాడో లేదో ధేనుకుడు అరుస్తూ పరుగెత్తుకు వచ్చాడు. గాడిదలాగే వున్నాడు వాడు. గాడిదలాగే వెనకకాళ్ళతో బలరాముణ్ణి తన్నాడు.

తన్నిన రెండుకాళ్లు పట్టేశాడు బలరాముడు. తిప్పి తిప్పి ఓ తాటిచెట్టుకేసి కొట్టాడు. దెబ్బతో చచ్చిపోయాడు ధేనుకుడు. తాటిచెట్టు విరిగి ఇంకో తాటిమీదా, అది విరిగి ఇంకో దానిమీదా పడ్డాయి. ఇలా ఎన్నో విరిగిపోయాయి.

గావుకేకలు వేస్తూ ధేనుకుడి బధువులు వచ్చిపడ్డారు. అందరూ గాడిదలే. అందరినీ చంపేశారు రామకృష్ణులు. అవాళనించీ తాటివనం కూడా ఆలకాపర్లకి ఆటచోటయింది.

## కాళియనాగు

యమునానదిలో ఒక మడుగుండేది. అందులో కాళియనాగు కాపరంచేస్తూ వుండేవాడు. అంచేత మడుగు నీళ్లు విషంగా వుండేవి.

అవాళ బృందావనం ఆలమందలు అటువేపే తోలుకు వెళ్ళారు. బలరాముడు రాలేదు. ఇంటిదగ్గిరే వుండి పోయాడు.

మడుగు చూశాడు కృష్ణుడు. ఒడ్డుమీది కడిమి చెట్టెక్కి మడుగులోకి దూకాడు. గోతాలుకొట్టి మడుగంతా కలిచేశాడు.

కస్సుమంది కాళియనాగు. వందనొక్క పడగలతో లేచింది. కసిదీరా కాటేసింది. తుటాయించి పోయాడు కృష్ణుడు.

తండ్రి నందుడూ, తల్లి యశోదా గుండెలు బాదు కుంటూ వచ్చారు. మడుగులోకి వురకబోయారు. అడ్డు కున్నాడు బలరాముడు. బృదావనంలో పిట్టమనిషి లేకండా వచ్చేశారు. అంతమందీ గోలుగోలుమన్నారు.

అంతలోనే జల్దుకున్నాడు కృష్ణుడు. కాళియనాగు పడ గల మీదెక్కి తాండవం చేశాడు. దుముకులతో, తాపు

లతో నాగుపడగలు పగలగొట్టాడు. రక్తాలు కక్కించాడు. ఒళ్లంతా పుండుపుండు చేసేశాడు. చచ్చే స్థితికి వచ్చాడు కాళియుడు.

అతడి భార్యలు వచ్చి కృష్ణుణ్ణి బతిమిలాడారు. పతి భిక్ష పెట్టమని ప్రార్థించారు.

కనికరించాడు కృష్ణుడు. కాళియనాగునీ, అతడి భార్యల్నీ మడుగులోంచి తరిమేశాడు.

నవ్వుతూ మడుగులోనించి వచ్చాడతడు. "నా కన్న తండ్రే" అంటూ గుండెలకి అదుకుంది అమ్మ యశోద. గొల్ల పడుచులందరూ అలాగే అతణ్ణి నలిపేశారు. "నా నల్లనయ్య మనలాంటి మనిషి కాడు" - ఎత్తుకుని ముద్దులాడాడు నందుడు.

ఆ రాత్రి అక్కడే వుండిపోయారు గొల్లపడుచులు.

## దొంగకోనారి

ఎప్పటిలాగ ఆవులు మేపుకుంటూ అడివిలో ఆడు కుంటున్నారు రామకృష్ణులు. ప్రలంబుడని ఒక రాక్షసుడు కోనారివేషం వేసుకుని వారి దగ్గిరికి వచ్చాడు. ఒడుపు చూసి వారిని ఎత్తుకుపోవాలని వాడి ఎత్తు. ఆవలిస్తే పేగులు లెక్కపెడతాడు నల్లకృష్ణుడు. ఆ వచ్చిన దొంగకోనారిని పసికట్టి జట్టులోకి రానిచ్చాడు, ఆటలోనూ కలుపుకున్నాడు.

కొత్త ఆట మొదలయింది. కుర్రాళ్లందరూ రెండు జట్లుగా ఏర్పడ్డారు. ఓ జట్టుకి కృష్ణుడూ, మరో జట్టుకి బల రాముడూ నాయకులు. ఆటలో గెల్చినవాళ్లని ఓడిపోయిన వాళ్లు కొంతదూరం మోసుకు వెళ్లాలి.

తొలి ఆటలో బలరాముడి జట్టు గెలిచింది. కృష్ణుడి జట్టు ఓడిపోయింది. ఇనక కృష్ణుడి జట్టు బలరాముడి జట్టు వాళ్ళని మొయ్యాలి. కృష్ణుడి జట్టులోవున్న దొంగ కోనారి-ప్రలంబుడు బలరాముణ్ణి వీపుమీద ఎక్కించుకున్నాడు. కొంతదూరం మోసుకుపోయి, గొల్లవాడల్లా రాక్షసుడుగా కనబడ్డాడు. వీపుమీంచే బలంకొద్దీ గుద్దాడు బలరాముడు. రక్తం కక్కుకు చచ్చాడు ప్రలంబుడు.

## అడివిలో అగ్గి

ఎండలు మండిపోతున్నాయి. జట్టు పిల్లలతో చెట్ల నీడల్లో ఆడుకుంటున్నారు రామకృష్ణులు. ఆవులు పచ్చిక బయళ్ళలో మేస్తూ దూరంగా వెళ్ళిపోయాయి. కనుచూపు మేరలో కనిపించలేదు. ఆట కట్టిపెట్టి వెదుకుతూ బయలు దేరారు గొల్లపిల్లలు.

తన ఆవులికి రకరకాల పేర్లు పెట్టాడు కృష్ణుడు. అతడి పిలుపు వినిపిస్తే చాలు, తోకలెత్తుకు పారివచ్చేవి ఆవులు. దేన్ని పిలిస్తే అదే వచ్చేది.

పేరుపేరునా ఆవుల్ని పిలుస్తూ, అడవి నుంచే అడివికి వెళ్లాడు కృష్ణుడు.

ముంజగడ్డి అడవిలో మేస్తున్నాయి ఆవులు. మేకలూ, గేదెలూ అన్నీ అక్కడే వున్నాయి. బృందావనం సొమ్ముల మందంతా అక్కడే వుంది.

కృష్ణుడి పిలుపు విన్నాయి ఆవులు. అంబా అంటే అంబా అని పలికాయి. పోయిన ప్రాణం లేచివచ్చింది గొల్లలకి. మందలు మళ్లించారు వాళ్లు.

ఇంతలో ఎక్కడ ఏమయిందో అడవిలో అగ్గి అంటుకుంది. ముందు వెనకా ముట్టుకుంది. అసలే ఎండల్లో ఎండి వుంది అడివి. అగ్గికి గాలి తోడయింది. చిట్టికెలో సొమ్ముల్నీ, సొమ్ముల కాపర్లనీ చుట్టుముట్టింది.

కుయ్యో మొర్రో మన్నారు గొల్లలు. ఆవులూ అడిలిపోయాయి. అందరూ రామకృష్ణుల చుట్టూ మూగారు. ప్రాణాలమీద ఆస వొదులుకున్నారు.

"మీరందరూ కళ్లు మూసుకోండి." అన్నాడు కృష్ణుడు. కిక్కురు మనకుండా కళ్లు మూసుకున్నారు వాళ్లు.

"ఊఁ, చూడండి" అన్నాడు కృష్ణుడు. చూశారు వాళ్లు. మచ్చుకైనా లేదు అగ్గి.

"కృష్ణుడు మింగేశాడు" అనుకున్నారు వాళ్లు.

ఆడుతూ, పాడుతూ, కుప్పిగెంతులు వేస్తూ, కేరింతలు కొడుతూ పొద్దుపోయేసరికి అంతమందీ ఇళ్లుచేరుకున్నారు.

## చీరెల దొంగ

నందుడింటికే కాదు, బృందావనం అంతటికీ వెలుగుగా వుండేవారు రామకృష్ణులు. బలరాముడు ఎంత తెలుపో కృష్ణుడు అంత నలుపు. నాణ్యమంతా నలుపులోనే

వుండేది. అతడి అందం చూసి ఆడాళ్లేకాదు మగాళ్లుకూడా మురిసిపోయేవాళ్లు. అతడివయసు అమ్మాయిలు అతణ్ణే పెళ్లాడాలని ఉవ్విళ్లూరేవాళ్లు. ఆడుతున్నా, పాడుతున్నా అతడిమీదే ధ్యాస పెట్టుకునేవాళ్లు. అతడి మాటలే చెప్పుకునేవాళ్లు. అతణ్ణే కోరేవాళ్లు. విలవిలలాడిపోయేవాళ్లు. మనస్సులో అతణ్ణి కౌగిలించుకునేవాళ్లు. మనస్సులోనే జత కూడేవాళ్ళు; కరిగిపోయేవాళ్లు. రకరకాలయేవాళ్లు.

కృష్ణుడు దగ్గిర అడవిలోంచి మురళి వాయించేవాడు. అడివి అడివంతా వొళ్లు మరిచిపోయేది. ఆవులు నెమరు మానేసి నిలిచిపోయేవి. లేళ్లు మొదలైన అడివి జంతువులూ మేతమాని వింటూ వుండిపోయేవి. రకరకాల పిట్టలు వచ్చి చెట్లమీద వాలి ఆలకించేవి. నెమళ్లు వచ్చి నాట్యంచేసేవి. మబ్బులు వచ్చి గొడుగులు పట్టేవి. చెట్లు తలలూపి పూలు రాల్చేవి. యమున పులకరించేది. సెలయేళ్ళు పులకరించేవి. గోవర్ధనం పులకరించేది. లోకమంతా మురళి పాటలో మునిగి పోయినట్టుండేది.

పిల్లగాలిలో మురళిపాట బృందావనం మీదికి వచ్చేది. గొల్లపడుచుల్ని కొల్లగొట్టేది. తామెక్కడున్నదీ, ఏం చేస్తున్నదీ తెలిసేది కాదు వాళ్లకి. శరీరాలు అక్కడే వున్నా మానసికంగా కృష్ణుడి దగ్గిరే వుండేవాళ్లు వారు. అతణ్ణి పెన వేసుకున్నట్టు, అతడి వొడిలో వాలిపోయినట్టు, అతడిపొత్తులో కరిగిపోయినట్టు అనుకునేవాళ్లు. ప్రతిపడుచూ మురళి తన పేరుపెట్టి, తననే పిలుస్తున్నట్టు ఆవేశపడేది.

"కృష్ణుడే మా మగడుకావాలి" అని నోముపట్టారు

గోపకన్యలు. అవాళ వేకువనే లేచారు. ఒకళ్ళనొకళ్లు పిలుచుకున్నారు. యమునానదికి వెళ్లారు. చీరెలు విప్పేసి, స్నానంకోసం యమునలో దిగారు. ఒకళ్ళమీద వొకళ్లు నీళ్లు చల్లుకుంటూ కేరింతలాడారు.

ఇంతలో కృష్ణుడు తన జట్టుదార్లతో అక్కడికే వచ్చాడు. సన్నసన్నగా వాళ్ళచీరెలు చపాయించాడు. గట్టుమీద కడిమిచెట్టెక్కి కూర్చున్నాడు. జట్టుదార్లు అంశుడూ, స్తోకకృష్ణుడు, సుధాముడు, సుబలుడు, అర్జునుడు, విశాలుడు, వృషభుడు, తేజస్వీ, దేవప్రస్థుడు, వరూధపుడు మొదలైన వాళ్లు పకపకనవ్వారు.

"ఏయ్, ఆడపిల్లలూ !" చెట్టుమీంచి పిలిచాడు కృష్ణుడు. "ఇవిగో మీ చీరెలు నా దగ్గిరున్నాయి. కావాలంటే రండి, ఇచ్చేస్తాను" అన్నాడు.

"అమ్మ, చీరెలదొంగ" అనుకున్నారు గోపకన్నెలు. సరదాగానే వుంది వాళ్ళకి. ఒకళ్ళమొహం ఒకళ్లు చూసుకున్నారు. సిగ్గుపడిపోయారు. లోతునీళ్ళలోకి వెళ్ళిపోయారు

"అయితే మీ ఇష్టం. నేను ఎంతంటే అంతే. అబద్ధం నాకు తెలీదు" అంటూ కూర్చున్నాడు కృష్ణుడు.

ఏందారి ? నీళ్ళలోంచే బతిమిలాడారు అమ్మాయిలు. ఊఁహూఁ, కొంటెపట్టు పట్టాడు నల్లబ్బాయి. ఎంతసేపని వుంటారు నీళ్లలో పడుచుపిల్లలు. కొరడుబారిపోతున్నాయి శరీరాలు. చేసేదిలేక తెగించారు వాళ్లు. చేతులతో మర్మస్థానాలూ, రొమ్ములూ అడ్డుపెట్టుకుని, సిగ్గుపడుతూనే బయ

టికి వచ్చారు "సరేనా! ఇక మా బట్టలు మాకు పడెయ్యి బాబూ!" అన్నారు.

"అబ్బే, అలాకాదు" అంటూ మళ్లీ ఎత్తుకున్నాడు కృష్ణుడు. "అందరూ చేతులెత్తి దండం పెట్టండి" అని పట్టు పట్టాడు.

"కానీ నాయనా!" అంటూ అలాగేచేశారు పడుచు కన్యలు.

కిలకిల నవ్వుతూ ఎవరి చీరెలు వారికిచ్చేశాడు కృష్ణుడు.

"ఇదిగో చూడండీ! నోముకోసం స్నానాలకి వచ్చారు మీరు. బట్టలు విప్పుకుని స్నానంచెయ్యవచ్చా? తప్పుకదూ! తప్పుచేస్తే నోముఫలించదు. దుర్గ వరమివ్వదు.

నన్ను కలియాలని మీ కోరిక. వెన్నెలరాత్రిళ్లు మీ కోరిక తీరుతుంది, వెళ్ళండి." అన్నాడు.

## సోమిదమ్మలు

ఎంత అందమైనవాడో అంత బలవంతుడు కృష్ణుడు. ఎంత బలవంతుడో అంత బుద్ధిమంతుడు.

ఓనాడు చెట్లతోపుల్లోంచి ఆవులు తోలుకుంటూ యమున ఒడ్డుకి వెళ్లాడతడు. కాయలతోనూ, పండ్లతోనూ వాంగివాంగిపోతున్నాయి చెట్లు. చల్లగావుంది వాటి నీడ. కమ్మగావుంది వాటి గాలి.

"ఈ చెట్లని చూడండోయి!" అంటూ జట్టుదార్లతో

అందుకున్నాడు కృష్ణుడు, "ఒకరికి ఉపకారం చెయ్యడంలో చెట్లవంటి ప్రాణులు మరేవీ లేవు. పువ్వులూ, కాయలూ, పళ్ళూ, ఆకులూ, కొమ్మలూ - తుదకి వాటి శరీరమూ పరుల కోసమే ఇస్తాయి. మనం ఎంతయినా నేర్చుకోవాలి వీటి దగ్గిర."

ఆటపాటలతో పాటు ఇలా ఎన్నో బుద్ధులు తన తోడి వారికి నేర్పేవాడు.

ఆవులు మేపుకుంటూ ఎంతో దూరం యమునఒడ్డున వెళ్ళి అవాళ కూచున్నారు రామకృష్ణులు. కొంచేపయాక ఆకలిగా వుందన్నారు ఆలకాపర్లు.

"అవును. అన్నయ్యకీ, నాకూ ఆకలిగా నే వుంది." అన్నాడు కృష్ణుడు. "కొంచెందూరంలో బ్రాహ్మలు యజ్ఞం చేస్తున్నట్టున్నారు. వెళ్ళి అడగండి అన్నం పెడతారు."

వెళ్ళారు గొల్లలు. చచ్చాక స్వర్గానికి వెళ్ళాలని గొప్ప యజ్ఞం చేస్తున్నారు బ్రాహ్మలు. వేదాలు బట్టీపెట్టిన వేదవాదులు వాళ్లు. "అంతా మాకే తెలుసు" అనుకునే వాళ్లు. తామే గొప్పవాళ్ళమనుకునేవాళ్లు. నిజానికి చదువు కున్న మూఢులు వాళ్లు.

గొల్లలు వెళ్ళి అన్నమడిగారు. ఆకలిగావుందన్నారు. అన్నంపెట్టలేదు సరికదా పలకనన్నా పలకలేదు బ్రాహ్మలు.

ఉసూరుమని తిరిగి వచ్చేశారు గొల్లలు. "నిరాశపడ కండి" అన్నాడు కృష్ణుడు. "ప్రయత్నం మానకూడదు మనిషి, మళ్ళీ వెళ్ళండి. ఆ బ్రాహ్మల భార్యలు 'పత్నిశాల'లో

వుంటారు. వాళ్ళనడగండి. నా పేరు చెప్పండి. మన ఆకలి తీరినంత— మన అందరికీ సరిపడినంత అన్నమిస్తారు."

మళ్ళీవెళ్లారు గొల్లలు. సోమిదమ్మల్ని చూచారు.

"అమ్మా, మేం బృందావనం గొల్లలం." అంటూ అందుకున్నారు.

"బృందావనం" అనగానే గుబగుబలాడిపోయారు సోమిదమ్మలు. ఉన్నపాళాన లేచి ముందుకి వచ్చారు, అందరూ.

"కృష్ణుడూ, బలరాముడూ అందరమూ ఆవులు మేపుకుంటూవచ్చాం. రామకృష్ణులు కొంచెందూరంలోనే ఆలమందలో వున్నారు. అందరికీ ఆకలిగావుంది. అన్నంకోసం మీ దగ్గిరికి పంపారు." అన్నారు, వినయంగా.

కృష్ణుడిపేరు చెప్పేసరికి నిలవలేకపోయారు సోమిదమ్మలు అంతకిముందే అమ్మలక్కలదగ్గిర ఆనోటా ఈ నోటా కృష్ణుడి అందచందాలు విన్నారు. గొల్లపడుచులలాగే వీళ్లున్నూ కృష్ణుడిమీద వలపు పెట్టుకున్నారు. అతడు దగ్గిరలోకే వచ్చాడనగానే మంచిమంచి వంటకాలూ అవీ పట్టుకుని క్షణాలమీద బయలుదేరారు. వాళ్ళ భర్తలూ వాళ్ళూ అడ్డుకోబోయారు. లక్ష్యపెట్టలేదు.

వారు వచ్చేసరికి, పూసిన అశోకవనంలో వున్నాడు కృష్ణుడు. చూసేందికి రెండుకళ్ళూ చాలవన్నంత చక్కగా వున్నాడు. తలమీది నెమిలిపింఛం, నల్లమేఘంమీద ఇంద్ర ధనుస్సులావుంది. కళ్ళతోనే అతడి అందం తాగేస్తూ, మనసా అతడి గుండెలమీద వాలిపోయారు సోమిదమ్మలు.

వాళ్ళ మొహాలలో కామవాంఛ కనిపెట్టాడు కృష్ణుడు. వాళ్ళ శరీరాలు వాళ్ళ అదుపులో లేవు.

"మీరంతా నా కోసమే వచ్చారు కదూ? నాకు తెలుసు, నామీద ప్రేమతో వచ్చారు. నాతో కలియా లనుకుంటున్నారు. ప్రేమకి శారీరకంగానే కలియనక్కరలేదు. మానసికంగా కలిస్తే చాలు. అసలు మానసికమైన కలయికే గొప్పది. మీరు వచ్చారు. నన్ను చూశారు. ఇక వెళ్ళండి మీమీ మగళ్ళు మీతో కలిసి యజ్ఞం పూర్తిచేస్తారు." అన్నాడు.

తిరిగి వెళ్ళండంటే సోమిదమ్మల మనస్సు చివుక్కుమంది.

"మా వాళ్ళని వొదిలేసి లేచి వచ్చేశాం ఏకంగా. మా మగవాళ్ళు మరి మమ్మల్ని ఏలుకోరు. కులంవాళ్ళు రానివ్వరు. అత్తమామలు ఇంట్లో పెట్టరు. నువ్వే మా మగడివి. వెళ్ళిపొమ్మనకు. నీ వాళ్ళం మేం" అన్నారు సోమిదమ్మలు.

"నావాళ్ళే మీరు. కనకనే చెపుతున్నాను. మీ వాళ్ళెవరూ ఏమీ అనరు. తప్పపట్టరు. మీ మగలు మిమ్మల్ని ఏలుకుంటారు. సమయం వస్తుంది. నన్ను కలుసుకుందురు కాని, వెళ్ళండి" అంటూ నచ్చచెప్పాడు.

సోమిదమ్మలు తిరిగి భర్తల దగ్గిరికి వెళ్ళిపోయారు. ఎవరూ ఏమీ అనలేదు. ఒక అవధాని మాత్రం తన ఇల్లాలిని పొమ్మన్నాడు. ఈ గ్రామ్య సంసర్గంతో నా పవిత్ర కులం పాడు కాకూడదన్నాడు. పాపమా ఉత్తను ఇల్లాలు ఆత్మహత్య చేసుకుంది.

# కొండపూజ

పంటలు పండాలంటే, పశువులికి మేత వుండాలంటే వానలు కురవాలి. వానలు కురవాలంటే మేఘాలురావాలి. మేఘాలికి రాజు ఇంద్రుడని తరతరాలనించి గొల్ల కోనార్ల నమ్మకం. అందుకని ప్రతిఏడూ ఇంద్రుణ్ణి గొప్పగా పూజించేవారు వారు. పెద్ద పండగా చేసేవారు. ఆయేడూ ఇంద్రుడి పండగ తలపెట్టారు నందుడూ మొదలైన వారు. ఇంద్రపూజ చెయ్యకపోతే అతడు మేఘాలు పంపడు. వానలు పడవు. పంటలు పండవు అని వాళ్ళ భయం.

అదంతా చూశాడు కృష్ణుడు. తెలివిమాలిన పని అని గ్రహించాడు. విప్లవం లేవదీశాడు.

"మనం చేసిందే మనం అనుభవిస్తాం. పంటకీ ఇంద్రుడికీ సంబంధం లేదు. మేఘాలికి ఇంద్రుడు రాజనడం అసందర్భం. మన ఆవులే మనసొమ్ము. అడవులే మన గ్రామాలు. కొండలే మన అండ. పండగ చేసుకోవాలంటే ఆవులపండగ చేసుకుందాం, గోవర్ధనం కొండ పండుగ చేసుకుందాం," అన్నాడు.

బావుందంటే బావుంది అన్నారు గొల్లలు.

ఇంద్రుడి పండగ మానేశారు. ఆవులపండగా, కొండ పండగా గొప్పగా చేశారు. గొల్లపల్లెలో అంతపండగ ఏనాడూ జరగలేదు. ఆవుల్ని అలంకరించారు. మంచి మంచి పిండివంటలు తినిపించారు. పచ్చగడ్డి కోసి వేశారు. అంత మందీ తలంటుకుని తానాలు చేశారు. ముస్తాబులు చేసుకున్నారు. ఆలమందలు తోలుకుని గోవర్ధనం కొండకి బయలు

దేరారు. ఆడవారు ఎడ్లబళ్ళమీద పయనం కట్టారు. దారి కడాకూ పాటలు పాడారు.

ఆలమందలతోనూ, తప్పెట్లతోనూ, తాళాలతోనూ అంతమందీ కొండచుట్టూ తిరిగారు. గొల్లసుద్దులు పాడారు. కొమ్ముబూరాలూదారు. పిల్లనగ్రోలు వాయించారు. పూలతో కొండని ముస్తాబు చేశారు. పళ్ళూ, పిండివంటలూ, పాయసాలూ కానుకలిచ్చారు. అన్నీ అయ్యాక పిండివంటల తోనూ, పప్పులూ పరమాన్నాలతోనూ, పాలూ పెరుగుల తోనూ విందులుకుడిశారు.

ఉన్నట్టుండి భూతాల్లాంటి నల్లమబ్బులు విరుచుకు వచ్చాయి. పెనుగాలి రేగింది. ఉరుములురిమాయి. పిడుగులు ఫెళఫెళమన్నాయి. ఆకాశం చిల్లులు పడినట్టు వాన ముంచుకు వచ్చింది. రంయ్యి రంయ్యి తుఫాను కొట్టింది. చెట్లు వ్రాగిపోయాయి, విరిగి ఎగిరిపోయాయి. ఇళ్ళు కూలి పోయాయి. ఇంటికప్పు లూడిపోయాయి. బృందావనం మునిగిపోయింది. రాళ్ళలాగ వడగళ్లు పడ్డాయి.

అదంతా ఇంద్రుడి కోపం అనుకున్నారు మునిలి కోనార్లు. మరి బతకమే బతకం అనుకున్నారు. "ఇప్పుడేం దారి?" అంటూ కృష్ణుణ్ణి చేరుకున్నారు.

"భయపడకండి" అభయమిచ్చాడు కృష్ణుడు. గోవర్ధన పర్వతం ఎత్తి పట్టుకున్నాడు. దానికింద పల్లె పల్లె నంతా, ఆలమందలతో కూడా చేర్చి కాపాడాడు. అలా

ఒకరోజు కాదు, రెండు రోజులు కాదు ఏడు రోజులు కాపాడాడు. కనీ వినీ ఎరగని పనిచేశాడు.

గాలీ వానా వెలిసింది. ఎప్పటిలాగా బృందావనమూ కలకల్లాడింది. కృష్ణుడంటే సామాన్యుడు కాడని నమ్మారు కోన్నార్లు. పసినాటినుంచీ అతడు చేసిన అద్భుతాలు చెప్పు కున్నారు. ఏది వచ్చినా అతడి దగ్గిరికి పరిగెత్తేవారు. అతడేం చెపితే అది చేసేవారు. అతడు తమ మధ్య వుండడం పరమభాగ్యం అనుకునేవారు.

## గొల్ల పడుచులు

పుచ్చపువ్వులా వుంది వెన్నెల. పిండార పోసినట్టుంది శరత్కాలం. పున్నమరాత్రి వెన్నెట్లో మునిగినట్టుంది బృందావనం. వెన్నెల స్నానం చేస్తున్నాయి చెట్టుచేమలు. వెన్నెల పువ్వులు పూస్తున్నాయి పూలపొదలు. వెన్నెలలో కరిగి పారుతూవుంది యమున. ఆకాశ నిండా వెన్నెల పండగ. చందమామ రాజు, చుక్కలన్నీ రాణులు. చంద మామ కృష్ణుడు, చుక్కలు గొల్లపడుచులు.

యమున పక్కతోపులో కృష్ణుడు మురళి వూదాడు. యమున కిలకిలలాడింది. ఇసకతిన్నెలు గుసగుసలాడాయి.

మురళి మోగింది. మోహనంగా మోగింది. ఎన్నడూ లేనంత తియ్యగా మోగింది. మంత్రించినట్టు మోగింది. మత్తెక్కిస్తూ మోగింది. మైమరిపిస్తూ మోగింది. గాలి కెరటాలమీద, వెన్నెల తరగలమీద, గొల్లపల్లె

పడుచుల చెవులమీద మోగింది. కామం కదిలిస్తూ మోగింది. కోరిక రేకెత్తిస్తూ మోగింది. లెమ్మంటూ మోగింది. రా రమ్మంటూ మోగింది.

మురళి విన్నారు గొల్ల పడుచులు. ఎక్కడి పని అక్కడ పడేసి బయలుదేరారు.

మగడి పక్కనున్నది మగణ్ణి వొదిలేసి బయల్దేరింది. తిండి తింటున్నది తిండి వొదిలేసి బయల్దేరింది. స్నానం చేస్తున్నది తడి చీరతోనే బయలుదేరింది. కొప్పు విప్పుకున్నది విప్పుకునే బయలుదేరింది. బట్ట కట్టుకుంటున్నది కట్టీ కట్టకుండానే బయలుదేరింది.

ముందూ వెనకా కనబడలేదు వాళ్ళకి. కాళ్ళు కింద నిలవలేదు వాళ్ళకి. జంకూ గొంకూ కలగలేదు వాళ్ళకి.

అత్తమామలు అడ్డలేకపోయారు వాళ్ళని. మగలు అటకాయించలేకపోయారు. వెర్రెత్తినట్టు పరిగెత్తారు పడుచులు. ఒకరికి తెలియకండా వొకరు పరిగెత్తారు. ఒక్క ఉదుటున కృష్ణుడుదగ్గిర చేరుకున్నారు.

మురళి ఆపాడు కృష్ణుడు.

"ఏమిటి ఇలా వచ్చారు? ఇల్లు వొదిలి, పల్లెవొదిలి, రాత్రివేళ రావచ్చా?"

చిన్నబుచ్చుకున్నారు పడుచులు. కళ్ళనీళ్ళు పెట్టుకున్నారు. దీనంగా చూశారు.

"వెళ్ళిపోండి, రంకుతనం తగదు."

నొచ్చుకున్నారు పడుచులు. వాళ్ళ అదుపులో వాళ్లు

లేరు. అన్ని అడ్డంకులూ తెంపుకునే వచ్చారు వాళ్లు. కామంతో కంగారు పడుతూ వచ్చారు.

"కృష్ణా!" అభిమానంతోనూ, ఆవేదనతోనూ అన్నారు పడుచులు, "నిన్నే నమ్ముకుని వచ్చాం. నీకోసమే వచ్చాం. అన్నీ వొదులుకుని వచ్చాం. బిడియాం విడిచి అడుగుతున్నాం, నువ్వు కావాలి మాకు. మమ్మల్ని ఏలుకో. మమ్మల్ని అనుభవించు. ఈ కామంసించి కడతేర్చు." అంటూ అతణ్ణి గుండెల కద్దుకున్నారు. అతడిమీద వాలి పోయారు.

చిరునవ్వుతో చేరదీశాడు కృష్ణుడు. యమున ఇసక తిన్నెల మీదికి వాళ్ళని తీసికెళ్ళాడు. వాళ్ళ కొప్పులు తాకాడు. రొమ్ములు పట్టుకున్నాడు. గోళ్ళతో నొక్కాడు. పోకముల్లు విప్పాడు. రమించాడు. తన్మయం కలిగించాడు.

ప్రతి పడుచూ తనతోనే కృష్ణుడు మనసారా రమించాడని తృప్తిపడింది, గర్వమున్నూ పడింది.

అందరికీ అన్నిరకాలయి అంతలోనే అవుపడకండా పోయాడు కృష్ణుడు. ఏడంటే ఏడీ అని వెదుకులాడారు పడుచులు. నీ దగ్గరున్నాడా అంటే నీ దగ్గరున్నాడా అంటూ ఒకతెనొకతె తడుపుకున్నారు. వెదుక్కుంటూ తిరిగారు. చెట్టు చెట్టునీ అడిగారు. తుప్పతుప్పనీ అడిగారు. తీగతీగనీ అడిగారు. విరహంతో వేగిపోయారు, ఏడ్చారు, పిచ్చి వాళ్ళలా నవ్వారు. ప్రతిపడుచూ 'నేనేనర్రా కృష్ణుణ్ణి రండి, రండి' అంది. కృష్ణుడిలా నడిచింది.

అంతమందీ కృష్ణలీలలు అనుకరించారు. పూతన

చన్నకుడవడమూ, శకటుడూ మొదలైన వాళ్ళని చంపడమూ, మద్దులు పడగొట్టడం, చీరలెత్తుకపోయి చెట్టెక్కడమూ, కొండ ఎత్తిపట్టడమూ— అన్నీ అభినయించారు.

వెదకగా వెదకగా అతడి అడుగులు అవుపించాయి. అతడితో మరో పడుచు వెళ్ళిన గుర్తులూ కనపడ్డాయి.

"మన కళ్ళుకప్పి ఎవతెనో ఇటు తెచ్చాడు. ఒక్కతే అనుభవించింది కృష్ణుణ్ణి!" అంటూ రుసరుసలాడారు. ఆ అనుకున్న పడుచు కొంచెందూరంలో కనపడింది ఏడుస్తూ.

"నన్నూ వొదిలేశాడూ ఇక్కడ!"

అందరూ కలిసి వెదికారు. అవుపడలేదు కృష్ణుడు. ఆగలేకపోయారు వాళ్ళు. "కృష్ణా కృష్ణా!" అంటూ ఏడ్చారు. విరహగీతాలు పాడారు. ప్రేమ గీతాలు పాడారు. భావగీతాలు పాడారు. జాలిజాలిగా పాడారు. కన్నీళ్ళు కార్చారు.

ఉన్నట్టుండి వాళ్ళ మధ్యకి వచ్చేశాడు కృష్ణుడు. పడుచుల ప్రాణాలు ఒక్కమారు లేచివచ్చాయి. "అమ్మా దొంగా!" అంటూ పట్టేశారు వాళ్ళు. గట్టిగా కౌగిలించుకున్నారు. అతడిచేతులు స్తనాలమీద పెట్టుకున్నారు. పాదాలు పట్టుకున్నారు. పెదవులు చప్పరించారు. ఉక్కిరిబిక్కిరిచేశారు. అయినా తనివితీరలేదు వాళ్ళకి, ప్రణయకోపమూ చల్లారలేదు.

అందరితోనూ యమున ఒడ్డుకి వచ్చాడు కృష్ణుడు. తెల్లటి పట్టుపరుపుల్లా వున్నాయి ఇసుకపఱ్ఱలు. చల్లని

తుంపుర్లు చల్లింది యమున. మల్లిపూలు పరిచినట్టు కాస్తూ వుంది వెన్నెల.

తమ మేలిముసుగు వోణీలు తీసి పరిచారు గొల్ల పడుచులు. వాటిమీద చదికిలబడ్డాడు కృష్ణుడు. ఆనుకుని కూచున్నారు పడుచులు. ఒకతె అతడి పాదాలు తొడల మీద పెట్టుకుంది. అతడి చేతులు ఒకతె గుండెలమీద పెట్టుకుంది. ఒకామె కబుర్లాడింది. ఒక పడుచు అడిగింది:

"ప్రేమించినవారిని ప్రేమిస్తారు కొంతమంది. ప్రేమించకపోయినా ప్రేమిస్తారు కొంతమంది. ప్రేమించినా ప్రేమించరు కొంతమంది. ఏమంటావు దీనికి?"

"ప్రేమిస్తే ప్రేమించడం పుచ్చుకున్న దానికి బదులు తీర్చడంలాంటిది. అందులో గొప్పేమీ లేదు.

ప్రేమించందే ప్రేమించడం చెప్పుకోదగింది. అందులోనే దయవుంటుంది, సత్యమూ వుంటుంది.

ప్రేమించినా ప్రేమించకపోడం కృతఘ్నత, ద్రోహం" అన్నాడు కృష్ణుడు.

"నీ విషయం ఏమిటి ?"

సాకూతంగా అడిగింది ఒక పడుచు.

"చెప్పనా ?" అందుకున్నాడు కృష్ణుడు "నేను ప్రేమిస్తాను. కాని మధ్య మధ్య వియోగం కల్పిస్తాను. దానివల్ల నామీద ప్రేమ మరింత హెచ్చుతుంది. రుచిచూసిన పదార్థం దూరమయితే దానికోసం తహతహ పుడుతుంది.

మీరు నన్ను ప్రేమించారు నేను కనపడలేదు. దాంతో మీలో ప్రేమ మరింత మండింది.

మీరు నన్ను ప్రేమించినట్టే నేనూ మిమ్మల్ని ప్రేమిస్తున్నాను. మన ప్రేమ నిత్యం, మన ప్రేమసత్యం.

మీరు నా కోసం అన్నీ ఒదిలిపెట్టి వచ్చేశారు. మీ ఋణం తీర్చలేను."

కృష్ణుడి తియ్యని మాటలు విని ఒళ్ళు గరిపొడిచింది గొల్లపడుచులికి. సహజంగా సంగమం అంటే ప్రియం వాళ్ళకి. కృష్ణుడితో ఎంత క్రీడించినా తృప్తిలేదు వాళ్ళకి. అందుకని యమునానది ఇసకతిన్నెలమీద వెన్నెట్లో రాస క్రీడకి తలపడ్డారు వాళ్ళు.

అంతమందీ లేచారు. మండలంగా నిలబడ్డారు. ఒకరి చేతులు ఒకరు పట్టుకున్నారు. ఒయ్యారంగా నృత్యం చేశారు. పాటలు పాడారు. సన్నని నడుములు వొంచారు. రొమ్ములు కదిలించారు. లయతప్పకండా అడుగులు వేశారు. కనుబొమలు తిప్పారు. ఓరచూపులు చూశారు. లేత నవ్వులు నవ్వారు.

ఆటలో మొనగాడు కృష్ణుడు. అంతమందితోనూ అంతమందిగా ఆటలాడాడతడు. అంతమందితోనూ చేతులు కలిపాడు. అంతమందినీ కౌగిలించుకున్నాడు. అంతమంది కళలూ అంటాడు. అంతమందినీ కరిగించాడు.

ప్రతిపడుచూ కృష్ణుడు తనవాడే అనుకుంది. అతడి చేతులతో చేతులు కలిపింది. అతడి చేతులు గుండెలమీద పెట్టుకుంది. చెట్టాపట్టాలు పట్టుకు ఆడింది. చేతులు మీది

కెత్తింది. కాళ్ళ గజ్జెలు ఘల్లుమనిపించింది. కడియాలు గల గలాడించింది. స్తనాల హారాలు వూగించింది. కొప్పుముడి విడిపోతే ముడుచుకోలేకపోయింది. కంచుకం తెగిపోతే కాన లేకపోయింది. చీర విడిపోతే సర్దుకోలేకపోయింది.

ఊగిపోతూ నృత్యంచేశారు పడుచులు. ఆవేశంతో నృత్యంచేశారు. ఉల్లాసంతో నృత్యంచేశారు. కృష్ణుణ్ణి పట్టు కుని నృత్యంచేశారు. అతడిమీదపడి నృత్యంచేశారు. అతడి మీద వేసుకు నృత్యంచేశారు.

అవి అడుగులుకావు. అవి మెలికలుకావు. అవి నవ్వులుకావు. అవి పాటలుకావు.

వెయ్యి మెరుపులు మెరిసినట్టు, వెయ్యి వీణలు మోగి నట్టు, వెయ్యి హంసలు వాలినట్టు, వెయ్యి నెమళ్ళు పురివిప్పి నట్టు, అవుపడింది రాసక్రీడ.

ఆడి ఆడి అలిసిపోయారు గొల్ల పడుచులు. కృష్ణుడితో యమునలో దిగారు. జలక్రీడలాడారు. అందరూ కృష్ణుడి మీద నీళ్లుచల్లారు. అతడితో ఈతలాడారు. వాళ్ళ స్తనాలకు రాసుకున్న కుంకుమ సువాసనలతోనూ, కృష్ణుడు పూసు కున్న కర్పూర గంధాలతోనూ యమున ఘుమఘుమ లాడింది. అలలతో మిలమిల లాడింది.

జలక్రీడ ముగిసింది. అందరూ బయటికి వచ్చారు. పక్కనే వున్న పూల అడవిలోకి వెళ్ళారు. తెల్లవార్లూ కృష్ణుడితో గడిపారు గొల్లపడుచులు.

ఆకాశం మీంచి చందమామ అదంతా చూశాడు. చుక్కలతో కలిసి పక్కుమని నవ్వాడు, పడమట వాలాడు.

కృష్ణుడే ప్రాణం గొల్లపడుచులికి. అతడేలోకం. అతడు లేందే బతుకేలేదు వాళ్ళకి. కృష్ణప్రియలు వాళ్లు.

బలరాముడూ, కృష్ణుడూ ఎంచక్కా ముస్తాబయే వాళ్లు. సిగపూవులు చుట్టుకునే వాళ్లు. నగలు పెట్టుకునే వాళ్లు. గంధాలు పూసుకునే వాళ్ళు. దండలు వేసుకునే వాళ్ళు. బలరాముడు నీలి పట్టుబట్టలు కట్టుకునేవాడు. కృష్ణుడు పసుప్పచ్చటి పట్టుబట్ట కట్టుకునేవాడు. నెమలి పింఛం పెట్టుకునేవాడు. పిల్లనగ్రోవి పట్టుకునేవాడు. ఆవులవెంట అడివికి వెడుతూ వుంటే గొల్లపడుచులు ఇళ్ళల్లోంచి బయటికి వచ్చి చూసేవాళ్ళు. ఒళ్ళు మరిచిపోయే వాళ్ళు. అతడు కళ్ళకి కనపడకపోడంతోనే కళ్ళనీళ్ళు తిప్పుకునేవారు.

కృష్ణుడులేని గొల్లపల్లె శూన్యంగా వుండేది. వారికి పగలంతా, లి ప్తయుగంలా గడిచేది. నలుగురు కలిసి కృష్ణ కథలే చెప్పుకునేవాళ్ళు. అతడి రూపూ, అతడి చూపూ, అతడి మాటా, అతడి పాటా, తలుచుకునేవారు. విరహంతో వేగిపోయేవారు.

అడివినించి అడివికి ఆవులు తోలుకు వెళ్ళేవాడు కృష్ణుడు. కొండమీంచి కొండకి వెళ్ళేవాడు. అడవులన్నీ ప్రేమించేవి అతణ్ణి. కొండలన్నీ ప్రేమించేవి. నదులన్నీ ప్రేమించేవి. పిట్టలన్నీ ప్రేమించేవి. మృగాలన్నీ ప్రేమించేవి.

అతడు మురళి మోయిస్తే లేళ్ళు దగ్గిరికి వచ్చేవి. కళ్ళప్పగించి వినేవి. ఆవులు మోరలెత్తి వినేవి. పిట్టలు

కదలకండా వినేవి. అడివి పశుచులు బొమ్మల్లాగ వుండిపోయే వారు. వాళ్ళ కొమ్ములువి డిపోయేవి. కోకముళ్ళు జారి పోయేవి. కదులుతున్న మబ్బులు నిలబడిపోయేవి. ఎండపొడ తగలకండా గొడుగులు పట్టేవి.గాలి మెల్లిమెల్లిగా,చల్ల చల్లగా వీసేది.

పొద్దుగూకుతూ వుంటే, ఎర్రపొద్దు పడుతూ వుంటే, పిట్టలు గూళ్ళు చేరుతూ వుంటే - కృష్ణుడు వచ్చేదారివేపే చూసే వాళ్ళు గొల్లపడుచులు. పదిసార్లు వాకిళ్ళకి వచ్చే వారు. అడివివేపే చెవులొగ్గేవారు.

సంజ బంగారం పూస్తూ వుంటే, ఆవులవెంట తిరిగి వచ్చేవాడు కృష్ణుడు. మురళి వాయిస్తూ ముద్దుగా వచ్చే వాడు. తలమీద గోధూళి ముచ్చటగా వుండేది. చెంపల మీద కుండలాలు మెరుస్తూ వుండేవి. నుదుటిమీద ముంగు రులు పడుతూ వుండేవి. పల్లెపల్లెంతా వాచిపోయినట్టు చూసేది.

అమ్మ యశోదమ్మ గుమ్మంలోకి పరిగెత్తుకు వచ్చేది. "మా నాయనే" అంటూ కౌగిలించుకునేది. "ఎంత అలిసి పోయావురా కన్నా!" అంటూ పైట చెంగుతో మొహ మంతా వొత్తేది. స్నానం చేయించేది. తిండి తినిపించేది.

రోహిణీ బలరాముణ్ణి అలాగే చేసేది. గొల్లపడుచుల ప్రాణం చల్లబడేది.

## కొండచిలువ

కృష్ణమయంగా వుండేది బృందావనం గొల్లపల్లె. అతడు చేస్తున్న అద్భుతాలకి అంతంలేకండా వుండేది.

బృందావనానికి కొంతదూరంలో సరస్వతీనదివొడ్డున అంబికా వనముండేది. అక్కడ పేరుపడ్డ ఒక శివకోవెల వుండేది. దూరదూరాలవారూ అక్కడి యాత్రకి వచ్చేవారు.

ఓనాడు నందుడూ మొదలైన బృందావనం గొల్లలు అంబికావనం యాత్రకి బయలుదేరారు. బళ్ళమీద వెళ్ళి సరస్వతి వొడ్డున దిగారు. సరస్వతిలో స్నానాలు చేశారు. గుడికి వెళ్ళి మొక్కులు చెల్లించారు. సరదాగా తిరిగారు.

ఇంతలో ఎక్కణ్ణుంచి వచ్చిందో ఒక కొండచిలువ, ముసిలి నందుణ్ణి పట్టుకుంది. కేకలు వేశాడు నందుడు. శాయశక్తులా గింజుకున్నాడు. వదిలిపెట్టలేదు పెనుబాము. గొల్లలందరూ గొల్లుమన్నారు.

పరిగెత్తుకు వచ్చాడు కృష్ణుడు. కొండచిలవని తాపుతన్నాడు. మంత్రించినట్టు మాయమయింది పాము. ఒక యక్షుడు ప్రత్యక్షమయాడు.

"ఎవరునువ్వు?"

"సుదర్శనుడు అంటారు నన్ను."

"మరి ఈ కొండచిలవ వేషమేమిటి?"

"ఇది శాపంవల్ల వచ్చిన జన్మ. నువ్వు తన్నావు, శాపం విరగడయింది. ఇక సెలవు" అంటూ వెళ్ళిపోయాడు యక్షుడు. తెల్లబోయారు గొల్లలు.

"మన నల్ల కృష్ణుడు మామూలు మనిషి కాడు. అంగ దేవుడే ఇలా పుట్టాడు మనపాల." అంటూ అతణ్ణి మెచ్చు కున్నారు. అతడి కథలే చెప్పుకుంటూ ఇళ్ళకు మళ్ళారు.

## శంఖచూడుడి మణి

సంజ సంజగావుంది, చల్లగానూవుంది. బలరాముడూ, కృష్ణుడూ యమున పక్క అడివిలో కూచున్నారు. పొద్దు గూకింది. రాత్రి పడింది. చుక్కలు దూరాయి. వెన్నెల ఎక్కింది.

కృష్ణుడు మురళిమీద స్వరాలు ఆలాపించాడు. అతడు చెక్కిన మురళే అది. అతడు కట్టిన రాగాలే అవి. వింత మురళి, మోహన మురళి. కొత్త రాగాలు, వలపు రాగాలు.

రామకృష్ణులు ఇద్దరూ రాగాలు ఆలాపించారు. అన్నదమ్ములు ఇద్దరూ కలిసి ఆలాపించారు. హాయిగావుంది ఆలాపన. మత్తు మత్తుగా వుంది.

ఎప్పుడు వచ్చారో వచ్చారు గొల్లపడుచులు. చుట్టూ చేరారు. రామకృష్ణుల రాగాలాపనలో కరిగిపోతున్నారు.

సరిగ్గా అప్పుడే ఎక్కడినుంచి దిగాడో శంఖచూడు డని ఒక యక్షుడు. గొల్లపడుచుల్ని చూసి, పెదవులు చప్ప రించాడు. నక్కి నక్కి వచ్చి, ఇద్దరి పడుచుల్ని చంకని పెట్టుకు దౌడుతీశాడు.

చప్పున వాడి వెంటబడ్డారు రామకృష్ణులు. కొంచెం లోనే వాణ్ణి చేరుకున్నారు. పడుచుల్ని పడేసి పరిగెత్తాడు శంఖచూడుడు.

"అన్నయ్యా! నువ్వు వీళ్ళని చూస్తూవుండు" అని యక్షుడి వెంటపడ్డాడు కృష్ణుడు. పట్టుకున్నాడు, బుర్ర బద్దలు చేసాడు. అతడి తలలో ఒక మణి వుండేది. అది తెచ్చి బలరాముడికి బహూకరించాడు.

## ఆబోతు

ఓనాడు పెద్ద ఆబోతు గొల్లపల్లెలో చొరబడింది. నడుస్తున్న కొండలా వుందది. కొండశిఖిలంలాగే వుంది దాని మూపురం. చెట్టుకొమ్మల్లా వున్నాయి కొమ్ములు. ఈటె మొనల్లా వాడిగా వున్నాయి. చింతనిప్పుల్లా వున్నాయి కళ్లు.

తోక మీదికెత్తి పరుగు తీసింది ఆబోతు. పొదలూపే తుఫానులాగ బుసకొట్టింది. కారుమబ్బులాగా రంకెలు వేసింది. డెక్కలతో మన్ను చిమ్మింది. కొమ్ములతో కోరాడింది. నల్లమబ్బులా కనపడగానే కృష్ణుడిమీద విరుచుకు పడింది. కళ్లు మూసుకుపోయాయి గొల్లలికి. ఆబోతు కృష్ణుడ్ని చంపేసింది అనుకున్నారు వాళ్లు.

కొండలు ఎత్తేసిన బలశాలి కృష్ణుడు. ఆబోతు వస్తే తప్పుకోలేదు. వచ్చినదాన్ని వచ్చినట్టే పట్టేశాడు. అల్లంత మేర వెనక్కి తోసుకు వెళ్ళాడు. కొమ్ములు పట్టుకుని వొలి పెట్టాడు, నేల పడగొట్టాడు. రెండుకాళ్ళతోనూ కుమ్మాడు. కసిదీరా తన్నాడు. తొక్కి తొక్కి వొదిలి పెట్టాడు. ఆబోతురూపం పోయింది. రాక్షస రూపంతో చచ్చింది, నెత్తురు కక్కుకుంటూ.

రాక్షసుడే అలా ఆబోతులా వచ్చాడు. వాడిపేరు అరిష్టుడు.

"అమ్మబాబూ, బతికిపోయాం" అంటూ ఆడా మగా గుమికూడారు గొల్లలు. "మన కృష్ణయ్యే లేకపోతే మన దారి ఏమయేది?" అంటూ కృష్ణుడి చుట్టూ మూగారు. కళ్ళతోనే అభినందించారు గొల్ల పడుచులు.

## మేకల దొంగాట

ఓనాడు కొండమీద ఆవులు మేస్తున్నాయి. పక్కనే గొల్ల కుర్రాళ్ళతో ఆటలాడుతున్నాడు కృష్ణుడు. రకరకాల ఆటలు కల్పించేవాడతడు. అవాళ మేకల దొంగాట ఆడు తున్నాడు.

జట్టులో కొందరు మేకలూ, కొందరు దొంగలూ, కొందరు దొంగల్ని పట్టుకునే భటులూ. దొంగలు మేకలు ఎత్తుకుపోతే, భటులు వెదికి పట్టుకోవాలి ఇదీ ఆట.

అవాళ జట్టులో ఓ కొత్తకుర్రాడు చేరాడు. దొంగల్లో ఒక దొంగగా కుదిరాడు. మేకల్ని ఒక్కొక్కణ్ణే ఎత్తుకుపోయే వాడతడు. కనపడకండా ఓ కొండగుహలో దాచేసేవాడు. గుహాముందు పెద్ద బండరాయి పెట్టేసేవాడు. పోయిన మేక దొరికేదికాదు.

కొంతసేపయేసరికి మేకలయిన కుర్రాళ్లు తరిగి పోయారు. కనిపెట్టేశాడు కృష్ణుడు. కొత్తగా జట్టులోచేరిన దొంగ కుర్రాణ్ణి పట్టుకున్నాడు, వాడి దొంగ గుహ గుర్తిం

చాడు. పెద్దపులిలా వాడిమీాద పడ్డాడు. పీకనులిపి చంపేశాడు. చచ్చేముందు రాక్షసుడయి పడిపోయాడు వాడు. అసలు, రాక్షసుడే వాడు. అతడి పేరు వ్యోముడు. గొల్ల పిల్లల్ని చంపాలనే దొంగవేషంతో వచ్చాడు.

వ్యోముణ్ణి చంపేసి, గుహాలోంచి మేకల్ని - అదే జట్టు కుర్రాల్ని విడిపించాడు కృష్ణుడు.

సాయంత్రం ఇళ్ళకి వచ్చాక, ఊళ్లో చెప్పారు పిల్లలు. విని నిచ్చెరపోయారు తల్లులు.

"మన కిష్టప్ప వుంటే ఏది వచ్చినా భయం లేదమ్మా !" అనుకున్నారు.

## వింత గుర్రం

మరోనాడు ఓ వింతగుర్రం గొల్లపల్లిమీాద దాడు తీసింది. అంత గుర్రం, అలాటి గుర్రం ఎక్కడా వుండదు. నల్లగా పెద్ద దెయ్యంలా వుందది. దాని డెక్కల చప్పుడికి దిక్కులు మారుమోగాయి. దాని సకిలింపులకి పెద్దపులులు తుళ్ళిపడ్డాయి. గాలావు పరుగుతో వచ్చిందది. కదం తొక్కుతూ వచ్చింది.

దాన్ని చూసి జబ్బలు చరుస్తూ నిలబడ్డాడు కృష్ణుడు. నోరు చాచుకుని మీాదికి వచ్చింది గుర్రం. గిర్రున తిరిగి కృష్ణుణ్ణి తన్నింది. తప్పించుకున్నాడు కృష్ణుడు. వెనక కాళ్ళు పట్టేశాడు. అంత గుర్రాన్ని అమాంతంగా గిరవాటు

వేశాడు. చచ్చినట్టు పడింది గుర్రం. కాని, బంతిలా లేచింది. మెరుపులాగా దూకింది. మింగేసినట్టు నోరు తెరిచింది.

చప్పున నోట్లో చెయ్యి దూర్చాడు కృష్ణుడు. అది మెత్తగా అనిపించలేదు గుర్రానికి, చల్లగానూ అనిపించలేదు. కాలుతున్న ఇనుప దూలంలా అనిపించింది. అది కడుపులోకే దూసుకుపోయింది. కడుపు పట్టదనిపించింది. దాంతో కడుపు పగిలిపోయింది. చచ్చి వూరుకుంది.

చచ్చాక గుర్రం కాదని తేలింది. కంసుడి రాక్షసుడది. గుర్రం రూపంలో వచ్చాడు వాడు. వాడి పేరు కేసి.

కేసి అంటే ఎంతటి వాళ్ళయినా మలమూత్రాలు విడిచిపెట్టేవారు. అంత క్రూరుడు వాడు.

తనని చంపేవాడు పుట్టి ఎక్కడో పెరుగుతున్నాడని వినడంతోనే దేశంలో పిల్లల్ని చంపడంకోసం అవాళ తన సేవకుల్ని పంపాడు కంసుడు. వాళ్ళు వెళ్ళి పిల్లల్ని చంపుతూనే వున్నారనీ, తన పగవాడిని వాళ్ళు చంపేసే వుంటారనీ నమ్మకంతో వుండేవాడతడు. మరి ఆ చింతే వుండేది కాదతడికి. అయితే ఇప్పుడే తెలిసింది, అదంతా పొరపాటని.

దేవకి కూతురు కననేలేదనీ, ఆ పిల్ల యశోద కూతురనీ, దేవకి ఎనిమిదో కానుపు కొడుకే అనీ, వసుదేవుడు రహస్యంగా అతడిని వ్రేపల్లె నందుడింట యశోద పక్కని పెట్టి వచ్చాడనీ, ఆ కొడుకు పేరు కృష్ణుడనీ, వసుదేవుడి మరో భార్య రోహిణికి బలరాముడు పుట్టాడనీ, తల్లీ కొడుకుల్నీ నందుడింటే వుంచాడనీ, నందుడూ, వసుదేవుడూ మంచి నేస్తాలనీ, అన్నాతమ్ముల వరసనీ, వ్రేపల్లె గొల్లలు తమ

వూరు 'మహావనం' నించి బృందావనం మార్చారనీ – అన్నీ విన్నాడు.

"ఎంత పెద్దకుట్ర!" అంటూ పిడికిలి బిగించాడు కంసుడు. తన నమ్మినబంటు కేసి. అందరిలోకీ సమర్థుడు. అతడిని పిలిచాడు.

"కేశీ! బృందావనం గొల్లపల్లి వెళ్ళు పరిగెత్తి. ముసిలి కోనారి, మనకి ప్రతి ఏడాదీ కప్పం పట్టుకు వస్తాడే నందుడు- వాడింట బలరాముడూ, కృష్ణుడూ అని ఇద్దరు గుంటలున్నారు. వాళ్ళని చంపేసి రావాలి నువ్వు" అన్నాడు. అదిగో కంసుడి మాట మీదే "ఇదెంతలో పని!" అంటూ గుఱ్రమయి పరిగెత్తుకు వచ్చాడు కేసి. వచ్చాడు చచ్చాడు. చావు కబురు చల్లగా విన్నాడు కంసుడు. దేవకీవసుదేవుల్ని ఇనపసంకెళ్ళు వేసి మళ్ళీ ఖైదులో పడేశాడు.

## ఆలోచన

కంటికి కునుకు రాలేదు కంసుడికి. కాళ్లు కింద నిలవ లేదు.

'ఎంత కుట్ర! ఏమీ ఎరగనట్టే అవుపించాడు వసుదేవుడు! దేవకి బతిమాలినట్టే బతిమాలి నా చావే కోరింది. యాదవులు ఎంతమంది చేతులు కలిపారో దీనికి! కాకపోతే ఖైదులోని వసుదేవుడు నందుడింటికెలా వెళ్ళాడు.

ఉగ్రసేనుడి సలహా కూడా వుండే వుండాలి. వల్ల

కాడు పిలుస్తున్నా రాజ్యంమీద ఆశ వదలలేదతగాడికి! అందరినీ హతమారుస్తాను.

ఉగ్రసేనుణ్ణీ, దేవకుణ్ణీ నరికేస్తాను. వాళ్ళ పక్షం రాజుల్ని ఒక్కణ్ణీ మిగల్చను.

మగధ మహారాజు జరాసంధుడు నా మామ. ద్వివిదుడు నా నేస్తం. శంబరుడూ, నరకుడూ, బాణుడూ నా వాళ్లు. ఇంతమందీ వుంటే నన్ను ఎవడేం చేస్తాడు?

ఇంతకీ ఈ కుర్రకుంకల్ని, రామకృష్ణుల్ని చంపి పారెయ్యాలి ముందు. ఏమిటి సాధనం! ఏమిటి దారి!

ఈ కంసుడికి సాధనమే లేదా? ధనుర్యాగం తల పెట్టాను, చూద్దురుకాని రమ్మని పిలిపిస్తాను. ఏనుగుచేత తొక్కించేస్తాను. నా మల్లుల్ని వుసిగొలుపుతాను. నల్లులు లాగ నలిపేస్తారు మల్లులు.'

ఈ ఆలోచన తట్టడంతోనే అక్రూరుణ్ణి పిలిపించాడు కంసుడు.

"అక్రూరా! నాకు నచ్చిన స్నేహితుడివి నువ్వు. భోజ, వృష్ణి వంశాల్లో ఎంపికయినవాడివి. ఇప్పుడు ఓ మంచిపని పడింది. అది నువ్వే చెయ్యదగినవాడివి. మరేమీ లేదు. నేను ధనుర్యాగం తలపెట్టాను. గొప్పగా చెయ్యాలని నా సంకల్పం. బంధువులందరూ వస్తేనే దానిగొప్ప. నా మేన ల్లుళ్లు బలరామకృష్ణులు బృందావనం గొల్లపల్లెలో నందు డింట వున్నారు. మన వసుదేవుడి కొడుకులు వాళ్లు. కనక నువ్వు బృందావనం వెళ్ళి, బలరామకృష్ణుల్ని పిలుచుకురా.

మీ మేనమామ, యాగానికి పిలుస్తున్నాడని నచ్చచెప్పి తీసుకురా." అని తొందరచేశాడు.

కంసుడు చెప్పినపని కాదంటే సాగదు. "సరే" అన్నాడు అక్రూరుడు. "కానీ మహారాజా, ఏది ఎలా జరగాలో అలాగే జరుగుతుంది. కేవలం మనిషి ప్రయత్నం మీదే పని జరగదు. నీ మాట కాదనను. బృందావనం వెళతాను. రామకృష్ణుల్ని తీసుకువస్తాను."

అక్రూరుడు వెళ్ళాక, మంత్రుల్ని పిలిపించాడు కంసుడు. "ధనుర్యాగానికి రంగం తయారుచేయించండి" అన్నాడు, "కుస్తీ పట్లకి విశాలంగా వుండాలి. ప్రజలందరూ చూడడానికి చోటుండాలి. బాగా ఎత్తుగా వుండాలి." అంటూ చెప్పాడు.

చాణూరుడూ, ముష్టికుడూ, శలుడూ, తోశలుడూ మొదలైన మల్లుల్ని పిలిపించాడు. జగజ్జెట్టీలు వాళ్లు. లోపలికి పిలిచి రహస్యంగా చెప్పాడు:

"ఇదిగో, బృందావనంనించి బలరాముడూ, కృష్ణుడూ వస్తారు. మన ధనుర్యాగమూ, మన మధురాపట్టణమూ చూడడానికి. మీ బలమంతా ఉపయోగించి వాళ్ళని చంపేయాలి. ఇది నా ఆజ్ఞ."

"మాతో కుస్తీ పడతారా వాళ్లు మహారాజా! చేయీ చేయీ కలపడంతోనే చిత్తుచేసి చంపేస్తాం." అంటూ కండలు పొంగించారు వాళ్లు.

తరవాత ఏనుగు మావత్తుల్ని పిలిపించాడు కంసుడు. ఏకాంతంగా వాళ్ళని ఇలా ఆదేశించాడు:

"మంచి మావత్తులు మీరు. మన పట్టపు ఏనుగు కువలయాపీడం భయంకరమైంది, బలమైంది. దాన్ని ముస్తాబు చేసి మనం నిర్మిస్తున్న మల్లరంగస్థలం పెద్దద్వారం దగ్గర సిద్ధంగా వుంచాలి. ఆ గుంటలు రామకృష్ణులు రాగానే దాంతో వాళ్ళని మట్టించెయ్యాలి."

అలా అవాళికి అన్ని ఏర్పాట్లూచేసి అంతఃపురంలోకి వెళ్ళిపోయాడు కంసుడు. అయినా అతడి మనస్సు కుదుటపడలేదు. కంటికి కునుకు పట్టలేదు.

## హామ పిలుస్తున్నాడు

ఆ రాత్రి తెల్లవార్లూ తన ప్రయాణం తలుచుకుంటూ పడుకున్నాడు అక్రూరుడు. కంసుడి సంకల్పం కంసుడినోటే విన్నాడతడు. ఎంతదారుణం!

అయినా, బృందావనం వెళ్ళడమన్నా, రామకృష్ణుల్ని పిలుచుకురావడమన్నా ఉల్లాసంగానేవుంది తనకి. మనసు ఆవేగపడుతూవుంది.

వేకువనే లేచాడు అక్రూరుడు. రథమెక్కి బృందావనం పయనమయాడు. పొద్దుగూకుతూ గూకుతూ వుండగా గొల్లపల్లె చేరాడు.

ఆవులు వచ్చేశాయి. దూడలు విప్పుతున్నారు. పాలు పిదికేవేళ.

నందుడి మందలో పాలు పిదికేదగ్గర వున్నారు బలరామకృష్ణులు. అక్కడికే వెళ్ళాడు అక్రూరుడు. కృష్ణుణ్ణి చూశాడు. ఇంద్రనీలమణిలా మెరిసిపోతున్నాడు. తామర

రేకులులా కనిపిస్తున్నాయి కళ్లు. కాలి ముడుకులకి అందు తున్నాయి చేతులు. సింహాంకోదమలా వున్నాడు.

తల పంకించాడు అక్రూరుడు. 'ఇతడి చేతుల్లో కంసుడు కళ్లుమూస్తాడు' అనుకున్నాడు. చప్పున రథం దిగాడు. దగ్గిరికి వెళ్ళాడు.

నందుడింట ఎంత గౌరవించాలో అంత గౌరవించారు అక్రూరుణ్ణి. కుశలప్రశ్నలడిగారు. కంసుడి పరిపాలన తెలుసు కున్నారు.

ఏకాంతంగా కూచుని అన్నీ విన్నాడు కృష్ణుడు. అన్నీ చెప్పి "మామ పిలుస్తున్నాడు" అన్నాడు అక్రూరుడు.

అప్పటికే కంసుడు తన మేనమామ అని తెలుసు కృష్ణుడుకి. తాను దేవకీ వసుదేవుల కన్నకొడుకుననీ, కంసుడు తన తల్లినీ, తండ్రినీ ఖైదులో పడేశాడనీ, తన ఆరుగురు అన్నల్నీ చంపేశాడనీ, అతడికి భయపడి బలరాముణ్ణీ, తననీ నందుడింట దాచాడనీ తెలుసు. అందుకని కంసుణ్ణి కడ ముట్టించి, యాదవ కులాన్ని ఆదుకోవాలని ఎన్నాళ్ళయో అనుకుంటున్నా డతడు. తగిన సమయం వచ్చింది. తనంతట తానే మామ పిలుస్తున్నాడు.

"మహారాజు కంసుడు గొప్ప ధనుర్యాగం చేస్తున్నాడు. మల్లయుద్ధమూ జరుగుతుంది. మంచి పండగ జరుపుతారు. ఈ పండగ చూడడానికి మీరు రావలసిందని మహారాజు నన్ను పంపాడు. అంటూ నందుడూ మొదలైనవారితో చెప్పాడు

అక్రూరుడు. ముఖ్యంగా మేనల్లుళ్ళని రామకృష్ణుల్ని తీసుకు రమ్మని రథం పంపాడు" అన్నాడు.

మామ రమ్మన్నాడు అనగానే ఎగిరిగంతులేశారు రామకృష్ణులు.

"రాజుగారు కబురు చేశారు. రాజధానికి బయలుదేరాలి. ముఖ్యమైన కోనార్లంతా సిద్ధపడండి. పాలూ, పెరుగూ, వెన్నా పట్టుకోండి. బళ్ళూ, అవీ తయారుచేయండి. రేపే పయనం." అంటూ వూళ్ళో చాటించాడు నందుడు.

కృష్ణుడు మధుర వెళతాడనగానే ఆకాశం విరిగి మీద పడినట్లయింది గొల్లపడుచులికి. కొట్టమిట్టాడి పోయారు. వాళ్ళు. "కృష్ణుడు వెళిపోతే ఎలా బతకడం? క్రూరుడైన అక్రూరుడు ఎక్కడ దాపురించాడు మా పాలిటికి ? కృష్ణుణ్ణి చూడకపోతే కళ్ళు కాయలుకాసిపోతాయి. మురళి వినకపోతే చెవులు దిమ్మెత్తి పోతాయి."

"మధురాపట్నం మంచిపట్నమట! పెద్దపెద్ద మేడలట! అవిచూస్తే మన కొంపలు మరిచేపోతాడు కృష్ణుడు. పట్నం పడుచులు నెరజాణలు. నల్లకృష్ణుణ్ణి వల్లో వేసుకుంటారు. వాళ్ళ పైమెరుగులు చూసి మా పల్లెపిల్లల్ని మరిచేపోతాడు కృష్ణుడు."

అంటూ విలవిలలాడి పోయారు. ఏడ్చారు. వెర్రెత్తి నట్టయి పోయారు.

సగం రాత్రి వుందనగానే బయలుదేరిపోయాయి నందుడి బళ్ళు. తెలతెలవారుతూవుండగా రథం పూశాడు

అక్రూరుడు. రామకృష్ణులు రథమెక్కారు. కన్నీళ్ళతో నుంచుంది యశోద. ప్రక్కనే నించుంది రోహిణి.

'మమ్మల్ని వొదిలేసి వెళ్ళిపోతున్నావు కదూ!' అన్నట్టు కన్నీళ్ళతో జాలిగా నించున్నారు గొల్లపడుచులు. అతడివేపే చూస్తున్నాయి ఆవులు. చిన్నపోయినట్టు కనపడింది గొల్లపల్లె.

రథం కదిలింది. చూస్తూ నుంచున్నారు గొల్లభామలు. చూస్తూనుంచుంది గోవర్ధనం. కనపడి, కనపడి, కనపడకండా పోయింది రామకృష్ణుల రథం.

## మధుర

సంజ పడీ పడకముందే మధుర పొలిమేర చేరింది. అక్కడ పూరిబయట తోటలో అప్పుడే విప్పుతున్నారు నందుడి బళ్ళు. అక్కడే ఆగింది రథం.

అందరినీ తన ఇంటికి రమ్మన్నాడు అక్రూరుడు.

"తప్పకండా వస్తాం, కాని ఇప్పుడు కాదు. ఈ రాత్రి ఇక్కడే వుంటాం, రేపు పట్నం చూస్తాం. అన్నిపనులూ పూర్తయాక నీ ఇంటికి వస్తాం" అంటూ నచ్చచెప్పాడు కృష్ణుడు.

"సరే, నీ మాటే కానీ" అంటూ రథం తీసుకుని కోటలోకి వెళ్ళాడు అక్రూరుడు. కంసుడికి కబురు చెప్పి, ఇల్లు చేరుకున్నాడు.

ఆ రాత్రి తోటలో వుండి, మర్నాడు తమ గొల్లలతో పట్నంలోకి బయలుదేరారు రామకృష్ణులు. అప్పటికే వాళ్లు

వచ్చారని పట్నంలో గుప్పుమంది. వీధుల్లోనూ, మేడల మీదా జనం గుమికూడుతూ వచ్చారు.

అసలే అందమైంది మధురానగరం. పండగకని ముస్తాబుచేసి మరింత అందంగా వుంది. అన్నీచూస్తూ నడుస్తున్నారు బలరామకృష్ణులు. తమ మామగారి వూరది. పైగా మేనమామ రమ్మంటే వచ్చారు. రావాలనే వచ్చారు.

వాళ్ళని చూడడానికి సంబరపడిపోయారు పట్నం పడుచులు. ఎలా వున్నవాళ్లు అలాగే గుమ్మాల ముందుకి వచ్చారు పరిగెత్తి. చేస్తున్నపనులు చేస్తున్నట్టే వొదలిపెట్టేశారు. సగం సగం చీరె కట్టుకునీ, సగం సగం నగలు పెట్టుకునీ, ఒకదగ్గిర పెట్టుకోవలసిన నగ ఇంకోదగ్గిర పెట్టుకునీ, వోణీ చీరెలా చుట్టుకునీ, చీరె వోణీలా వేసుకునీ తొందర తొందరగా, సందడి సందడిగా పైకి వచ్చారు వాళ్లు. మేడల మీదా, మిద్దెల మీదా ఎక్కి చూశారు. తమవాళ్ళు తప్పు పడతారని కానీ, ఎదటి వాళ్లు ఏమనుకుంటారని కానీ, సంకోచం లేకండా చూశారు.

కృష్ణుణ్ణి చూసిన ఆడదల్లా అతడిమీద కన్నేసింది. పెదవులు చప్పరించింది. కామంతో గరిపొడిచింది.

అందరిమీదా చూపులు విసురుతూనే నడిచాడు కృష్ణుడు. లేత నవ్వులు గిలిగింతలు చేస్తూనే నడిచాడు.

కల్లా కపటంలేని గొల్లపడుచులే అయినా, నిజమే చెప్పారు వాళ్ళు బృందావనంలో- పట్నం పడుచులు, నెరజాణలు. చూపులూ, చిరునవ్వులేకాదు, రామకృష్ణులమీద

పువ్వులూ చల్లారు వాళ్ళు. కృష్ణుడు కంటపడితే ఏ ఆడది గుట్టు నిలబెట్టుకోగలుగుతుంది !

## రాజుగారి చాకలి

రాజవీధిని వెళుతూ రాజుగారి చాకలిని చూచారు రామకృష్ణులు. రాజుగారి బట్టలకి రంగులుకూడా వేస్తాడు వాడు. రాజుగారి చాకలినని రాజసం ఇంతా అంతా కాదు వాడికి.

"ఏయ్ చాకలీ !"

వాణ్ణి పిలిచారు రామకృష్ణులు. వింత జంతువుల్ని చూచినట్టు చూశాడు చాకలి.

"బట్టలు కావాలి మాకు. ఏవీ మంచివి ఇలాతే ఎంచి."

"ఏ అడివినించి దిగారోయి, కొండకోనారులు ! మళ్ళీ ఈ కూత కూశారంటే తిరిగి మీ వూరు మొహం చూడరు. ఇవి రాజుగారి బట్టలు తెలుసా ? పొండి !"

ఒళ్ళు మండింది కృష్ణుడికి. చాచి వొక్కటి వేశాడు తలమీద. కిందపడి ముక్కలయింది తల. చచ్చి వూరుకున్నాడు చాకలి.

రాజుబట్టలు లాక్కున్నారు రామకృష్ణులు. మంచి మంచివి ఎంచుకున్నారు. బలరాముడు నీలిరంగువి కట్టుకున్నాడు. కృష్ణుడు పసుప్పచ్చటివి కట్టుకున్నాడు. తన

గొల్లలకీ మంచి మంచివి ఎంచి ఇచ్చారు. వాళ్ళందరూ అవి కట్టుకుని రాజోరిలాగ తయారయారు. మిగిలిన బట్టలు అక్కడే పారేశారు.

## పూలదండల సుదాముడు

మరి కొంచెం ముందుకి వెళ్ళాక పూలఅంగడి తగిలింది వాళ్ళకి. ఒక దుకాణంలో మంచి మంచి పూలదండలు కడుతున్నాడొకడు. అతడి పేరు సుదాముడు. అతడి దగ్గిరికే వెళ్ళారు రామకృష్ణులు.

ఎంతో గౌరవించాడు సుదాముడు. ఆసనాలు వేసి ఆదరించాడు. అన్నదమ్ములిద్దరికీ ఎంపికయిన పూలదండలిచ్చాడు.

"నీ ఇల్లు నిత్యకళ్యాణం కావాలి" అంటూ దండలు వేసుకున్నారు రామకృష్ణులు. "వెళ్ళి వస్తాం" అంటూ పూల అంగడినించి మరింత ముందుకి నడిచారు వారు. హిమాలయంనించి వచ్చిన తెలుపు, నలుపు గున్న ఏనుగుల్లాగ నడివీధిని నడిచారు వారు. చూడటానికి రెండు కళ్ళు చాలవనిపించింది మధుర జనానికి.

## గూని పడుచు

ఇంక కొంచెం వెళ్ళాక దారిమధ్య ఓ గూనిమనిషి కనిపించింది రామకృష్ణులికి. దోరవయసులో వుంది ఆవిడ. గూనిమాత్రం తప్పిస్తే అందంగానూ వుంది. బంగారం

గిన్నెల్లో గంధాలూ, నలుగులూ అవీ పట్టుకుంది. రామ కృష్ణుల్ని, ముఖ్యంగా కృష్ణుణ్ని చూస్తూ ఆగింది.

"ఎవరు నువ్వు ?"

"నేనా ? నేను కోటలో రాజుగారి దగ్గిర పనిచేస్తాను. మూడు వంకలు నా వొళ్ళు. అందుకని అందరూ నన్ను 'త్రివక్రి' అని పిలుస్తారు."

"ఏమిటే గిన్నెలు ?"

"ఇవా ? ఇవి మంచి మంచి అగరు చందనాలూ, ఒంటికి పూసుకునే నలుగులూ అవీను. రాజుగారికోసమూ, రాణీలకోసమూ పట్టుకెళుతున్నాను. ఇందండి కావాలంటే రాసుకోండి."

త్రివక్రి దగ్గిర గంధాలు తీసుకుని పూసుకున్నారు రామకృష్ణులు.

ఆవిడ బొడ్డుదగ్గిర ఓ చేతి వేళ్ళతో నొక్కిపట్టి, మరో చేత్తో ఆవిడ చేతులుపట్టి గుంజాయించి గూని పోగొట్టాడు కృష్ణుడు. చక్కగా సలాకలా తయారయింది త్రివక్రి.

"మరి వెళ్ళిరామా ?" అన్నాడు కృష్ణుడు.

"ఆఁ - అదేమన్నమాట ! మా ఇంటికి రాకండానే ! అలా వూరికే వెళిపోనిస్తానా ?"

"ఇప్పుడు కాదు. మరోసారి వస్తాను" అంటూ మాట ఇచ్చి, బలరాముడివేపు చూసి నవ్వుతూ ముందుకి నడిచాడు కృష్ణుడు.

'మాట తప్పవుకదా !' అన్నట్టు చూస్తూ నిలబడి పోయింది త్రివక్రి.

## విల్లు విరిచేశాడు

యాగం కోసమని, కనీవిని ఎరగని విల్లు తయారు చేయించి పెట్టాడు కంసుడు. పెద్ద కొండచిలువలా వుందది. ఎంత బలవంతుడైనా ఒక్కమనిషి ఎత్తడం కష్టమది. ఎక్కుపెట్టడం చెప్పనే అక్కరలేదు. యాగశాలలో పెట్టి కాపలా పెట్టాడు కంసుడు.

గొల్లలతో కలిసి చల్లచల్లగా యజ్ఞశాలలోకి వెళ్ళారు రామకృష్ణులు.

చూసినట్టేచూసి, దభాలున ధనుస్సు పట్టుకున్నాడు కృష్ణుడు.

"ఆగూ, ఆగూ! కాపలాభటులు అరిశారు. ఆగలేదు కృష్ణుడు. ఎత్తి పట్టుకున్నాడు. ఆటలాగ ఎక్కుపెట్టాడు. చెవి దాకా లాగాడు. నారి మోగించాడు. మళ్ళీ మళ్ళీ నారి లాగాడు. అంత విల్లూ విరిచేశాడు.

రెండు ముక్కలయింది విల్లు. ఫెళఫెళా పిడుగు లురిమినట్టయింది. కంసుడి గుండె పగిలినట్టయింది.

కావలి వాళ్ళంతా జమాజెట్టీలు. కత్తులూ, కటార్లూ పట్టుకుని కృష్ణుణ్ణి ముట్టడించారు.

విరిగిన వింటిముక్కలు రెండూ అన్నదమ్ములు రామ కృష్ణులిద్దరూ పట్టుకున్నారు. కనబడిన కావలివాళ్ళని కనపడ కండా మళ్ళగొట్టారు. చావగా మిగిలినవాళ్ళు కంసుడి దగ్గ రికి కాళ్ళకి బుద్ధి చెప్పారు.

కంపం పట్టుకుంది కంసుడికి. కాలికింది నేల కదిలి

పోయింది. బుర్ర వెర్రెత్తింది. కళ్ళు పచ్చబడ్డాయి. తన నీడలో చిల్లులు కనబడ్డాయి.

మల్లుల్ని పిలిపించాడు. చాణురుడూ, ముష్టికుడూ వచ్చారు. "రేపు బలరాముణ్ణీ, కృష్ణుణ్ణీ తప్పక చంపెయ్యాలి" అంటూ హెచ్చరించాడు. మా వత్తు మహామాత్రుణ్ణి పిలిపించి, "మల్ల రంగస్థలం ద్వారం దగ్గిరే పట్టపు ఏనుగు కువలయాపీడం వాళ్ళిద్దరినీ తొక్కించి పచ్చడి చేసేయ్యాలి" అన్నాడు.

రాత్రంతా ఒకటే ఆలోచన:

'రేపటితో ఈ పీడ విరగడయి పోతుంది. ఈ కుర్ర కుంకల పని పట్టేసి, వసుదేవుడూ, శూరసేనుడూ మొదలైన వాళ్ళనీ చంపేస్తాను. పట్నంలో యాదవపురుగు లేకండా చేసేస్తాను. యాదవ పక్షపాతి కనుకనే మా అయ్య ఉగ్రసేనుణ్ణి ఖైదులో పెట్టాను. అసలు ఈ ఉగ్రసేనుడు మా అయ్య కానే కాడు.

కృష్ణుడట, కృష్ణుడు! వాణ్ణి వెనకేసుకు వచ్చే వాళ్ళనందరినీ వరసపెట్టి తరిమేస్తాను.'

ఈ ఆలోచనలతోనే రాత్రికి రంగస్థలం చూసి వచ్చాడు కంసుడు. ఎక్కడ చేయవలసిన ఏర్పాట్లు అక్కడ చేయించాడు.

## మల్లుల పోట్లాటకి రంగస్థలం

విశాలంగా తయారయింది రంగస్థలం. ఎంతోమంది శిల్పులు తయారుచేశారది. చిత్ర విచిత్రమయిన చిత్రాలు

నిర్మించారు వారు. అంతటా పూలదండలు వేలాడదీశారు. రంగురంగుల జెండాలు కట్టారు. రకరకాల మంచెలు వేశారు. చూపరులు కూచునే చోట్ల చాందినీలు కట్టారు. మంచినీళ్ళ కడవలు పెట్టారు. ఒక మంచే ఆరు స్తంభాలతో అద్భుతంగా కట్టారు. అదంతా అంగ ఏనుగుదంతాలతోనే చేశారు. అందమైన పావంచాలు అమిర్చారు దానికి.

రాజులూ, సామంతులూ వచ్చి మంచి మంచి మంచెల మీద కూచున్నారు. నందుడూ మొదలైన వారు తమ కేర్పరచిన మంచెలమీద కూచున్నారు. బాజాలూ, బజంత్రీలూ మోగుతున్నాయి. రాజలాంఛనాలతో వచ్చి, మంత్రులతోనూ వాళ్ళతోనూ ఏనుగు దంతాల మంచెమీద, ఎత్తయిన ఆసనమెక్కి కూచున్నాడు కంసుడు.

జనంతో కిటకిటలాడిపోయింది మల్లరంగం. పెద్దపెద్ద మల్లులు వచ్చారు. వారిని చూడాలని సంబరపడుతున్నారు. రాజభటులు సద్దులేకండా చేస్తున్నారు.

ఇంతలో రామకృష్ణులు రంగస్థలానికి వచ్చారు. ఇద్దరూ గొల్లలలాగే వున్నారు. తెల్లటి బలరాముడు నీలి బట్టలు కట్టుకున్నాడు. నల్లటి కృష్ణుడు పసుప్పచ్చటి బట్టలు కట్టుకున్నాడు. ఇద్దరూ గంధాలు పూసుకున్నారు. పూలదండలు వేసుకున్నారు. కొదమసింహాల్లా నడుస్తున్నారు. వెంట కొంతమంది గొల్లలూ వున్నారు.

పెద్దద్వారం దగ్గిరికి వచ్చేసరికి కంసుడు పట్టపుటేనుగు కువలయాపీడం అడ్డంగా వుంది. పెద్ద నడగొండలా వుందది. ఇంతా అంతా కాదు దాని బలం. మీద మావత్తు మహా

మాత్రుడు కూచున్నాడు. అల్లంత దూరం నించే రామ కృష్ణుల్ని చూశాడు వాడు. ద్వారానికి అడ్డంగా ఏనుగుని నిలబెట్టాడు. అంకుశం పొడిచి రామకృష్ణుల మీదికి వుసి కొలిపాడు.

చూశాడు కృష్ణుడు. ముందే సిద్ధంగా వున్నాడు. చప్పున నడుం బిగించాడు. మబ్బులా వురిమి, చప్పట్లు చరిచి, ఏనుగుముందు కురికాడు. దాని తొండం పట్టుకున్నాడు. దంతాల మధ్య తాపుల మీద తాపులు తగిలించాడు. గీ పెట్టిందది. అంతతో వూరుకోలేదు కృష్ణుడు. అది చంపడానికి ప్రయత్నించిన కొద్దీ దాన్ని తోకపట్టి ఈడ్చి, కుంభస్థలం మీదపొడిచీ, దంతాలు పట్టి కింద పడగొట్టాడు. అది రక్తం కక్కుకుంటూ వుండగా దాని దంతం వూడ పెరికేశాడు. రెండో దంతం బలరాముడు వూడ బెరికాడు. దాంతో అంత కువలయాపీడం చచ్చి వూరుకుంది. ఆ వూపుని మహా మాత్రుణ్ణీ చంపేశాడు కృష్ణుడు.

## మల్లయుద్ధం

రామకృష్ణులు రంగంలో చొరబడ్డారు. కోడెతాచుల్లా బుసకొడుతున్నారు వారు. ఒంటినిండా రక్తం మరకలు అదో అందంగా అవుపిస్తూవుంది. చేతుల్లో ఏనుగు దంతాలు యమ దండాల్లా వున్నాయి. కళ్ళల్లో చింతనిప్పులు కురుస్తున్నాయి. జబ్బలు చరుస్తూ రంగస్థలం మధ్యకి వెళ్ళి నుంచున్నారు వారు.

వాళ్ళని చూస్తూ చూడలేక పోయాడు కంసుడు.

భయమూ, క్రోధమూ అతడిని ఆవరించాయి. మొహం వెలవెలపోతూ వుంటే కళ్లు అగ్గి కురిశాయి.

'నిన్న మొన్నటి కుర్రకుంకలు, ఏమిటీ వీరి చొరవ! కువలయాపీడవంటి ఏనుగు వీళ్ళని చంపలేకపోయింది! అవాళ బయలు పలికిన మాట తప్పదా ?'

అనుకుంటూ చాణూర ముష్టికుల్ని పిలిచాడు. బలరామకృష్ణులతో వాళ్ళకి మల్లయుద్ధం కల్పించాడు.

గడిదేరిన గండరగండలు చాణూర ముష్టికులు. వాళ్ళతోనా ఈ ముక్కుపచ్చలారని రామకృష్ణులు మల్లయుద్ధం!

ముక్కుమీద వేలు వేసుకున్నారు జనం.

యాదవులలో మల్లయుద్ధ మెరిగినవారు మల్లయుద్ధం పద్ధతులు వివరించారు.

"మల్లయుద్ధంలో ఆయుధాలు పట్టుకోకూడదు. అలిసిపోయినప్పుడు పోట్లాడుతున్న వాళ్ళని పానీయాలు తాగనివ్వాలి. నిలబడిన వాడితో నిలబడే చేతులు కలపాలి. వంగిన వాడితో వంగి పోట్లాడాలి. కూచుంటే కూచునే పోట్లాడాలి. సమవుజ్జీలుగా దెబ్బలాడాలి. ఒకడు పడిపోతే రెండోవాడు ఆగిపోవాలి కాని చంపనేకూడదు. ఒకళ్ళ నొకళ్ళు నెట్టడానికి ప్రయత్నించడమూ, కదలకుండా స్థిరంగా నిభాయించుకోడమూ, శౌర్యంచూపడమూ, కాళ్ళూ చేతులూ కదలించడమూ, మర్మస్థలం తాకకుండా వుండడమూ, ఇవి మల్లయుద్ధ ధర్మాలు. చిత్తయినవాణ్ణి చంపకూడదు. ఆయుధాలయుద్ధంలో పగవాణ్ణి చంపవచ్చు. మల్లయుద్ధంలో చితుచే స్నేహాలు. మల్లయుద్ధంలో చిత్తయి పడిపోయిన వాణ్ణి చంపితే ఆ తప్పు

రాజుకే చెందుతుంది. అసలు పగపట్టి మల్లయుద్ధం చేయ కూడదు."

"చాణూరుడూ కృష్ణుడూ పోట్లాడాలి. ముష్టికుడూ బలరాముడూ పోట్లాడాలి." అంటూ ఆజ్ఞాపించాడు కంసుడు.

ఆంధ్ర మల్లుడు చాణూరుడు. ఉద్దోలమైన బలవంతుడు. ముక్కాకలు తేరిన ముష్కరుడు. చిత్తయి పడిపోయినవారిని ఎంతోమందిని చంపేసిన మూర్ఖుడు. కోపంతో ధుమధుమ లాడుతూ కృష్ణుడిమీదికి వచ్చాడు.

చిరునవ్వుతో చూశాడు కృష్ణుడు.

"నేను కుర్రాణ్ణి. జగజ్జెట్టి చాణూరుడు పగతోనే నా మీదికి వస్తున్నాడు. పగతో రావడం మల్లయుద్ధ ధర్మా లకు విరుద్ధం. పగతో కలబడినవాణ్ణి కడ ముట్టించటం అధర్మం కాదు." అంటూ తానూ జబ్బలు చరిచాడు.

ఇద్దరూ తొడలు చరుచుకున్నారు. ఇద్దరూ సింహ నాదాలు చేశారు. చేయీ చేయీ కలిపారు. ఒకరినొకరు లాక్కున్నారు. ఒకరినొకరు తోసుకున్నారు. ఒకరినొకరు పొడుచుకున్నారు, గుద్దుకున్నారు, చరుచుకున్నారు. పేచీ పట్లు పట్టుకున్నారు. ఒకరినొకరు జంకించారు. ఒకరిచుట్టూ ఒకరు తిరిగారు. ఒకరిమీదికి ఒకరు దూకారు. గద్దించు కున్నారు. అడివి ఏనుగుల్లాగ కలబడ్డారు. అడివి పందుల్లాగ, ఆబోతుల్లాగ పోట్లాడారు.

"అద్దదీ", "బలే బలే" అంటూ జనం తగనిగోల చేశారు. ఆగమన్నా ఆగలేదు వాద్యాలు.

ఉన్నట్టుండి చాణూరుణ్ణి ముందుకి వంచి, తలమీద పిడుగులాటి గుద్దుగుద్దాడు కృష్ణుడు. జుమాలుమన్నాడు చాణూరుడు. ముడుకులతో గుండెలమీద పొడిచి వాణ్ణి కిందపడగొట్టాడు కృష్ణుడు. రక్తం కక్కుకుంటూ వెల్లకిలా బడి, ప్రాణం వొదిలేశాడు చాణూరుడు.

కంసుడి కిరీటరత్నం కిందపడింది. మరుక్షణంలో బలరాముడూ, ముష్టికుడూ కలబడ్డారు. బలరాముడితో పోట్లాడుతూనే అతణ్ణి వొదిలేసి కృష్ణుడిమీదికి వురికాడు ముష్టికుడు. కొండంతవున్నాడు. బాగా దగ్గిరికి రానిచ్చాడు కృష్ణుడు. రెండుచేతులతోనూ ఎత్తిపట్టుకున్నాడు. గిరగిరా వందమార్లు తిప్పి నేలమీద విసిరికొట్టాడు. దాంతో నెత్తురు కక్కుకుని చచ్చివూరుకున్నాడు వాడు.

అదిచూసి, మల్లులలో కూటుడు బలరాముడిమీదికీ, శలుడూ, తోశలుడూ కృష్ణుడిమీదికీ తోసుకువచ్చారు. ముగ్గురిని చంపిపారేశారు రామకృష్ణులు. మిగిలిన మల్లులు పుంజాలుతెంపుకు దౌడుతీశారు. ఆగమన్నా ఆగలేదు. సుళ్ళుతిరిగిన సముద్రంలా అయింది రంగస్థలం.

## కంసుడి చావు

మతిపోయింది కంసుడికి. మంచెమీంచి పిచ్చికేకలు వేశాడతడు.

"ఈ కొండగొల్లకుర్రాళ్ళనిద్దరినీ కొట్టి తరిమేయండి. కంటితో చూడను వీళ్ళని. నందుడూ మొదలైనవాళ్ళని పట్టుకోండి ఖైదుచేయండి. నా రాజ్యంలో గొల్లపురుగంటూ

వుండకూడదు. వసుదేవుణ్ణి చంపేయండి. ఉగ్రసేనుణ్ణి నరికేయండి, నరికేయండి—"

కంసుడి నోట్లో మాట నోట్లోనేవుంది, మెరుపులాగ దంతాల మంచెమీాదికి వురికాడు కృష్ణుడు.

కంగారుగా కత్తిదూశాడు కంసుడు. డేగలాగ పట్టేశాడు కృష్ణుడు. కంసుడి కిరీటం కిందపడగొట్టాడు. అతడు జుట్టుపట్టుకుని కింద కూలదోశాడు. మంచెమీాంచి కిందపడీ పడడంతోనే, అతడి గుండెలమీాదికి దూకాడు. పిడుగుపడి నట్టయి, ప్రాణం వొదిలేశాడు కంసుడు.

అదిచూసి అతడితమ్ముళ్లు సహించలేకపోయారు. రామకృష్ణుల్ని చుట్టుముట్టారు. పెద్ద ఇనపగుదియ పుచ్చుకున్నాడు బలరాముడు. వాళ్ళందరినీ వరసపెట్టి చంపేశాడు.

కంసుడిభార్యలూ, అతడితల్లీ వచ్చి గోలుగోలు మన్నారు.

బందిఖానాకివెళ్ళి దేవకీవసుదేవుల ఖైదు విడిపించాడు. బలరాముడితో కలిసి వారికి పాదాభివందనం చేశాడు.

కుమాళ్ళని గుండెలకద్దుకున్నాడు వసుదేవుడు. అన్నాళ్ళకి కొడుకుల్ని కళ్ళారాచూసింది దేవకి. చనుబాలు చేపాయి తల్లికి. కన్నీళ్లతో గాఢంగా కౌగిలించుకుందామె.

ఉగ్రసేనుడ్ని ఖైదు విడిపించి, కొడుకులకోసం దుఃఖిస్తున్న అతడ్ని వోదార్చాడు కృష్ణుడు.

"బాబూ!" కన్నీళ్లు తుడుచుకుంటూ కృష్ణుడితో అన్నాడు ఉగ్రసేనుడు, "నీ మేనమామ తాను చేసుకున్నది

తాను అనుభవించాడు. నీ మీద పగపట్టాడు. చావుతో సరి పగ. అతడి సంస్కారం సరిగా జరిగేటట్టు చూడు. ఇక ఈ మధురారాజ్యం నీదే. ఈ కోటా, మేడలూ, మిద్దెలూ, అన్నిసంపదలూ నీవే. నువ్వేఏలుకో. నేను కోడళ్ళతో అడి వికి వెళ్ళిపోతాను. మిగిలిన నాలుగునాళ్లూ అడివిలో గడుపు తాను."

"అదేమిటి తాతయ్యా?" అందుకున్నాడు కృష్ణుడు; "రాజ్యంకోసం ఈ పని చెయ్యలేదు నేను, సంఘం మంచికోరి చేశాను. నాకు రాజ్యం అక్కరలేదు. బృందావనంలో గొల్ల లతో గొల్లవాడిగా వుండడమే సరదా నాకు. ఈ రాజ్యానికి నువ్వే రాజువి." అంటూ బంధువులందరిముందూ ఉగ్ర సేనుణ్నే రాజుగా నిలిపాడు. రాజలాంఛనాలతో కంసుడి శవానికీ, అతడితమ్ముడి శవాలకీ యమునవొడ్డున అగ్ని సంస్కారం చేయించాడు. దినవారాలూ జరిపించాడు. కంసు డికి భయపడి దేశాలుపట్టిపోయిన వృష్ణి, అంధక, యాదవ కుటుంబాలని తెప్పించి, ఎవరి ఇళ్లల్లో వాళ్లని వుంపించాడు. బృందావనంనించి తనతోవచ్చిన కోనార్లని తిరిగి పల్లెకి పంపిస్తూ నందుడితో, సముదాయిస్తూ ఇలా అన్నాడు: "తండ్రీ, నువ్వూ, అమ్మ యశోదా నన్ను కంటికిరెప్పలా కాపాడుతూ పెంచారు. అన్నయ్యనీ, నన్నూ ఇంతవాళ్లని చేశారు. నన్ను క్షణం చూడకపోతే వుండలేరు మీరు. మిమ్మల్నీ, ఆవుల్నీ, మనపల్లెనీ వొదిలి వుండడమంటే ఎంతో బాధగావుంది నాకు. అయినా ఇక్కడిపనులు చక్కచేయక తీరదు. ఇవి చూసుకుని మీ దగ్గిరికి వస్తాను."

వలవలా కన్నీళ్లుకార్చాడు నందుడు. కృష్ణుడ్ని గుండెలకద్దుకున్నాడు. అలాగే బలరాముడ్ని కౌగిలించు కున్నాడు. కదలలేక కదలలేక కన్నీళ్లుకారుస్తూ పల్లెదారి పట్టాడు.

## చదువు సంజలు

నిత్యకల్యాణం పచ్చతోరణంగా వుంటుందిప్పుడు మథుర. యాదవకులంలో అంతాపండగే. బలరామకృష్ణులు తమ ఇంట దేవకీ వసుదేవులదగ్గిర వుంటూవచ్చారు.

యాదవుల కులపురోహితుడు గర్గుడు. అతడిదగ్గిర కొడుకులకి చదువుసంజలు చెప్పించాడు వసుదేవుడు.

అనంతరం అవంతీపురం పంపించాడు. అక్కడ సాందీపన మునిదగ్గిరవుండి అన్నివిద్యలూ నేర్చుకున్నారు రామకృష్ణులు. ధనుర్వేదమూ నేర్చుకున్నారు. గదా యుద్ధంలో ఆరితేరారు. అరవైనాలుగురోజుల్లో అరవై నాలుగువిద్యలూ ఆపోశనం పట్టేశారు. నాలిక కరుచు కున్నాడు సాందీపనుడు. 'అసాధారణమయిన శక్తిమంతులు వీళ్లు' అనుకున్నాడు.

విద్యపూర్తిచేసి, గురుదక్షిణ అడగమన్నారు రామ కృష్ణులు. ఆలోచించాడు సాందీపనుడు. కొన్నాళ్ళక్రితం తన ఒక్కగానొక్క కొడుకుని ప్రభాసతీర్థం పంచజన్యుడని ఒక రాక్షసుడు ఎత్తుకపోయాడు.

"నా కొడుకుని నాకు తెచ్చిపెట్టి గురుదక్షిణ తీర్చు కోండి." అని అడిగాడు సాందీపనుడు.

"సరే" అన్నారు రామకృష్ణులు. ప్రభాసతీర్థం సముద్రపొడ్డుకి వెళ్ళారు. పంచజన్యుడి దగ్గిరికి వెళ్ళాడు కృష్ణుడు. గురువు కొడుకు దొరకలేదు. కాని గొప్ప శంఖం దొరికింది. అదే పాంచజన్యం. కృష్ణుడు అట్టే పెట్టుకున్నాడది.

అక్కడినించి యముడి పట్నం వెళ్ళాడతడు. గురువు కొడుకుని తీసుకువచ్చాడు. గురువుకి గురుకట్నం చెల్లించారు రామకృష్ణులు. దీవించి పంపాడు సాందీపనుడు.

రథంమీాద అవంతీపురం నించి ఏకాఏకిని మథురకి తిరిగి వచ్చారు రామకృష్ణులు. సంతోషంతో స్వాగతం చెప్పారు మథుర ప్రజలు.

## ఉద్ధవుడు

కృష్ణుడంటే ప్రాణం పెట్టేవాడు ఉద్ధవుడు. వృష్ణి వంశంలో చెప్పదగిన వాడతడు. కృష్ణుడితో నీడలా వుండే వాడు. కృష్ణుడిలాగే ముస్తాబయేవాడు. పసుప్పచ్చటి బట్టలే కట్టేవాడు. కృష్ణుడికి నమ్మకమైన సహచరుడతడు.

అక్రూరుడితో మథుర వచ్చిననాటినించీ తిరిగి బృందా వనం వెళ్ళలేదు కృష్ణుడు. చందమామ లేని రాత్రిలా అయి పోయింది బృందావనం. చిన్నబోయింది గొల్లపల్లె. గోవ ర్థనం మీాంచి మురళి వినిపించడంలేదు. అడివి, చెట్టుచెట్టూ, పొదపొదా పులకరించడంలేదు. యమున ఎగిసిపడడంలేదు. ఇసకతిన్నెలు గరిపొడవడంలేదు. వెన్నెల పులికిపాటు లేదు.

ఆలమందలలో అలికిడిలేదు. గొల్లపడుచులలో కలివిడి లేదు. నందుడింట సందడి లేదు.

యశోద సగమయిపోయింది. గొల్లపడుచులూ చిక్కిపోయారు. గొల్లపిల్లలు ఆటలు మానుకున్నారు.

బృందావనమంతా, గొల్లపల్లె యావత్తూ కృష్ణుడి విరహంతో కృశించిపోతూవుంది.

అదంతా కళ్ళముందు కట్టినట్టు కనపడుతూనే వుంది మధురలో కృష్ణుడికి. అతడి మనస్సు ఆరాటపడుతూనేవుంది.

అందుకని ఓమారు బృందావనం వెళ్ళి రమ్మన్నాడు.

బృందావనం వెళ్ళాడు ఉద్ధవుడు. వేకువనే రథమెక్కి మునిమాపు వేళకి గొల్లపల్లె చేరాడు. ఉద్ధవుణ్ణి చూడగానే ఎంతో గౌరవించాడు నందుడు. యశోద పరిగెత్తుకు వచ్చింది. రామకృష్ణుల కుశలమడిగి కళ్ళనీళ్లు పెట్టుకుంది.

"నన్ను మరిచేపోయాడు నా కన్న!" అంటూ ఖాంద్రుమంది. నందుడూ కన్నీళ్లుకార్చాడు.

"నా ఇల్లు చీకటే చేసేశాడు నా నల్లనయ్య! అన్నదమ్ములిద్దరూ బాగున్నారా ఉద్ధవా? మా మాట తలుచుకుంటారా ఎప్పుడయినా? తమ్ముడు వసుదేవుడూ, దేవకీ కొడుకుల మొహమైనా చూడకండా అన్నాళ్ళూ ఖైదులోవున్నారు. అన్నికష్టాలూ అనుభవించారు. పోనీ కొడుకుల్ని పెట్టుకుని కులాసాగా వున్నారుకదా, ఇప్పుడు."

అన్నిటికీ జవాబులు చెప్పాడు ఉద్ధవుడు.

"మధురలోవున్నా బృందావనంమీదే ధ్యాస రామ కృష్ణులికి."

రాత్రంతా నందయశోదలతోనే గడిచింది ఉద్ధవుడికి.

మర్నాడు తెల్లవారింది. నందుడి గుమ్మంలో రథం చూశారు గొల్లపడుచులు. ఒకరిమొహం ఒకరు చూసుకున్నారు.

"వచ్చాడా—?"

క్షణంలో వాళ్ళంతా ఉద్ధవుడిచుట్టూ చేరారు ఏకాంతంగా. అతడు ఉద్ధవుడనీ, మధురనించి వచ్చాడనీ, కృష్ణుడు కబురు చెప్పిపంపాడనీ తెలుసుకున్నారు.

"కబురుతెచ్చాడు. అయ్య నందుడిదగ్గిరికీ, అమ్మ యశోదదగ్గిరికీ కబురుపంపాడు. మనదగ్గిరికెందుకు పంపుతాడూ కబురు!" అంది ఒక పడుచు.

తలా ఒకమాట అన్నారు. తలా ఒకప్రశ్న అడిగారు. ఊపిరాడనివ్వలేదు ఉద్ధవుడికి.

"అసలు మేం జ్ఞాపకమున్నామా?"

"తేనె అవడంతోనే తుమ్మెదపని సరి. ఒకపొద అయిపోతే మరొకపొద."

"మగాడి మనసే అంత!"

"అయినా, పట్నంపడుచులు దొరికేక పల్లెటూరి గొల్లపడుచులెందుకూ మరి!"

"పోనీ, అవాళ వెన్నెట్లో రాసక్రీడ వూసెత్తుతాడా ఎప్పుడైనా?"

"అదను తీరాక, మరి మేమెందుకూ ?"

"మా మగల్ని కాదన్నాం. అతణ్ణే మగడని నమ్మాం. నమ్ముకున్న వాళ్ళని కన్నెత్తి చూడకండా పారిపోయాడు తుర్రుమని రథమెక్కి—."

"ఇక రాజుకూతుళ్ళని పెళ్ళాడతాడు. పట్టు పరుపుల మీద పడుకుంటాడు. యమున ఇసకపర్రలు ఇంకెందుకూ !"

అలా అంటూ అంటూ వాళ్ళ విరహావేదన వెర్రి కిందికి దిగింది. ఏమనాలో, ఏమి కూడదో అన్న సంకోచమే లేకపోయింది. కృష్ణుడు తమతో చేసిన రతిక్రీడలు పల వించారు కొందరు. కొందరు కృష్ణుడిలీలలు పాటలు పాడారు.

తుమ్మెదమీద నెపంపెట్టి పాటపాడిందొకతె:

"తుమ్మెదా ! తుమ్మెదా !

కృష్ణమూర్తి నలుపు, నువ్వూ నలుపు.

ఆ మోసగాడి పాట వినిపించడానికి వచ్చినట్టున్నావు !

పడుచుల రొమ్ములమీద దండలలో నలిగిన

పువ్వులమీద వాలావా ?

వాటి పుప్పొడి మీసాలకు పులుముకున్నావా ?

తుమ్మెదా ! తుమ్మెదా !

నీ కబురు మే మెరుగుదుం,

పట్నం పువ్వులపై పూతతేనె చప్పరించావు.

అడివి పూల తేనె ఆశించకు.

తుమ్మెదా! తుమ్మెదా!
మాయదారి తుమ్మెదా!
ఇళ్ళూ వాకిళ్ళులేని గొల్లపడుచులం.
మా ముందెందుకు నీ పట్నంపాట!
పట్నం పువ్వులు వన్నెల విసనక్రలు.
వాళ్ళకి వినిపించు.
నీవల్లో పడని పడుచుపువ్వు
ఎక్కడుంటుంది?
తుమ్మెదా! తుమ్మెదా! మోసకారి తుమ్మెదా!
దగాకోరు తుమ్మెదా!"

గొల్లపడుచుల అవస్థ చూసి విస్తుపోయాడు ఉద్ధవుడు. ఎన్నోవిధాల వాళ్ళని సముదాయించాడు.

"అమ్మాయిలూ!" నెమ్మదిగా ఎత్తుకున్నాడు; "మీలాగే మిమ్మల్ని తలుచుకుంటున్నాడు కృష్ణుడు. అందు కని మీ కోసమే నన్ను పంపాడు.

గొల్లపడుచులు నా ప్రేయసులు. నేను వాళ్ళ ప్రియ తమ్ముణ్ణి. వాళ్లే నేను. నేనే వాళ్లు అన్నాడు." మధురలో కృష్ణుడు చేసినపనులు చూసినవి చూసినట్టు చెప్పాడు.

ఉలికులికిపడుతూ విన్నారు గొల్లభామలు. అందరూ కృష్ణలీలలు పాడారు.

గొల్లలరాజు నందుడు. అతడింట కొన్నాళ్లు బృందా వనంలో వున్నాడు ఉద్ధవుడు.

ఉద్ధవుడు కేవలం కృష్ణుడి అనుచరుడే కాదు, అతడి భక్తుడుకూడా. అందుకని బృందావనంలో కృష్ణుడు తిరిగిన చోటల్లా తిరిగిచూశాడు. గోవర్ధనం, యమున, ఇసక తిన్నెలూ, తోపులూ అన్నీ తిరిగాడు. ఆవులు మేపుతూ, అతడు ఆడిన ఆటలూ, పాడిన పాటలూ విన్నాడు. మధుర తిరిగివచ్చి, కృష్ణుడితో నీడలా తిరుగుతూ వచ్చాడు.

## త్రివక్రి పొందు

ఉద్ధవుడితో కలిసి ఓనాడు వెనకటి గూని త్రివక్రి ఇంటికి వెళ్ళాడు కృష్ణుడు. అన్నాళ్లూ అతడికోసం ఎదురు చూస్తూవుంది త్రివక్రి. గూని ఆనాడేపోయి అందంగా వుందామె. ముసిముసి నవ్వులతో కృష్ణుణ్ణి లోపలికి తీసుకు వెళ్ళింది. ఆమెతో కూడి సుఖపెట్టాడు కృష్ణుడు. తనివితీరక తనదగ్గిరే వుండిపోమంది త్రివక్రి. వదలలేక వదలలేక వదలి పెట్టింది.

మాట మరిచిపోకండా మరోనాడు బలరాముడితోనూ, ఉద్ధవుడితోనూ కలిసి అక్రూరుడి ఇంటికి వెళ్ళాడు కృష్ణుడు. అతడి పినతండ్రి అక్రూరుడు. రామకృష్ణులిద్దరినీ ఎంతో ఆదరించి గౌరవించాడతడు.

“కంసుణ్ణి కడతేర్చి కులాన్నే కాదు, లోకాన్నే కాపాడారు మీరు.” అంటూ ఎంతో మెచ్చుకున్నాడు.

## పాండవులు

యాదవులకి పాండవులు కావలసిన చుట్టాలు. పాండవుల తల్లి కుంతి, బలరామకృష్ణుల మేనత్త.

పాండురాజు కాలంచేశాక, కుంతీ, పాండవులూ హస్తినాపురంలో ధృతరాష్ట్రుడి దగ్గిర వుంటూ వచ్చారు.

ధృతరాష్ట్రుడి కొడుకులూ, పాండురాజు కొడుకులూ ఒక్కదగ్గిరే పెరిగారు. ఆటల్లోనూ వాటిల్లోనూ పాండవుల దగ్గిర తీసికట్టుగా వుండేవారు ధృతరాష్ట్రుడి కొడుకులు. వాళ్ళలో దుర్యోధనుడూ, దుశ్శాసనుడూ మొదలయిన వంద మందీ కూడా బలంలో పాండవుల్ని మించలేకపోయేవారు. అంతమందినీ ఒక్క భీముడే ముచ్చెమటలు పోయించేవాడు. అంచేత అతణ్ణి చంపెయ్యాలని దుర్యోధనుడు ఎన్నో కుట్రలు పన్నాడు. విషం పెట్టాడు. మత్తుకలిగించి నీళ్ళలో తోశాడు. అష్టకష్టాలూ పెట్టాడు.

తండ్రిలేని పిల్లలు పాండవులు. తలచెడిన తల్లి కుంతి. గుడ్డి ధృతరాష్ట్రుడు తన కొడుకుల్నే వెనకేసుకు వచ్చేవాడు. పైకిమాత్రం కనపడకండా నటించేవాడు. కుంతి బాధపడేది. విదురుడుమాత్రం ఆమెనీ, ఆమె కుమాళ్ళనీ ఆదరిస్తూ వుండేవాడు.

తన మేనత్తా, బావమరుదులూ బాధలు పడుతున్నారని ఆనోటా, ఈనోటా విన్నాడు కృష్ణుడు. అక్రూరుణ్ణి హస్తినాపురం పంపించాడు. నిజం విచారించి రమ్మన్నాడు.

అక్రూరుడు హస్తిన వెళ్ళాడు. కౌరవుల్ని కలుసు

కున్నాడు. కుంతినీ, పాండవుల్నీ చూశాడు. విదురుడి దగ్గిర వివరాలు విన్నాడు. కొన్నాళ్ళు హస్తినలో వుండి అన్నీ అవగాహన చేసుకున్నాడు. ధృతరాష్ట్రుడితో చెప్పవలసినవి చెప్పాడు. అతడి మాటలు పట్టించుకోలేదు ధృతరాష్ట్రుడు గుడ్డిరాజు.

మథుర తిరిగివచ్చి, అన్నీ కృష్ణుడికి వివిపించాడు అక్రూరుడు. అవాళనించీ హస్తినవేపు ఓ కంట కనిపెడు తూనే వుండేవాడు కృష్ణుడు.

## జ రా సం ధు డు

జరాసంధుడు మగధరాజు. కంసుడి మామ. అతడి కూతుళ్ళు అస్తీ, ప్రాప్తీ-ఇద్దరూ కంసుడి భార్యలు.

జరాసంధుడు అప్పటిరాజులలో బలవంతుడు. ఆ నాటి పెద్ద పెద్ద రాజులు అతడి స్నేహితులు.

మగడు కాలంచేశాక అస్తీ, ప్రాప్తీ మగధ వెళ్ళి పోయారు. తలచెడ్డ కూతుళ్ళని చూసి బాధపడ్డాడు. బల రామకృష్ణులమీద పగ "యాదవులతో కలిపి మథుర మంట కలిపేస్తా"నంటూ వురిమాడు. సేనలు సిద్ధం చేశాడు.

మగధరాణువ మథురకి ప్రయాణమయింది. రథాలూ, ఏనుగులూ, గుర్రాలూ, పదాతులూ-సముద్రంలా వుంది సేన. భేరీలూ, మద్దెళ్ళూ, బూరాలూ, శంఖాలూ-దిక్కులు దిమ్మెత్తించాయి.

కబురు తెలియడమే తడువు దంతవక్త్రుడూ, శిశు

పాలుడూ, కళింగరాజు పౌండ్రుడుడూ, సాంకృతకేశికుడూ, విదర్భరాజు భోజకుడూ, అతడికొడుకు రుక్మి, విదేహరాజు భద్రుడుడూ, మద్రరాజు శల్యుడూ, సాల్వుడూ, పాండ్య, గాంధార రాజులూ, మొదలైన మిత్రబృందం వచ్చి సేనలతో జరాసంధుతో కలిసింది. అలా అంతమందితోనూ ఎత్తివచ్చి మథుర ముట్టడించాడు జరాసంధుడు.

పట్నం పడమటివేపు మద్ర, కళింగ, కరూష, కాశ్మీర దేశాలరాజుల్నీ, కొండ రాజుల్నీ సైన్యాలతో నిలబెట్టాడు. ఉత్తరంవేపు విదర్భ, మాళవ, త్రిగర్త దేశాల రాజుల్నీ, రుక్మి, శతధన్వుడు, వింద, అనువిందులు, దంతవక్త్రుడు మొదలైన వీరుల్ని నిలబెట్టాడు.

తూరుపువేపు ఏకలవ్యుడు, జయద్రథుడు, శలుడు, ఉత్తమౌజుడు, బృహత్‌క్షత్రుడు మొదలైన యోధుల్ని నిలబెట్టాడు.

ఛేదిరాజూ, శిశుపాలుడూ, దరదుడూ మొదలైన వారితో తాను దక్షిణ ద్వారం కాశాడు.

యమున ఒడ్డు పొడుగునా సేనలే సేనలు. ఇసక వేస్తే రాలదు.

అప్పటికే ఆయుధాలూ, రథాలూ అవీ కూర్చుకుని రాటుతేరారు రామకృష్ణులు. బలరాముడి రథంమీద తాటిచెట్టు జెండా ఎగురుతూ వుంది. కృష్ణుడి రథంమీద గరుడ పతాకం రెపరెపలాడుతూ వుంది.

కృష్ణుడి సారథి దారుకుడు.

నాగలీ, ముసలమూ బలరాముడి ఆయుధాలు. నాగలి పేరు సంవర్తకం. ముసలం పేరు సౌనందం.

ధనుస్సూ, చక్రమూ, గదా కృష్ణుడి ఆయుధాలు. ధనుస్సుపేరు శార్ఙ్గం. చక్రంపేరు సుదర్శనం. గదపేరు కౌమోదకి.

జరాసంధుడు మధుర ముట్టడించడంతోనే జల్దుకున్నారు యాదవులు. అప్పటికే యాదవ సైన్యం గొప్పది తేరి చూడరాంది.

వసుదేవుడూ, గదుడూ, సాత్యకీ, సత్రాజిత్తూ, ప్రసేనుడూ, ఆహుకుడూ, బభ్రుడూ, శంకుడూ, చిత్రకుడూ, శ్యాముడూ, శ్వఫల్కుడూ, యుయుధానుడూ మొదలయిన యాదవయోధులు రకరకాల ఆయుధాలతోనూ, రథాలతోనూ, పెద్దపెద్ద సైన్యాలతోనూ వెళ్ళి పగవాళ్ళ నెదిరించారు. ఘోరంగా జరిగింది పోరు.

రామకృష్ణుల నాయకత్వంతో వుప్పెనలా పొంగింది యాదవసేన.

రథాలెక్కి బయల్దేరారు రామకృష్ణులు. పాంచజన్యం పూరించాడు కృష్ణుడు. మగధసేనలు దద్దరిల్లి పోయాయి. ఏనుగులూ, గుర్రాలూ మలమూత్రాలు విసర్జించాయి.

"అన్నయ్యా!" బలరాముణ్ణి హెచ్చరించాడు కృష్ణుడు "యాదవకులానికి నువ్వే దిక్కు ఇప్పుడు. నువ్వే జరాసంధుడి పొగరు అణచాలి."

ఉద్రేకంతో ముందుకి వురికాడు బలరాముడు.

"నువ్వేరా" అరిచాడు జరాసంధుడు. "కృష్ణుడు దొంగ. పండగకి పిలిచిన మేనమామని చంపిన దుష్టుడు. వాడి మొహం చూడన్నేను. వాడి పేరంటే అసహ్యం. ముందు నిన్ను ముక్కలు కింద తరుగుతాను. స్వర్గానికి వెళుదువు కాని." అంటూ ధనుస్సు మోగించాడు.

జరాసంధుడితో బలరాముడూ, రుక్మితో కృష్ణుడూ, భీష్మకుడితో ఆహుకుడూ, క్రథకుడితో వసుదేవుడూ, కౌశికుడితో బభ్రుడూ, శిశుపాలుడితో గదుడూ, దంతవక్త్రుడితో శంకుడూ కలబడ్డారు. హోరా హోరి పోట్లాడారు.

ఏనుగులతో ఏనుగులూ, గుర్రాలతో గుర్రాలూ, రథాలతో రథాలూ, సైనికులతో సైనికులూ పోరాడారు.

ఏనుగులు పీనుగులయాయి. గుర్రాలు కూలిపోయాయి. రథాలు ముక్కలయాయి. సేనలు పీనుగు పెంటలయాయి. మిగిలిన మగధ సేనలు తోకముడిచాయి.

రుక్మి సేనలన్నీ ఊడ్చేశాడు కృష్ణుడు. చావు తప్పి కన్నులొట్టపోయింది రుక్మికి.

బలరాముడూ జరాసంధుడూ సమవుజ్జీలలా యుద్ధం చేశారు. మగధసేనలో రక్తం వరదలు కట్టించాడు బలరాముడు. ఆ వరదలో మెదళ్ళు, మాంసాలూ బురదలాగా, జుత్తులు నాచులాగా అవుపించాయి. పదాతుల కళేబరాలు చేపల్లాగా, గుర్రాల శవాలు మొసళ్ళలాగా కొట్టుకుపోయాయి. ఏనుగులు పీనుగులు పడుకుల్లాగ కనిపించాయి.

నల్లతాచుల్లాటి బాణాలతో జరాసంధుణ్ణి ముంచెత్తాడు

బలరాముడు. జరాసంధుడు మాత్రం సామాన్యుడా? బలమైన బాణాలతో కొట్టాడు బలరాముణ్ణి.

ఇద్దరూ ఇద్దరే అనిపించారు. ఇద్దరూ హుంకారాలు చేశారు. ఇద్దరూ శంఖాలు పూరించారు. ఇద్దరూ అల్లెతాళ్లు మోగించారు. కొంచేపయేసరికి ఇద్దరి గుర్రాలూ కూలి పోయాయి. ఇద్దరి సారథులూ చచ్చిపోయారు. ఇద్దరి ధనుస్సులూ విరిగిపోయాయి.

ఇద్దరూ గదలు పట్టుకుని రథాలు దిగారు. గదలతో కొట్టుకున్నారు. ఖణేలుమంటే ఖణేలుమన్నాయి గదలు. పిడుగు లురిమాయి. నిప్పులు కురిశాయి. గదాయుద్ధంలో ఒకరిని మించిన వారొకరు బలరామ జరాసంధులు.

రణరంగమంతా గదాయుద్ధంచూస్తూ గజగజలాడి పోయింది.

ఎంతోసేపు జరిగింది గదల పోట్లాట. కాని ఇద్దరిలో ఎవ్వరూ గెలవలేదు. ఎవ్వరూ వోడిపోనూలేదు. 'గెలుపు సులువుకాదు.' అని ఇద్దరూ అనుకున్నారు. ఇద్దరూ ఆగి పోయారు.

కృష్ణుడు రెచ్చకొట్టడంతో యాదవసేన హెచ్చి పోయింది. మగధసేనని తరిమికొట్టింది.

ముసలం పట్టుకుని ముందు కురికాడు బలరాముడు. కృష్ణుడు జరాసంధుడి సేనాధిపతిని కౌసికుణ్ణి కడముట్టా ఓడించాడు.

నిలవలేకపోయాడు జరాసంధుడు. 'గెలవలేక పోయానే' అన్న అవమానంతో అడివికి పోవాలనుకున్నాడు. కాని స్నేహితులు మళ్ళించి మగధ తీసుకు పోయారు. మళ్ళీ నాలుగు రకాల రాణువా కూర్చుకుని మధురమీద విరుచుకుపడ్డాడు. ఘోరంగా యుద్ధం చేశాడు. ఎంతో సేన నాశనమయింది. కాని మళ్ళీ పలాయనమే చిత్తగించాడు మగధరాజు.

అలా ఓమారు కాదు రెండుమార్లు కాదు, వరసపెట్టి పద్దెనిమిదిమార్లు మధురమీద దండయాత్ర చేశాడు జరాసంధుడు. ఎంతో జనం నశిస్తూవచ్చింది. ఎంతో ధనం తరిగి పోతూ వచ్చింది. మధురలో శాంతి సౌఖ్యాలు అంతరించాయి. బలరాముడూ, కృష్ణుడూ బలవంతులే అయినా జరాసంధుణ్ణి చంపలేకపోయారు. ఏ ఆయుధంచేతా చావు లేదు అతడికి. అసలు అతడి పుట్టుకే అలాటిది.

పాండవుల తాతమ్మ అన్న బృహద్రథుడి అన్న కొడుకు జరాసంధుడు.

బృహద్రథుడికి ఇద్దరు భార్యలు అయినా సంతానం లేకపోయింది. అందుకని అడివిలో చండకౌశిక మునిని ప్రార్థించాడు. ఒక మామిడిపండు మంత్రించి ఇచ్చాడు ముని. పండు రెండు చెక్కలు కోసి భార్యలిద్దరికీ తలో ముక్కా ఇచ్చాడు బృహద్రథుడు. ఇద్దరూ నీళ్ళాడారు. నెలలు నిండాక ఓ రాత్రి ఇద్దరికీ కానుపు వచ్చింది. ఇద్దరూ తలా ఒక చెక్క పిల్లాణ్ణి కన్నారు. అసహ్యించుకుని బైట పారవేయించారు.

కోట బయట జరా అని ఓ రాకాసి ఉండేది. మాంసం అనుకుని ఎత్తి సంధించి పట్టుకుంది. రెండు చెక్కలూ అతుక్కున్నాయి. గుడులాటి పిల్లడు తయా రయాడు. రాజు కిచ్చి వచ్చింది జర. అదిగో వాడే జరా సంధుడు. జరా సంధించింది కనక జరాసంధుడయాడు. ఆయుధాలతో చావులేకుండా దీవించాడు చండకౌశికుడు. అందుకనే ఆయుధాలతో అతణ్ణి ఓడించలేకపోయారు రామ కృష్ణులు. యాదవుల కది ఆపదగా తయారయింది. జరా సంధుడి దాడి దినదిన గండం, దెయ్యాలపోరు అయింది మధుర బ్రతుకు. ఆలోచనలో పడ్డారు యాదవులు.

అప్పటికి పదిహేడు దండయాత్రలయి పద్దెనిమిదో దండయాత్రకి కాలు దువ్వుతున్నాడు జరాసంధుడు.

ఉగ్రసేనుడి రాజసభలో రామకృష్ణులూ మొదలైన యాదవులు ఆలోచిస్తూ కూర్చున్నారు. వారిలో వికద్రుడు మాట్లాడుతూ యాదవుల పుట్టుపూర్వోత్తరాలూ, మధురా పురం పుట్టుకా వివరించాడు. రాజనీతీ, యుద్ధంలో మెలకు వలూ తెలిసిన వాడతడు.

"మన యదువంశంలో నాగకన్యల కడుపున ముచి కుందుడూ, పద్మవర్ణుడూ, మాధవుడూ, సారసుడూ, హరి తుడూ అని అయిదుగురు మహనీయులు పుట్టారు. మంచి పరాక్రమవంతులు వారు. వారిలో ముచికుందుడు వింధ్య పర్వతం దగ్గిర రెండు పట్టణాలు కట్టి, రాజయి పాలించాడు. అలాగే పద్మవర్ణుడు సహ్యాపర్వతంమీద నగరం కట్టాడు. అక్కడే పడమటివేపు సారసుడు పట్టణం కట్టాడు. సముద్రం

మధ్య పన్నగరాజద్వీపంలో హారితుడు రాజయాడు. మాధవుడు మధుర పాలించాడు.

ముచికుందుడు వింధ్యం దగ్గిర నర్మదానది వొడ్డున కట్టిన పట్టణానికి మాహిష్మతి అని పేరు. పద్మవర్ణుడు వేణ్ణా నది ఒడ్డున సహ్యాం, పడమట కట్టిన ప్రాంతం పేరు పద్మావతం. సారసుడి నగరం పేరు క్రౌంచపురం. హారితుడు పాలించిన ద్వీపంలో మద్గురులు అని ఎంతోమంది జాలారులుండేవారు. రకరకాల రత్నాలూ, ముత్యాలూ కప్పంగా రాజుకి చెల్లించేవారు వారు. దేశదేశాల వర్తకులు ఓడల మీద వచ్చి రాజు హారితుడి దగ్గిర రాసులు రాసులు రత్నాలు కొని పట్టుకుపోయేవారు. మాధవుడు యాదవ రాజ్యానికి రాజయాడు.

మాధవుడి కొడుకు సాత్వుడు. సాత్వుడి కొడుకు భీముడు.

ఈ భీముడు అయోధ్య రాజయిన రాముడికాలం వాడు. అదిగో అప్పుడే రాముడి చిన్న తమ్ముడు శత్రుఘ్నుడు లవణాసురుణ్ణి చంపి మధువనంలో ఈ మధురాపురం కట్టించాడు. అన్నలతో శత్రుఘ్నుడు ఈ లోకం విడిచిపోయాక, లవకుశుల కాలంలో మధుర మన యాదవుల పాలనలోకి వచ్చింది. యాదవ వంశం కంసుడి కారణంగా కష్టాల పాలయే కాలంలో వసుదేవుడికి రామకృష్ణులు కలిగారు.

కంసుడి బాధ తప్పింది. కాని అతడి మామ జరాసంధుడు మాటిమాటికి మనమీద విరుచుకుపడుతున్నాడు.

వీడు దుర్మార్గుడు, బలవంతుడు. ఎందరినో రాజుల్నీ, రాచ కన్నెల్నీ చెరలో పెట్టాడు. వీడు చివరిదాకా మనమీద దండయాత్రలు మానడు.

మన దండు తరిగిపోతూవుంది. ధనం తగ్గిపోతూవుంది. తిండికి కొరత పడుతూవుంది. ఇక పగవాడి దాడి పట్టణం తట్టుకోడం కష్ట సాధ్యం. ఏమంటే తగినన్ని ఆయుధాలూ లేవు మనకి. యంత్రాలూ లేవు. దిట్టమైన దుర్గాలూ లేవు. అగడ్తలూ లేవు. బలమైన ప్రాకారాలూ లేవు. ఇవన్నీ నిర్మించుకోవాలి. ఆయుధాల మందిరాలు కట్టించు కోవాలి. రహస్యమైన సొరంగాలు తవ్వించాలి. ఇలా అన్ని కట్టుబాట్లు చేసుకుంటేనే మన మథుర మనకి దక్కుతుంది.

ఈ యుద్ధాలతో ప్రజలు విసిగిపోయారు. ఎంతో మంది జరాసంధుడి భయంతో వూరువిడిచి పారిపోతున్నారు. 'కంసుడే వుంటే ఈ గతి పట్టేదికాదు' అన్నవారూ లేక పోలేదు.

కృష్ణా! దీనంతటికీ నువ్వే కారణం. నువ్వే ఇప్పుడు నాయకుడివి మాకు. నువ్వే ఆదుకోవాలి.

నువ్వే మా నాయకుడివి. యాదవకులానికి నువ్వే దిక్కు. నువ్వు ఏం చెపితే అదే చేస్తాం మేము. నీ అడుగు జాడలో నడుస్తాం."

వసుదేవుడూ మొదలైన యావన్మందీ "వికద్రుడు చెప్పింది నిజమే అంటే నిజమే" అన్నారు.

"పగవాడితో నిభాయించలేనప్పుడు పలాయనమే

పరమోపాయం” అంటూ అందుకున్నాడు కృష్ణుడు, “నేనూ, అన్నయ్యా మధుర వొదిలి వెళిపోతాం. మామీద పగ కాని మధురమీద పగకాదు జరాసంధుడికి. అంచేత మేం లేమంటే మధురమీదికి రాడు. వచ్చినా మేం లేకపోడం చూసి, మాకోసం గాలించి మా వెంట పడతాడు. మా పలాయనం పరాజయంకాదు, పరమోపాయం. అదును చూసి జరాసంధుణ్ని హరీ అనిపిస్తాను.”

## పలాయనం

రహస్యంగా మారువేషాలు వేసుకుని మధురనించి పారిపోయారు రామకృష్ణులు. ఆ పోవడం పోవడం దక్షిణ దేశానికి నడిచారు. వేణీనది దగ్గిర కరవీరపురం చేరారు. అక్కడ అడివిలో పరశురాముణ్ని చూశారు. అతడు చెప్పిన ప్రకారం వేణీనది దాటారు. అక్కడ యజ్ఞగిరిమీద ఒక రాత్రి వున్నారు. అవతల ఖట్వాంగనది దాటి క్రౌంచపురం చేరారు. అనంతరం గోమంతపర్వతం మీదికి వెళ్ళారు. రకరకాల చెట్లతోనూ, మృగాలతోనూ, పిట్టలతోనూ, సెలయేళ్ళతోనూ ఎంతో గొప్పగా వుంది గోమంతం. విరబూసిన పువ్వులు గమ్ముమంటున్నాయి. ఆరముగ్గిన పళ్లు నోరూరిస్తున్నాయి. కమ్మని పిల్లగాలులు హాయి కల్పిస్తున్నాయి.

గోమంతం శిఖరాలు ఆకాశం అంటుతున్నట్టుంటాయి. దీనికి ప్రస్రవణం అనికూడ పేరు. హెచ్చువర్షాలు కురిసే కొండ కనక దానికా పేరు వచ్చింది.

రామకృష్ణులు వచ్చి గోమంతంమీద తిరుగుతూ వుండగా ఒక కదంబం చెట్టు తొర్రలోంచి కారుతూ కల్లు కనబడింది బలరాముడికి. కదంబం చెట్టునించి కారడంచేత దాని పేరు కాదంబరి. వాసన మత్తుగా వుంది.

కాదంబరిమద్యం కడుపారా తాగాడు బలరాముడు. కైపెక్కి కళ్లు తిప్పాడు.

ఆ కైపులో అతడికి కాదంబరి అందమైన ఆడదిగా వరించింది. తనపేరు వారుణి అంది. అలాగే మరిద్దరు అందకత్తెలూ అతణ్ణి వరించారు. అందులో ఒకామె పేరు కాంతి.

ఇంతలో గరుడు వచ్చి కృష్ణుడికి కిరీటం ఇచ్చి వెళ్ళాడు.

## కొండకి నిప్పు

రామకృష్ణులు మధురనించి దక్షిణాదికి పారిపోయారని తెలుసుకున్నాడు జరాసంధుడు. మధుర ముట్టడికి వెళుతున్న సైన్యాలు దక్షిణాదికి మళ్ళించాడు. కొండలూ, అడవులూ గాలించి, తుదకి ప్రస్రవణ పర్వతంమీద రామకృష్ణులున్నట్టు కనిపెట్టాడు. రాజులతోనూ, రాణువతోనూ, ప్రస్రవణం ముట్టడించాడు. "కొండ కొండంతా నేలమట్టం చేయండి" అంటూ హుకుం వేశాడు.

గుదియలూ, గునపాలూ, గడ్డపారలూ, గండ్రగొడ్డళ్ళూ పట్టుకుని సైనికులు కొండమీద పడ్డారు, మిడతలదండులాగ. రాళ్లు తవ్వారు. పణుకులు పెల్లగించారు. మాళ్లు నరికారు. సెలయేళ్లు కప్పారు.

సాధ్యపడలేదు కొండ. చదరమయినా సదును కాలేదు కొండ. మీదికెగబడ్డారు రాజులు. ముళ్ళలో రాళ్ళలో ముందుకి సాగలేకపోయారు. చిటారు సిఖరం మీదున్నారు రామకృష్ణులు. తెలుపు నలుపు మేఘాల్లా అవుపిస్తున్నారు. యుద్ధానికీ సిద్ధంగానే వున్నారు వారు.

"మహారాజా!" అదంతా చూసి జరాసంధుడితో అన్నాడు శిశుపాలుడు. "ఈ కొండ ఎక్కడమే మనకి చేత కాకండా వుంది. ఎక్కితేకదా, వాళ్ళతో యుద్ధం. ఇంతకీ నేల మీద ఎంత యుద్ధమైనా చేస్తాం. పదివేల బలరామ కృష్ణుల్ని పాతిపెట్టేస్తాం. కాని కొండ యుద్ధం తెలిసినవాడు మన దండులో ఒక్కడూ లేడు. ఈ రామకృష్ణులా సామాన్యులుకారు. దీంతో పద్దెనిమిది సార్లు మనల్ని మూడు చెరువుల నీళ్ళు తాగిస్తున్నారు. కనక నేనో మంచి ఉపాయం చెపుతాను. దీంతో వీళ్ళ శని విరగడైపోతుంది.

ఈ కొండచుట్టూ కర్రా, కంపా, గడ్డీ, గాదా, కప్పెట్టి నిప్పు పెట్టేద్దాం. చెట్టు చేమలతో మండిపోతుంది కొండ. రామకృష్ణులు కాలిపోతారు. చచ్చి వూరుకుంటారు."

బాగుందంటే బాగుందన్నారు కడపరాజులు.

"అయితే అగ్గి పెట్టండి" అని అరిచాడు జరాసంధుడు. సింహనాదాలు చేశారు సైనికులు. ఎండు కట్టెలూ, ఎండు గడ్డి కప్పి, కొండకి నిప్పుముట్టించారు.

చుట్టూ పొగలతో మంటలు కక్కింది కొండ. పెద్ద పెద్ద చెట్లు భగభగా మండిపోయాయి. రాళ్ళు పగిలి

పోయాయి. మృగాలూ, పక్షులూ పారిపోయాయి. పెద్దపెద్ద పాములు తగలబడిపోయాయి. పొగలు ఆకాశం ఆవరించాయి. చుట్టుపట్ల అడవులూ, కొండలూ పొగలో అవుపడకండా పోయాయి. జరాసంధుడి దండు అరకోసు వెనక్కిపోయింది. వేడి తట్టుకోలేకపోయింది.

ఈ గందికలో కొండశిఖరం దూకేసి తప్పుకుపోయారు రామకృష్ణులు.

అన్నదమ్ములిద్దరూ అగ్గిలో బుగ్గయిపోయారను కున్నాడు జరాసంధుడు. నిశ్చింతగా మగధ మళ్ళిపోయాడు. రాజులందరు తమ తమ సేనలు తర్లించుకుపోయారు.

కాని, బలరామకృష్ణుల మేనత్త మగడూ, శిశుపాలుడి తండ్రీ, ఛేదిదేశం రాజూ అయిన దమఘోషుడు ఎలాగో రామకృష్ణుల్ని కలుసుకున్నాడు. తన చుట్టరికం చెప్పి వారితో నమ్మకంగా మాట్లాడాడు.

"మీరంటే ఇష్టం నాకు. జరాసంధుడు. లాక్కు వచ్చినా, మీతో యుద్ధం వద్దని చెవిలో గూడుకట్టుకుని చెప్పాను. కాని వినుకోలేదు మూర్ఖుడు. ఇప్పటికి వెళ్ళి పోయినా, పగ ఒదలడు. తెలిసిందంటే మళ్ళీ విరుచుకుపడ తాడు. ఇక్కడ వుండకూడదు మీరు. వాడు ముట్టడించలేని చోట గట్టి పట్టణం కట్టుకోవాలి ముందు ముందు.

ఇక్కడికి కొంతదూరంలో కరవీరపురముంది. వెనక పద్మవర్ణుడు కట్టిన పట్టణమది. దాన్ని ఇప్పుడు సృగాలవాసు

దేవుడు పరిపాలిస్తున్నాడు. జరాసంధుడి సామంతుడతడు. ఎగిరి పరిగెత్తే రథముందని మిడిసిపడుతుంటాడు. మనమొక సారి కరవీరపురం వెళదాం. అతణ్ణి చూద్దాం, తరవాత మీరు మధుర వెళుదురుగాని. కొత్త రాజధాని కోసం ప్రయత్నం చేద్దురుగాని, నా వెంట నా సైన్యముంది. మీ కోసం మంచి రథమూ వుంది" అన్నాడు.

"సరే" అన్నారు రామకృష్ణులు. దమఘోషుడితో రథ మెక్కారు. దమఘోషుడి సేనతో కూడా మూడురాత్రిళ్లు ప్రయాణంచేసి, కరవీరపురం చేరారు.

## సృగాల వాసుదేవుడు

బలమరాకృష్ణులు తనమీదికే ఎత్తివచ్చారని అను కున్నాడు సృగాల వాసుదేవుడు. తన ఎగిరే రథమెక్కి పెద్ద రాణువతో వచ్చి ఎదిరించాడు. కృష్ణుణ్ణి ద్వంద్వయుద్ధానికి కవ్వించాడు.

"సైన్యంతో పనిలేదు. మన ఇద్దరం సరాసరి యుద్ధం చేద్దాం. ఇద్దరు వాసుదేవులు వుండడానికి వీల్లేదు. నువ్వో నేనో తేలిపోవాలి" అంటూ కలబడ్డాడు. వాడి వాడి బాణాలు కుమ్మరించాడు. నవ్వుతూ చూశాడు కృష్ణుడు. సుదర్శనం తీశాడు. గురిచూసి వేశాడు.

మెరుపులా వెళ్ళింది సుదర్శనం. నరికి పారేసింది సృగాలుణ్ణి. రథం మీంచి క్రింద పడిపోయింది అతడి కళే బరం. కకావికలైపోయింది కరవీరసైన్యం.

కోటకి కబురందింది. సృగాలుడి అంతఃపుర స్త్రీలు గుండెలు బాదుకుంటూ వచ్చారు. మగడిమీదపడి గోలు గోలు మన్నారు.

సృగాలుడి కొడుకుని తీసుకుని కృష్ణుడి దగ్గిరికి వచ్చింది అతడి రాణి పద్మావతి. కుమారుణ్ణి కనికరించమని కాళ్ళా వేళ్ళా పడింది.

ఆమె కొడుకుని తండ్రి సింహాసనంమీద కూచో పెట్టాడు కృష్ణుడు. కరవీరపురానికి రాజు చేశాడు. రాణులకి ధైర్యం చెప్పాడు. పౌరుల్ని వోదార్చాడు. తరువాత మధురకి బయలుదేరారు రామకృష్ణులు. అయిదురాత్రిళ్ళు, అయిదు పగళ్ళు పయనంచేసి మధుర చేరుకున్నారు. తల్లీదండ్రుల్నీ బంధువుల్నీ, ప్రజల్నీ సంతోషపరిచారు.

## కుండిన పయనం

విదర్భదేశం రాజధాని కుండిన నగరం. భోజవంశం భీష్మకుడు దానికి రాజు.

దక్షిణాపథంలో మంచి బలవంతుడైన రాజు అతడు. రుక్మీ, రుక్మరథుడూ, రుక్మబాహుడూ, రుక్మకేశుడూ, రుక్మమాలీ అని అయిదుగురు కొడుకులూ, రుక్మిణి అని ఒక కూతురూ వుండేవారతడికి.

రుక్మి మంచి వీరుడు. అయితే అతడు జరాసంధుడి మనిషి, కృష్ణుడంటే పడేదికాదు.

రుక్మిణి అపురూపమైన అందకత్తె. ఆనోటా, ఈనోటా

కృష్ణుడి అందచందాలు విని అతడిని పెళ్ళి చేసుకోవాలను కుంటూ వుండేదామె. అలాగే కృష్ణుడూ ఆమెని చేసు కోవాలనుకుంటూ వుండేవాడు.

ఇలా వుండగా భీష్మకుడు కూతురి పెళ్ళి తలపెట్టాడు. దేశదేశాల రాజులు స్వయంవరానికి తర్లి వచ్చారు.

జరాసంధుడు, శిశుపాలుడు, దంతవక్త్రుడు, సాల్వుడు మొదలైన రాజులు తమతమ సేనలతో దూరాదూరాలనించి వచ్చారు.

అదంతా విన్నాడు కృష్ణుడు. తానూ కుండిన బయలు దేరాడు.

కృష్ణుడు వచ్చాడనగానే స్వయంవరానికి వచ్చిన రాజుల్లో కలకలం బయలుదేరింది. వారిలో హెచ్చుమంది జరాసంధుడి పక్షంవారు.

"కృష్ణుడు వచ్చాడంటే మనందరినీ కన్నుగప్పి రుక్మిణిని ఎత్తుకు పోతాడు. ఇది మనం సహించకూడదు." అంటూ మంతనాలు సాగించారు. రుక్మి కారాలూ, మిరి యాలూ నూరాడు.

"అవును, వీడు అసాధ్యుడు. నేను ఎన్నిమార్లు దండెత్తినా తప్పించుకుంటూ నేవున్నాడు." అన్నాడు జరా సంధుడు.

"నిజమే నువ్వన్నది." అంటూ అందుకున్నాడు దమ ఘోషుడు, "స్వయంవరంలో ఎవరిని రుక్మిణి వరిస్తుందో తెలియదు. ఎవరిని వరించబోయినా కృష్ణుడు వూరుకోడు,

ఎత్తుకుపోడానికే ప్రయత్నిస్తాడు. యుద్ధం తప్పదు. అందుకు సిద్ధపడే వచ్చాడు. కుండిన రణగుండమవుతుంది. స్వయం వరానికి ఆపద ఇది. ఆలోచిస్తే స్వయంవరం ఆపడమే మంచిది. ఉన్నమాట చెప్పాలంటే బలరామకృష్ణుల్ని పార దోలగల బలవంతులు నాకు కనపడలేదు."

"దమఘోషుడు సరిగానే చెప్పాడు." అంటూ ఎత్తు కున్నాడు కరూషం రాజు దంతవక్త్రుకు, "ఇంతకీ మనమెలా, వచ్చామో కన్యకోసం, కృష్ణుడూ అలాగే వచ్చాడు. ఇందులో వింతేముంది? దీనికి భయపడవలిసిందికాని, పగపట్ట వలసిందికాని ఏమీ లేదు, అందరిలాగే అతడినీ గౌరవిద్దాం, మంచిగా వుందాం" అన్నాడు.

"ఏమిటీ మాటలు!" అన్నాడు సాల్వుడు, "తనని చులకన చేసుకోడం, ఎదటివాణ్ణి మీదికెత్తడం రాజయిన వాడికి తగనిపని. మేమూ ఎరుగుదుం కృష్ణుణ్ణి. భయం మనకి కూడదు. భయపడినంత మాత్రాన ఎవడూ వుట్టిగట్టుకు వుండిపోడు. ఇంతకీ కృష్ణుడు యుద్ధానికి రాలేదు. స్వయం వరానికి వచ్చాడు. ఎవరినో ఒకర్ని వరిస్తుంది రుక్మిణి. కాదంటే కృష్ణుణ్ణే వరిస్తుంది. వరించనీ చూద్దాం. ముందే ఈ రభస ఎందుకూ?"

రుక్మిణి కృష్ణుణ్ణి వరిస్తుందంటే రుసరుసలాడాడు రుక్మి.

అదంతా చూశాడు భీష్మకుడు. తనలో తాను ఆలో చించాడు. స్వయంవరం నిలుపు చేయడమే మంచిదను కున్నాడు. 'తరవాత సావకాశంగా వచ్చిన వరుడికి కన్యా దానం చేస్తాను. ఇప్పటికి ఈ ఆపద గట్టెక్కుతుంది.' అని

నిశ్చయించుకున్నాడు. కృష్ణుడి విడిదికి వెళ్ళాడు. అతడికి అన్ని మర్యాదలూ జరిపించాడు. నెమ్మదిగా ఇలా ఎత్తుకున్నాడు:

"కృష్ణా! నా మట్టుకు నాకు స్వయంవర వివాహాలు నచ్చవు. ఏమంటే, వీధిగుమ్మం ఎరగని కన్యలు ఏ రాజు ఎలాంటివాడో ఎలా తెలుసుకుంటారు? అంచేత ఈ స్వయం వరం నేను తలపెట్టలేదు. మా రుక్మి ప్రయత్నమిది. ఉత్తి మూర్ఖుడు వాడు. తనకి ఎంత తోస్తే అంత. నే నిప్పుడు ఈ స్వయంవరం నిలుపుచేశాను. నాకు నచ్చిన వరుణ్ణి చూసి అమ్మాయిని కన్యాదానం చేస్తాను సావకాశంగా. రాజు లందరితోపాటు నువ్వూ మన్నించు." అన్నాడు.

"సరే, అన్నీ తెలిసిన మహారాజువి నువ్వు. అలాగే కానీ" అన్నాడు కృష్ణుడు. మధురాపురానికి మళ్ళిపోయాడు. కొంతదూరం అతడిని సాగనంపి వచ్చేశాడు భీష్మకుడు.

## కుట్ర

భీష్మకుడి నిశ్చయం విన్నారు రాజులు. జరాసంధుడి అడుగుజాడల్లో నడిచేవారంతా ఒక దగ్గిర సమావేశ మయారు. "మన కలలన్నీ గాలి కెగిరిపోయాయి" అంటూ చేతులు పిసుక్కున్నారు. "ఎలా అయినా ఈ కృష్ణుడి పని పట్టించాలి" అంటూ పళ్ళు కొరికారు.

"దీనికి ఒక్కటే ఉపాయముంది" అంటూ అందు కున్నాడు సాల్వుడు. "కృష్ణుణ్ణి చంపడానికి కాలయవనుడు ఒక్కడే సమర్థుడు. మధురవాళ్ళ నందరినీ మసిచేస్తా డతడు

"గార్గ్య పురోహితుడి కొడుకు కాలయవనుడు. కట్టు కున్న ఇల్లాలుండినా బ్రహ్మచారిగా గడిపేవాడు గార్గ్యుడు. అంచేత సంతానం కలగలేదతడికి. దానికి విచారపడుతూ అతడి బావమరిది ఓనాడు అతణ్ణి "నపుంసకుడివి" అని హేళన చేశాడు యాదవ సభలో. విరగబడి నవ్వారు యాదవులు. తల కొట్టేసినట్టయింది గార్గ్యుడికి. కళ్ళు మొయ్యా కోపమూ వచ్చింది. అడివికి వెళ్ళిపోయాడు. మధుర యాదవుల్ని మాడ్చెయ్యగల కొడుకు కలగాలని, లోహభస్మం తింటూ, పన్నెండేళ్లు తపస్సుచేసి, వరం పొందాడు.

అది తెలిసి యవనదేశంరాజు అతణ్ణి ఒక ఆల మందలో వుంచి, మంచి వయసులోవున్న గొల్ల పడుచుల్ని అతడికి అప్పగించాడు. కమలపాలిక అని ఒక అప్సరస గొల్లపడుచుగా వచ్చి గార్గ్యుణ్ణి వలపించింది. ఆమెతో కలిశాడు గార్గ్యుడు.

కుమారుణ్ణి కంది కమలపాలిక. బాలుణ్ణి కొడుకుగా పెంచాడు యవనరాజు. అదిగో ఆ బాలుడే కాలయవనుడు. యవనరాజు కాలం చేశాక, కాలయవనుడే రాజయ్యాడు. మధురవాళ్ళని మసి చేయగల బలవంతుడు. కృష్ణుడు మధురలో పుట్టినవాడు కనక అతణ్ణి మట్టిలో కలిపేస్తాడు. అందుకని అతణ్ణే ఆశ్రయించాలి మనం. జరాసంధుడు అతణ్ణి కోరుతూ దూతని పంపాలి." అన్నాడు.

"నా మట్టుకు నేను యుద్ధం చేయడమే కాని ఒకణ్ణి ఆశ్రయించడం నాకు తెలియదు. అయినా మీా అందరికీ ఇష్టమయితే సాల్వుణ్ణే దూతగా పంపండి" అని చెప్పి మగధ

వెళిపోయాడు జరాసంధుడు. సాల్వుణ్ణి దూతగా కాల యవనుడి దగ్గిరికి పంపి తక్కిన రాజులు తమ తమ దేశాలకు దారితీశారు.

కృష్ణుడు వచ్చి వెళ్ళిపోయాడని వింది రుక్మిణి. ఎంతో విచారపడింది. రాజుల కుట్రా వింది. 'ఏమైనా కానీ, కృష్ణుణ్ణి తప్ప మరొకర్ని పెళ్ళాడను' అని నిశ్చయం చేసుకుంది. పగలూ, రాత్రీ కృష్ణుణ్నే తలుచుకుంటూ వచ్చింది.

## కాలయవనుడు

ఇనపకొండలాంటివాడు కాలయవనుడు. ధనబలం తోనూ, జనబలంతోనూ, యవనదేశం ఏలుతూ వుండేవా డతడు.

కాలయవనుడు నిండు కొలువులో వుండగా ఆకాశ రథంమీద సాల్వుడు దిగాడు. మంత్రులతో ఎదురు వెళ్ళాడు కాలయవనుడు. సగౌరవంగా తీసుకువచ్చాడు. కుశలప్రశ్న లయాక సాల్వుడు ఇలా అందుకున్నాడు :

"జరాసంధుడు నీ సహాయంకోరి, నన్ను దూతగా పంపాడు. రాజులందరికీ ఒక ఆపద వచ్చిపడింది. అది నీ వల్లకాని గట్టెక్కదు. యాదవులలో కృష్ణుడు బలవంతుడయి మిడిసిపడుతున్నాడు. కంసుడిని చంపేశాడు. అల్లుడిని చంపా డన్న కోపంతో జరాసంధుడు పద్దెనిమిది సార్లు మధుర ముట్టడించినా కృష్ణుడిని చంపలేకపోయాడు. రాజులందరికీ పక్కలో బల్లెంలా తయారయాడు వాడు.

ఇలా వుండగా భీష్మకుడు తన కూతుర్ని స్వయం వరంలో పెళ్ళి చేయాలనుకున్నాడు. పానకంలో పుడకలాగ అక్కడా తయారయ్యాడు కృష్ణుడు. భీష్మకుడు భయపడి పోయాడు. స్వయంవరం మానుకున్నాడు. రాజులందరికీ తల కొట్టేసినట్టయింది. కృష్ణుడిని చంపితేగాని శాంతి లేదు. రుక్మిణికి పెళ్ళి కాదు. అందుకని జరాసంధుడూ, యావన్మంది రాజులూ నీ సహాయం కోరుతున్నారు. మధుర యాదవులు నిన్ను గెలవలేరు. నీ ముందు నులనుల మాడిపోతారు. నేనే బలవంతుడినని జబ్బలు చరుస్తున్నాడు కృష్ణుడు. అదేదో తేలిపోతుందిప్పుడు" అంటూ ఎన్నో చెప్పి కాలయవనుడిని పురెక్కించాడు.

"నాకంటే బలవంతుడా కృష్ణుడు ?" కళ్ళెర్ర చేస్తూ లేచాడు కాలయవనుడు, "నాతో పోట్లాడేవాడు ఎవడైనా దొరుకుతాడా అనే ఎదురుచూస్తున్నాన్నేను, ఇన్నాళ్ళూ.

జరాసంధుడంతటి మహారాజు నన్ను కోరడమూ, రాజులందరూ నన్ను అర్థించడమూ, నువ్వు దూతగా రావడమూ — ఇంతకంటే నాకు గొప్పేముంది ? నా బతుకు సార్థకమయింది, ధన్యుడిని. ఇవాళే మధుర మీదికి తర్లి వెళతాను. కృష్ణుడు మరి లేడే అనుకోమని జరాసంధుడితో చెప్పు." అంటూ రాజ మర్యాదలతో సాల్వుడిని సాగనంపాడు. మధురమీదికి దండయాత్ర చాటించాడు.

రథాలూ, ఏనుగులూ, గుర్రాలూ, గాడిదలూ,

ఒంటెలూ, కాలిబంట్లూ - ఆకాశమంత దండుతో బయలు దేరాడు కాలయవనుడు. శకులూ, తుషారులూ, దరదులూ, పారదులూ మొదలైన రాజులు ఎంతోమంది అతడివెంట వచ్చారు.

అలా హుటాహుటిని వచ్చి మధుర ముట్టడించాడు కాలయవనుడు.

చూశాడు కృష్ణుడు ఉగ్రసేనుడూ మొదలైన యాదవ ప్రముఖుల్ని సమావేశపరిచాడు. ఏం చెయ్యాలో ఆలోచించాడు.

"జరాసంధుడి దండయాత్రలతో బాగా అలిసిపోయారు మీరు. అయినా యాదవులు అసాధ్యులు అనిపించుకున్నారు. ఇప్పుడు కాలయవనుడు పగపట్టి వచ్చాడు. మనం వీణ్ణి యుద్ధంలో గెలవలేం. వీడితో చేయిచేసుకుంటే వినాశం తప్పదు. పగవాడు బలవంతుడయినప్పుడు ఉపాయంతో అపాయం తప్పించుకోవాలి. పలాయనమే పరమోపాయం.

ఇటు కాలయవనుడి దాడి విని అటు జరాసంధుడూ వచ్చి పడవచ్చు. అప్పుడు మన పని మరింత కష్టమవుతుంది. నేను పన్నవలిసిన ఉపాయం పన్నుతాను. మీరేమీ భయపడకండి.

ఇంతకీ ఈ మధురాపురం క్షేమంకాదు మనకి. పగవాడు తేరిచూడలేని మంచి దిట్టమైన పట్టణం కట్టుకోవాలి. మధుర విడిచిపెట్టాలి తప్పదు. అందుకు మీరు సిద్ధంగా వుండాలి" అన్నాడు.

"నువ్వేం చెపితే అదే చేస్తాం. నీతోనే వుంటాం. నువ్వే మాకు నాయకుడివి." అన్నారు యాదవులు.

ముందుగా ఒక నల్లతాచు తెప్పించి, పెట్టెలో పెట్టి కాలయవనుడికి పంపాడు కృష్ణుడు.

"కృష్ణుడంటే నల్లతాచు సుమా!" అని దీని అర్థం. ఇది తెలుసుకుని కాలయవనుడు వెళ్ళిపోవచ్చునని కృష్ణుడి అభిప్రాయం.

కనిపెట్టేశాడు కాలయవనుడు. నల్లతాచు పెట్టెలో చలిచీమలు పెట్టి తిప్పి పంపాడు.

"బలవంతమైన సర్పం చలిచీమలచేత చస్తుంది" అని దాని భావం.

శత్రువు బెదిరింపులకి లొంగడనుకున్నాడు కృష్ణుడు. అన్న బలరాముడితో "పట్నం జాగ్రత్త. యవనసేన లోపలికి చొరబడనివ్వకు." అంటూ ఏ ఆయుధమూ పట్టుకోకండా పట్నం బయటికి వచ్చేశాడు. కాలయవనుడి కళ్ళ ఎదటినుంచే పరిగెత్తి పారిపోయాడు.

చూశాడు కాలయవనుడు. "ఎవడు వీడు? నల్లగా నిగనిగలాడుతున్నాడు. మోకాళ్ళకి అందుతున్నాయి చేతులు. పసుప్పచ్చటి పట్టుబట్టలు కట్టుకున్నాడు. ఇలాగే వుంటాడని విన్నాను కృష్ణుడు. వాడే అయుంటాడు. పారిపోతున్నాడేం నల్లతాచు? భయపడిపోయాడు. పారిపోతే వొదిలేస్తానా? అయితే ఆయుధ మేదీ చేతిలో లేదు. ఆయుధం లేనివాణ్ణి ఆయుధంతో కొట్టకూడదు." అంటూ

ఆయుధాలు పడేసి, వృత్తి చేతులతో వెంట తరిమాడు కృష్ణుణ్ణి.

పగవాడు వెంట తరమడంతో పరుగు నడి హెచ్చించాడు కృష్ణుడు. దొరికిపోయినట్టే నటించి తుర్రుమనేవాడు. కనపడినట్టే కనపడి, కనపడకుండాపోయేవాడు. అలిసిపోయినట్టే ఆగిపోయేవాడు. అంతలోనే గాలిలా ఎగిరిపోయేవాడు.

వదల్లేదు కాలయవనుడు. దొరకని కృష్ణుడికోసం దొంగని తరిమినట్టు తరిమాడు. రొజుకుంటూ తరిమాడు. రోషంతో తరిమాడు. ముప్పతిప్పలు పెట్టాడు కృష్ణుడు. తుప్పలు దాటాడు. తోపులు దాటాడు. అడవులు దాటాడు. ఏళ్ళు దాటాడు. ఎంతో దూరం పారిపోయాడు. వెళ్ళి వెళ్ళి ఒక కొండగుహలో దూరిపోయాడు. కాలయవనుడూ దూరాడు.

చీకటిగా వుంది గుహ. ఎంత దూరముందో అది! చీకటిలో చీకటి. నలుపులో నలుపు. కృష్ణుడు కనపడలేదు.

కడముట్ట గాలించాడు కాలయవనుడు. ఒక పొడవాటి మనిషి నిద్రపోతూ కనిపించాడు.

"దొంగా దొరికావు. నిద్దరలా నటిస్తున్నావు" అంటూ ఒక్క తాపు తన్నాడు కాలయవనుడు.

నిద్రపోతున్న మనిషి కళ్ళు విప్పాడు. ఎర్రగా చూశాడు. కాలిపోయాడు కాలయవనుడు. బూడిదయి కూలిపోయాడు.

# ముచికుందుడు

అంతవరకూ అవుపడకండా వున్న కృష్ణుడు నిద్ర లేచిన మనిషి ఎదటికి వచ్చాడు.

"ఎవరు నాయనా నువ్వు ?" అడిగాడు నిద్రలేచిన పొడవు మనిషి. "ఇంత గొప్పగా అవుపిస్తున్నావు! నన్ను ముచికుందు డంటారు. ఎంతో కాలంనించి నిద్రపోతున్నాను. నన్ను నిద్రలేపినవారు నా చూపుతో మండిపోవాలని కోరుకున్నాను. అలాగే మండిపోయా డిపు డెవరో నా నిద్రలేపి. ఎవరతడు ?"

తన వృత్తాంతమూ, కాలయవనుడి కథా చెప్పాడు కృష్ణుడు.

"అవును, ఇది ఇలాగే జరుగుతుందని వెనక పృథు చక్రవర్తి ఆస్థానంలో వుండిన జ్యోతిష్కుడు వృద్ధగర్గుడు చెప్పాడు. నువ్వు కారణజన్ముడివి. తనంతవాడు లేడనుకున్నాడు కాలయవనుడు. కాలి బూడిద అయిపోయాడు. మనిషికి మిడిసిపాటే చావు. పదవి శాశ్వతం కాదు. బతుకూ శాశ్వతం కాదు. పుట్టిన ప్రాణి గిట్టక తప్పదు.

కామం, క్రోధం మొదలైనవాటికి లొంగిపోయిన వాడికి శాంతి వుండదు. పదవి వున్నప్పుడు, ధనము వున్నప్పుడు, మాట చెల్లుతున్నప్పుడు కళ్ళు కనపడవు. చావుతో అన్నీ చల్లారిపోతాయి. కృష్ణా! అదిగో అదే జరిగింది కాలయవనుడికి. రేపు జరాసంధుడికీ అదే జరుగుతుంది. లోకంలో మంచీ, చెడ్డా రెండే మిగులుతాయి. నేను ఆ కాలం

మనిషిని. అప్పటికీ ఇప్పటికీ కాలం ఎంతో మారింది. అన్నీ కురచపడ్డాయి.

ఇక నేను తనువు చాలిస్తాను. కడపదినాలు బదరికాశ్రమంలో గడుపుతాను" అంటూ కృష్ణుడితో చెప్పి, కొండ గుహనుంచి బదరికాశ్రమం వెళ్ళిపోయాడు ముచికుందుడు. అక్కడ మునిలాగ కాలంగడిపి కాలంచేశాడు.

కృష్ణుడు తిరిగివచ్చి, పట్నం చుట్టివేసిన కాలయవనుడి సైన్యాలు కడముట్టించాడు. వారి ఆయుధాలూ, వాహనాలూ, సొమ్ములూ- అన్నీ ఉగ్రసేనుడికి సమర్పించాడు. యాదవుల ఆనందానికి అంతుపంతూ లేకండా పోయింది. ఇంటింటా కృష్ణుణ్ణే ఆరాధించారు.

## ద్వారకా నగరం

"మధురమీద మాటిమాటికి దండయాత్రలు జరుగుతూనే వున్నాయి. జరాసంధుడు మళ్ళీ దండెత్తి రావచ్చు. ఇక్కడవుంటే దినదిన గండం తప్పదు. మనం దూరంగా పారిపోవాలి. పగవాడు తేరి చూడలేని పట్నం కట్టుకోవాలి." అంటూ ఆలోచించారు బలరామకృష్ణులు.

పడమట రైవతక పర్వతం దగ్గిర కుశస్థలి అని ఒక పట్టణముండేది. వెనక రాముడి కొడుకు కుశుడు కట్టిన పట్టణమది. ఎంతో అందమైన పట్టణం. అన్ని వసతులూ వున్నాయక్కడ. మధురనించి కుశస్థలం లేచిపోడానికి నిశ్చయించారు రామకృష్ణులు. మధుర సంపద జ్ఞాతులకి సమంగా పంచిపెట్టి, అందరినీ కొత్తచోటికి తర్లించారు.

కుశస్థలం మహాపట్నంగా తయారుచేయించాడు కృష్ణుడు. నలభైఎనిమిది చదరపుకోసుల పట్టణమది. పట్టణమంతా ఒక మహాదుర్గం. చుట్టూ సముద్రమే అగడ్త. పట్నానికి ఎనిమిదిమూలలు. పన్నెండుకోసుల రైవతపర్వతం పెట్టని కోట. ప్రతి నాలుగుకోసులకీ మూడేసి సేనాశిబిరాలు; నూరేసి ద్వారాలు. ప్రతిద్వారమూ దిట్టమైన దండుతో పగవాడు తేరి చూడడానికి వీలుండదు.

నగరం అపురూపంగా తయారయింది. రాజనగళ్ళూ, రాజవీధులూ, ఉపవనాలూ, మేడలూ, మిద్దెలూ, గుళ్ళూ, గోపురాలూ, కోనేళ్ళూ, నడబావులూ— ఒకటేమిటి, అన్నిటితోనూ అన్నివిధాలా నిండుగావుంది నగరం. నగరం నడుమ యాదవవీరుల రాజమందిరాలు కన్నుల పండువుగా తయారయాయి. ప్రతివీధి కూడలిదగ్గిరా అంగళ్ళు కట్టారు. నాలుగు వేపులా ద్వారాలు పెట్టారు. తోరణాలు కట్టారు. శిల్పులు తమ నేర్పరితనమంతా వినియోగించారు. పట్టణంచుట్టూ మేఘాలంత ఎత్తు గట్టి ప్రాకారం కట్టారు. ఆవుల సాలలూ, ఆయుధాల సాలలూ, ఏనుగుల సాలలూ, రథాల సాలలూ వేలువేలు తయారుచేశారు. పెద్దపెద్ద కోశాగారాలు తయారుచేశారు. రాజభవనమూ, బలరామకృష్ణుల భవనాలు చెప్పతరంకానంత గొప్పగా తయారయాయి. ఎటుచూసినా ద్వారాలే కనిపించాయి. అందుకని కుశస్థలం పేరుపోయి ద్వారక అనీ ద్వారవతి అనీ పేరు వచ్చింది.

కోటలో తగినచోట యాదవ ప్రముఖుల సభా

భవనం తయారయింది. ఎంతో అంత గొప్పగా వుందది. దాని పేరు సుధర్మ.

మధుర యాదవులందరినీ ద్వారకకి తర్లించుకు వచ్చాడు కృష్ణుడు. ఎవరికి తగిన భవనాలు వారికిచ్చాడు. నిత్యకల్యాణం పచ్చతోరణంగా కలకలలాడింది ద్వారకా నగరం.

ద్వారకకీ ఉగ్రసేనుడ్నే రాజుచేశాడు కృష్ణుడు. సాందీపుడ్ని పురోహితుడిగా నియమించాడు. అనాధృష్టుడ్ని సేనానాయకుడిగా చేశాడు. వికద్రుడ్ని ప్రధానమంత్రిగా ఏర్పరిచాడు. సాత్యకిని వీరులమీద పెద్దగా పెట్టాడు. తనతో ఉద్ధవుడూ, కంకుడూ, విప్రుధుడూ, శ్వఫల్కుడూ, చిత్రకుడూ, గదుడూ, బలరాముడూ, సత్యకుడూ, ప్రుథుడూ రహస్యమంత్రులుగా ఏర్పడ్డారు.

అదంతా అయాక రైవతుడి కూతుర్ని రేవతిని పెళ్ళి చేసుకున్నాడు బలరాముడు.

## రుక్మిణి పెళ్ళి

కొన్నాళ్ళయాక కూతురు రుక్మిణికి పెళ్ళి తలపెట్టాడు భీష్మకుడు. ఆమెని శిశుపాలుడికిచ్చి పెళ్ళి చెయ్యమన్నాడు జరాసంధుడు. శిశుపాలుడ్ని కన్నకొడుకులా చూసేవాడు జరాసంధుడు. అతడిని తన సేనాధిపతిగానూ చేసుకున్నాడు. అందుకని రుక్మిణిని అతడికి ఇమ్మన్నాడు. రుక్మికూడా అదే చెప్పాడు. పౌండ్రక వాసుదేవుడూ, జరాసంధుడి సామంతు లయిన అంగ, వంగ, కళింగదేశాలరాజులూ జరాసంధుడ్ని

సమర్థించారు. సరే, అన్నాడు భీష్మకుడు. రుక్మిణికి శిశుపాలుడితో పెళ్ళి నిశ్చయమయింది. రుక్మి, అతడి తమ్ములు రుక్మరథుడూ, రుక్మబాహుడూ, రుక్మకేతుడూ, రుక్మమాలీ పెళ్ళిపనులు చురుకుగా సాగిస్తూ వచ్చారు.

పెళ్ళి దగ్గిరపడుతూ వుంది. మరి మూడురోజులే వుంది. దిగులు పెట్టుకుంది రుక్మిణి. మనసార కృష్ణుణ్ణే మగడుగా వరించిందామె. అన్నదమ్ముడు రుక్మి అహంకారి. కృష్ణుడంటే కిట్టదతడికి. తండ్రి భీష్మకుడు కొడుకుని కాదన లేడు. పైగా జరాసంధుడంటే జంకు. ఏందారి? ఆలోచించిం దామె. తనకి నమ్మకమైన ఒక బ్రాహ్మడ్ని ద్వారక పంపింది. తన అవస్థ విన్నవించమంది. "ఎలా అయినా వచ్చి తనను తీసుకువెళ్ళమంది. అలా కాకపోతే ప్రాణం వొదిలేస్తాను. పెళ్ళికి ముందు పూజకని బయటికి వస్తాను. అదిగో అప్పుడు నన్ను పట్టుకుపోవాలి. అంతవరకు సేనతో వచ్చి పొంచి వుండాలి. రాజుల ఆచారమే రాక్షస వివాహం" అంటూ కబురు పెట్టింది కృష్ణుడికి.

శీఘ్రంగా వెళ్ళాడు బ్రాహ్మడు. ద్వారకలో కృష్ణుణ్ణి కలుసుకున్నాడు. రహస్యంగా రుక్మిణి కబురందించాడు.

ఇదిగో ఇలాంటి కబురుకోసమే ఎదురుచూస్తున్నాడు కృష్ణుడు. బ్రాహ్మణ్ణి ఆప్తుణ్ణి గౌరవించినట్టు గౌరవించాడు. వెంటనే దారుకుణ్ణి రథం సిద్ధం చేయమన్నాడు.

సుగ్రీవం, మేఘపుష్పం, శైబ్యం, వలాహకం అని

నాలుగు గుఱ్ఱాలూ పూసి రథం పట్టుకు వచ్చాడు సారథి దారుకుడు. రథమెక్కి, బ్రాహ్మణ్ణీ ఎక్కించుకున్నాడు కృష్ణుడు. గాలిని వెంట తరిమినట్టు కుండినవేపు పరిగెత్తింది రథం.

తమ్ముడు ఒక్కడే వెళ్ళాడు, ఎందుకైనా మంచిది అంటూ సైన్యాలతో వెనక వెళ్ళాడు బలరాముడు.

కుండిననగరం గుబగుబలాడిపోతూవుంది. శిశుపాలుడు పెళ్ళికి తరలి వచ్చాడు. జరాసంధుడూ, దంతవక్త్రుడూ, విదూరథుడూ, పౌండ్రకుడూ మొదలైన మగపెళ్ళివారితో విడుదులు కోలాహలంగా వున్నాయి. వారి సేనల గందిక చెప్పనే అక్కరలేదు.

"పెళ్ళి సమయం దగ్గిరపడుతూవుంది. రుక్మిణి ప్రాణాలు ప్రాణాల్లో లేవు. ద్వారకనించి కబురు లేదు. వెళ్ళిన బ్రాహ్మడు ఏమయాడో ?!

ఇదే చింతతో కూచుందామె. ఇంక దేనిమీదా లేదామెకి.

ఇంతలో బ్రాహ్మడు వచ్చాడు 'శుభ కబురు' సూచించి వెళ్ళాడు. కలివిడితో కలకల్లాడింది పెళ్ళి కూతురు-రుక్మిణి.

కృష్ణుడిరాక ముందే తెలుసుకున్నాడు దమఘోషుడు. కృష్ణుడి మేనత్త సాత్వతి మగడు. ఈ చుట్టరికంవల్లే ఈ పెళ్ళికి వచ్చాడనుకుని ఎదురు వెళ్ళి కృష్ణుణ్ణి తన విడిదికి తీసుకువచ్చాడు.

రివాజు ప్రకారం పెళ్ళికి ముందు గౌరీపూజకని కోటలోంచి గుడికి వచ్చింది రుక్మిణి. పెళ్ళికూతురు ముస్తాబుతో మురిసిపోతూ వుందామె. శిశుపాలుడిదే అదృష్టం అన్నారు చూసిన రాజకుమాళ్ళు. "కృష్ణుడయితే ఈడూ జోడూ సరిపోయేది" అనుకున్నారు అమ్మలక్కలు.

మంగళవాద్యాలు మోగుతున్నాయి. పెళ్ళినడకలు నడుస్తూవుంది రుక్మిణి. పునిస్త్రీలూ, పేరంటాళ్ళూ వెంట నడుస్తున్నారు. ఆయుధాలు పట్టుకుని ఎంతోమంది సైనికులు చుట్టూ కాపలాకాస్తూ వచ్చారు.

గుడిలో పూజ పూర్తయింది. తిరిగి వస్తూ వుంది రుక్మిణి. పద్మపత్రాల్లా సుకుమారమైనవి ఆమె పాదాలు-ముందుకి పడటంలేదు. నడవలేక నడవలేక నడుస్తూవుందామె. కడకంటి చూపులు చూస్తూవుంది. బెదురు బెదురుగా వుంది.

ఇంతలో ఎక్కణ్ణుంచి వచ్చాడో కృష్ణుడు. డేగలా వాలాడు. రుక్మిణిని పొదివిపట్టుకున్నాడు. అమాంతంగా రథంమీదికి ఎత్తుకుపోయాడు. పగ్గాలు సడిలించాడు దారుకుడు. గాలిలా ఎగిరిపోయింది రథం. అంతా చిటికెలో జరిగిపోయింది.

"ఏమయింది ? - ఏమయింది ?"

"అనుకున్నంతా అయింది !"

"రుక్మిణిని కృష్ణుడెత్తుకుపోయాడు !"

కుండిననగరం కుతకుతలాడిపోయింది. జరాసంధుడూ మొదలైన రాజులు నేలతన్ని చిందులు తొక్కారు. కవ

చాలు తొడిగీ, ఆయుధాలు పట్టుకుని, రథాలెక్కి రాణువతో కృష్ణుడి వెంటపడ్డారు. పొలికేకలు వేశారు. బాణాలు రువ్వారు. ధనుస్సులు మోగించారు.

జాలిగా కృష్ణుణ్ణి చూసింది రుక్మిణి.

"భయంలేదు. చూస్తూవుండు."

ఇంతలో బలరాముడి యాదవసేన కవిసింది. రెండు సముద్రాలు గుద్దుకున్నట్టయింది. బలరాముడూ, సాత్యకీ, అక్రూరుడూ, గదుడూ, కృతవర్మా, విపృథుడూ, చక్రదేవుడూ, సుదేవుడూ, సారణుడూ, విదూరథుడూ మొదలైన యాదవ వీరులు జరాసంధుడూ మొదలైన వారిని అడుగు ముందుకి వెయ్యనీయకండా అడ్డుకున్నారు. దారుణమైన యుద్ధం జరిగిపోయింది.

జరాసంధుడూ సాత్యకీ, దంతవక్త్రుడూ అక్రూరుడూ, శిశుపాలుడూ విపృథుడూ, శిశుపాలుడి తమ్ముడు బలీ చక్రదేవుడూ, పౌండ్రక వాసుదేవుడూ కృతవర్మా దారుణంగా ద్వంద్వ యుద్ధం చేశారు.

బలరాముడు పెద్ద మాను పెరికి మగధసేన పడమోదాడు. కళింగ, కారూష, అంగ, వంగ యోధుల్ని హతమార్చాడు.

శవాలతో నెత్తురు వరదలు కట్టింది. తన్నుకు చస్తున్న గుర్రాలతోనూ, పడి మూలుగుతున్న ఏనుగులతోనూ, గుండ పిండయిన రథాలతోనూ, తలకాయలెగిరిపోయిన మొండాలతోనూ, ఏడుపు మొర్రలతోనూ పరమ భీభ

త్సంగా తయారయింది రణరంగం. అంత యుద్ధంలోనూ యాదవులదే పైచేయి అయింది.

రుక్మిణి అన్న రుక్మి గొప్పవీరుడు, ఆత్మాభిమాని. ప్రపంచంలోని మూడు గొప్ప ధనుస్సులలో అతడి దొకటి. అందుకని అతడి అహంకారానికి అంతులేదు. తన చెల్లెల్ని కృష్ణుడు ఎత్తుకుపోడం - అందునా పెళ్ళికి సిద్ధంచేసిన పిల్లని! ఓర్చుకోలేకపోయాడతడు.

"కృష్ణుణ్ణి చంపేస్తాను. రుక్మిణిని తెస్తాను. శిశుపాలుడికి పెళ్ళి చేస్తాను. కృష్ణుణ్ణి చంపందే కుండిన తిరిగిరాను" అంటూ శపథంచేసి, రథమెక్కి బయలుదేరాడతడు.

సరాసరి కృష్ణుడిమీదికే వెళ్ళాడు రుక్మి. తన విల్లు 'విజయం' మోగించాడు. శార్ఙ్గం సారించాడు కృష్ణుడు.

విజయం, శార్ఙ్గం, గాండీవం — ఈ ధనుస్సులు మూడూ మూడే లోకంలో. అయితే రుక్మికంటె మేటి విలు కాడు కృష్ణుడు. రుక్మి వేసిన బాణాలన్నీ తుక్కు తుక్కు చేసేశాడతడు. పదే పదే వింటినారి తెగేశాడు. పరిఘా, పట్టిసం, తోమరం, శూలం, శక్తీ, కత్తీ—రకరకాల ఆయుధాలు ప్రయోగించాడు రుక్మి. అన్నీ గుండపిండి చేసేశాడు కృష్ణుడు. ఆ వూపుని అతడి గుర్రాలూ కూలగొట్టాడు. సారథిని నరికేశాడు. దొరికిపోయాడు రుక్మి. నరికేయాలని కత్తి ఎత్తాడు కృష్ణుడు. చప్పున అడ్డుపడింది రుక్మిణి. బతికి పోయాడు రుక్మి.

కానైతే అతడ్ని పెడరెక్కలు విరిచి కట్టేశాడు

కృష్ణుడు. అంతతో వూరుకోలేదు. "అయ్యో బావగారూ!" అంటూ అతడి తల పెళ్ళికి క్షౌరం చేసినట్టు కత్తిరించేశాడు. మీసం, గడ్డం సగం సగం కోసి విడిచిపెట్టాడు.

చావుతప్పి కన్ను లొట్టపోయినట్టయింది రుక్మికి. మొహమెత్తలేకపోయాడు.

రుక్మి వెంటవచ్చిన దక్షిణాది రాజుల్ని, అంశుమంతుడూ, వేణుదారుడూ, శ్రుతపర్వుడూ, క్రథుడూ, కైశికుడూ మొదలైనవారిని ఓడించాడు. వారి రాణువని హతమార్చాడు.

అలా గెలుపు సాధించి రుక్మిణితో ద్వారక వచ్చేశాడు కృష్ణుడు. గెలుపుకేకలతో ఇన్నూ మన్నూ ఒక్కటి చేస్తూ వెంటవచ్చింది యాదవసేన. ద్వారకానగరం ఉల్లాసంతో ఉప్పొంగిపోయింది.

అలా రుక్మిణిని ఎత్తుకువచ్చి రాక్షస వివాహం చేసుకున్నాడు కృష్ణుడు.

రాక్షస వివాహం రాజులలో ఆనవాయితీగా వుండేది. పరాక్రమమే దానికి కన్యాశుల్కం.

ద్వారకలో ఎంతో గొప్పగా జరిగింది రుక్మిణిపెళ్ళి.

## జాంబవతి

యాదవ ప్రముఖులలో సత్రాజిత్తు ఒకడు. సూర్యుడ్ని పూజించి ఒక మణి సంపాదించాడతడు. ఎంతో కాంతివంతమయిన మణి అది. దానిపేరు శ్యమంతకం. అది వున్నచోట

దొంగల భయముండదు. పాముల భయముండదు. రోజుకి వందాఅరవై తులాల బంగారం ఇస్తుందది. అయితే నియమం లేనివారు దాన్ని ధరిస్తే ప్రాణహాని కలిగిస్తుంది.

సత్రాజిత్తు నియమవంతుడు. అందుకని అతడి ఇంట అది అన్ని సంపదలూ కల్పిస్తూవుండేది.

మణిసంగతి విని, సత్రాజిత్తుని పిలిపించాడు కృష్ణుడు. మణి ఉగ్రసేనుడికి ఇమ్మన్నాడు. ఇవ్వనని వెళ్ళిపోయాడు సత్రాజిత్తు. 'పోనీ' అని వూరుకున్నాడు కృష్ణుడు.

కొన్నాళ్ళయాక, సత్రాజిత్తు తమ్ముడు ప్రసేనజిత్తు శ్యమంతకమణి మెళ్ళో వేసుకుని అడివికి వేటకి వెళ్ళాడు. సత్రాజిత్తులాగ నియమవంతుడు కాడతడు. అందుకని అడివిలో ఆపద వచ్చిందతడికి. ఓ సింహం అతడ్ని చంపేసింది.

ఆ అడివిలోనే ఓ కొండగుహలో రుక్షులరాజు జాంబవంతుడున్నాడు. అతడు వచ్చి సింహాన్ని చంపేసి మణి పట్టుకుపోయాడు.

ఎప్పటికీ ప్రసేనజిత్తు అడివినించి తిరిగి రాకపోవడంతో సందేహించాడు సత్రాజిత్తు. "మణికోసం తమ్ముడ్ని అడివిలో కృష్ణుడే చంపేశాడు" అంటూ నిందవేశాడు.

నింద చాపుకంటే ఘోరమైంది. సహించలేకపోయాడు కృష్ణుడు. కొంతమందిని వెంట వేసుకుని, ప్రసేనజిత్తుని వెదుకుతూ అడివిలోకి వెళ్ళాడు. ప్రసేనజిత్తు శవం చూశాడు. మణి అతడి దగ్గరలేదు. కొంతమేరలో సింహాం చచ్చిపడుంది. దాని దగ్గిరా మణి లేదు. ఏమయింది?

జాంబవంతుడి అడుగులు అవుపించాయి. అడుగులు పట్టి గుహదాకా వెళ్ళాడు కృష్ణుడు.

వెంటవచ్చిన వాళ్ళని బయటే వుండండని తాను ఒక్కడే గుహలోకి వెళ్ళాడు. లోపల పెద్ద భవనం. ఓ కుర్రాడు మణితో ఆడుకుంటున్నాడు. జాంబవంతుడి కొడుకతడు. దగ్గిర కూచుని దాది ఆడిస్తూ వుంది. కొత్తమనిషిని చూసి, కేకలు వేసింది.

లోపలినుంచి దూసుకువచ్చాడు జాంబవంతుడు. కృష్ణుడిమీద కలబడ్డాడు. సిద్ధంగానే వున్నాడు దానికి కృష్ణుడు.

ఇద్దరికీ పోట్లాట మొదలయింది. కనీ వినీ ఎరగని పోట్లాట అది. ఒకరోజూ రెండురోజులూ కాదు. ఒకరాత్రీ రెండురాత్రులూ కాదు. పద్ధెనిమిది రేయింబగళ్ళు జరిగింది.

గుహ మొగని కనిపెట్టుకు కూచున్న యాదవులు పన్నెండు దినాలవరకూ చూసిచూసి ద్వారక వెళ్ళిపోయారు. కృష్ణుడు చచ్చిపోయాడే అనుకున్నారు. ద్వారకానగరం దుఃఖంలో మునిగిపోయింది. దేవకీ వసుదేవులూ, రుక్మిణీ, ఉగ్రసేనుడూ మొదలైనవారు కంటికీ మంటికీ ఏకధారగా ఏడ్చారు. యాదవకులంలో అంతా చీకటే చీకటి అల్లుకుంది.

గుహలో పద్ధెనిమిది రోజులయేసరికి అలిసిపోయాడు జాంబవంతుడు. పిగిపోయాడు, చేతులు జోడించాడు.

"మామూల్మనిషివి కావు నువ్వు. నా తప్పు మన్నించు" అంటూ వేడుకున్నాడు.

జాంబవంతుడికి ఒక కూతురుంది. ఆమె పేరు జాంబ వతి. చక్కని చుక్క. మంచి వయసులోవుంది. ఆమెని కృష్ణుడికి భార్యగా కానుక పెట్టాడు జాంబవంతుడు.

జాంబవతితో పాటు శ్యమంతకమణీ తీసుకుని ద్వారక వచ్చేశాడు కృష్ణుడు. చీకటి తరవాత పొద్దుపొడిచి నట్ట యింది ద్వారకలో.

సుధర్మ సభలో యాదవుల సమావేశం జరిగింది. ఉగ్రసేనుడు కొలువులో కూచున్నాడు. కృష్ణుడు సత్రాజిత్తుని పిలిపించాడు. జరిగిన నిజం వినిపించాడు. సత్రాజిత్తు మణి సత్రాజిత్తుకిచ్చేశాడు. అలా తనమీద పడిన నీలాప నింద తాను తీర్చుకున్నాడు.

## సత్యాబామ

సత్రాజిత్తుకి కొడుకుల్లేరు. సత్యభామ అని ఒక కూతురుమాత్ర ముండేది. ఆమె అందానికి ఆమే సాటి. అందుకని ఎంతోమంది ఆమెని పెళ్ళిచేసుకోవాలని ఉవ్విళ్ళూరుతూ వుండేవారు. శతధన్వుడూ, కృతవర్మా వంటివారు ఆమెని మాకిమ్మంటే అలాగే అంటూ వచ్చాడు. కాని ఎవరికీ మాట ఇవ్వలేదు.

శ్యమంతకమణి కోసం కృష్ణుడిమీద వూరికే నిందవేసి నందుకు ఎంతో కించపడ్డా డతడు. అంత శ్రమపడి అది తనకు తెచ్చినందుకు అతడి మనస్సు కృతజ్ఞతతో నిండి సత్య

భామని కృష్ణుడికిచ్చి, తన తప్పు సవరించుకోవాలను కున్నాడతడు.

అలాగే సత్యభామని కృష్ణుడికిచ్చి పెళ్ళిచేశాడు. కూతురితోపాటు శ్యమంతకంకూడా కృష్ణుడికిచ్చేశాడు. కాని శ్యమంతకం పుచ్చుకోలేదు కృష్ణుడు, సత్రాజిత్తుకే తిరిగి ఇచ్చేశాడు.

ఇంతలో తమ మేనత్త కుంతీ, ఆమె కుమాళ్ళూ వార ణావతం లక్క-ఇంట్లిలో కాలిపోయారని విన్నారు రామ కృష్ణులు. బంధువుల్ని పలకరించటం కోసం హస్తినాపురం వెళ్ళారు.

సత్యభామని తమకివ్వలేదని రుసరుసలాడుతూ వుండే వారు కృతవర్మా మొదలైనవారు. రామకృష్ణులు లేని సమయం చూసి అక్రూరుడూ, కృతవర్మా శతధన్వుడిని రెచ్చగొట్టారు. సత్రాజిత్తుని చంపేసి శ్యమంతకం చపా యించమన్నారు.

చక్కని సలహా అన్నాడు శతధన్వుడు. నిద్రపోతున్న సత్రాజిత్తుని నరికేసి, శ్యమంతకం ఎత్తుకుపోయాడు.

గోలుగోలుమంది సత్యభామ. తండ్రిచావుకి తానే కారణమని మరింత కుంగిపోయింది. వెంటనే రథం పూయిం చింది. ద్వారక పరుగెత్తింది. కృష్ణుడితో చెప్పి వలవలా ఏడ్చింది.

సత్యభామని వెంటపెట్టుకుని, బలరాముడితో కలిసి

హుటాహుటిని ద్వారకకి వచ్చాడు కృష్ణుడు. శతధన్వుడి మీదికి దండెత్తాడు.

కృతవర్మని శరణువేడాడు శతధన్వుడు.

కృష్ణుడితో విరోధం నా వల్ల కాదన్నాడు కృతవర్మ చావు తప్పదనుకున్నాడు. అక్రూరుడి దగ్గిరికి వెళ్ళాడు. శ్యమంతకం అతడి దగ్గిర దాచిపెట్టాడు. ఒక్కడూ గుర్ర మెక్కి ఊరినించి పారిపోయాడు.

దినానికి నాలుగువందల కోసులు పరిగెత్తే గుర్రమది. శతధన్వుడు పారిపోతున్నా డనగానే రథమెక్కి వెంట బడ్డారు రామకృష్ణులు.

రథం చూసి మరింత వడిచేశాడు శతధన్వుడు. వెళ్ళి వెళ్ళి మిథిల సమీపంలో పడిపోయింది గుర్రం. దాన్ని వొదిలేసి, పరుగు తీశాడు శతధన్వుడు. రథం నడవలేని ఇరుకు దారి పట్టాడు.

బలరాముడ్ని రథంమీద వుంచి శతధన్వుడ్ని తరుముకు వెళ్ళాడు కృష్ణుడు. కొంతదూరం వెళ్ళి సుదర్శన చక్రం విసిరాడు. శతధన్వుడి తల తెగి కిందపడింది.

దగ్గిరికి వెళ్ళాడు కృష్ణుడు. శ్యమంతకమణి కోసం వెదికాడు. శతధన్వుడి దగ్గిర శ్యమంతకం కనపడలేదు.

రథం దగ్గిరికి తిరిగి వచ్చేశాడు కృష్ణుడు.

"చచ్చాడు శతధన్వుడు."

"పీడా వొదిలింది. శ్యమంతకం తెచ్చావా?"

"లేదు. వాడి దగ్గిర కనబడలేదు."

"అదేమిటి?"

కృష్ణుడి మాట నమ్మలేదు బలరాముడు. తనను మభ్యపెట్టి మణి దాచేశాడనుకున్నాడు. మోసం చేశాడని నొచ్చుకున్నాడు. దాంతో కృష్ణుడితో కలిసి ద్వారక రావడానికి మనస్కరించలేదతడికి.

"సరే, నువ్వు ద్వారక వెళ్ళు. నేను మిథిలరాజుని చూసివస్తాను. నా స్నేహితుడతడు. ఎలాగూ దగ్గిరికి వచ్చాను మరి." అంటూ మిథిల వెళ్ళాడు బలరాముడు.

స్నేహితుణ్ణి చూసి సంతోషించాడు మిథిలరాజు. రాజమర్యాదలతో సత్కరించాడు. కృష్ణుడు తనదగ్గిర అబద్ధం చెప్పాడన్న అలకతో కొన్నాళ్ళదాకా మిథిలలో వుండిపోయాడు బలరాముడు.

గదాయుద్ధంలో బలరాముడంతవాడు మరొకడు లేడు. అతడు మిథిలలో వున్నప్పుడు, హస్తినించి వచ్చి దుర్యోధనుడు అతణ్ణి ఆశ్రయించి గదాయుద్ధం నేర్చుకున్నాడు. కనకనే దుర్యోధనుడంటే అభిమానంగా వుండేది బలరాముడికి. తన చెల్లెలు సుభద్రని దుర్యోధనుడికే ఇవ్వాలనుకున్నాడు. భారతయుద్ధంలో భీముడు అతడి తొడలు విరగొట్టినప్పుడు నొచ్చుకున్నాడు.

తండ్రిని చంపిన వాడి చావు వింది సత్యభామ. కాని శ్యమంతకం ఏమయింది?

'అవును, శ్యమంతకమణి ఏమయింది?' విచారించాడు

కృష్ణుడు, 'ఎందరి చావుకో కారణమయింది. అన్నయ్య అనుమానించాడు. ఏమయిందో, ఎక్కడుందో?'

సత్రాజిత్తు చావుకీ, శతధన్వుడి సాహసానికీ తామే కారకులమని తెలిస్తే, మణి మనదగ్గిర బయలుపడితే ప్రాణాలు దక్కవు అని భయపడ్డారు అక్రూరుడూ, కృతవర్మాకూడా. దాంతో చెప్పాచెయ్యకండా ద్వారకనించి వెళ్ళిపోయారు.

అప్పుడే కరువుకాటకాలు కనబడ్డాయి ద్వారకలో. అక్రూరుడు ద్వారకనించి వెళ్ళిపోడమే కరువుకి కారణమనుకున్నారు ప్రజలు. కృష్ణుడి దగ్గిరికి వెళ్ళి మొరపెట్టారు.

"నీ చల్లని చూపువల్ల ఏ బాధా ఎరగం మేము. కాలం కలిసిరాక కరువు కనపడిందిప్పుడు. మాకు తెలుసు, అక్రూరుడుంటే అయేది కాదిది. అతడున్నచోట అదునుకి వానలు పడతాయి. పాడీపంటా లోపముండదు. కరువు కాటకాలుండవు. ఈ ప్రభావం ఇతడి తండ్రి శ్వఫల్కుడినించీ వుంది.

ఇలాగే కాశీలో వెనక కరువుపట్టింది. కాశీ రాజు శ్వఫల్కుణ్ణి తీసుకువెళ్ళాడు. తన కుమార్తెని గాందినిని అతడికి పెళ్ళిచేశాడు. కాశీలో కరువుపోయింది. అంచేత అక్రూరుడు ఎక్కడున్నదీ వెదికించు. ద్వారక పిలిపించు." అన్నారు.

కరువుకి కారణం ఏదైనా, ప్రజల మాట మన్నించాడు కృష్ణుడు. అక్రూరుడి వునికి తెలుసుకున్నాడు. అతణ్ణి ద్వారక పిలిపించాడు. గౌరవంగా ఆదరించాడు. పినతండ్రికి చేయదగిన మర్యాదలన్నీ చేశాడు.

"అక్రూరా! నాకు తెలుసు, నీ దగ్గిరే వుంది శ్యమంతక మణి. అది నాకు అక్కరలేదు. నియమం కలవాడివి నువ్వు. నీ దగ్గిరే వుండనీ. కాని ఈ మణివల్ల రెండుమార్లు నిందల పాలయ్యాన్నేను. అన్నయ్యలాంటివాడు అనుమానించాడు; అలిగాడు. అంచేత మనవాళ్ళందరికీ మణి చూపించు. నిజం తేల్చి నా నింద పోగొట్టు. నీ మీద ఏమాత్రం కోపంలేదు" అన్నాడు.

"నన్ను మన్నించు" అంటూ అందరిముందూ తీసి మణి చూపించాడు అక్రూరుడు.

తమ్ముణ్ణి అనుమానించినందుకు ఎంతో నొచ్చు కున్నాడు బలరాముడు. 'నిజం నిలకడమీద తేలింది' అను కున్నారు యాదవులు.

## కాళింది

పాండవులు లక్కఇంట కాలిపోలేదు. తల్లితోకూడా తప్పించుకున్నారు. బ్రాహ్మల వేషంలో కొన్నాళ్ళు ఏక చక్రపురంలో గడిపారు. పాంచాలరాజు ద్రుపదుడు తన కూతురు కృష్ణకి—అదే ద్రౌపదికి స్వయంవరం చాటించాడని విని అక్కడికి వెళ్ళారు. ఆ స్వయంవరం చూడడానికి ద్వారకనించి బలరామకృష్ణులూ వెళ్ళారు. మారువేషాలతో వున్న పాండవుల్ని కనిపెట్టేశాడు కృష్ణుడు. ఫలానా ఫలానా అని బలరాముడికి పోల్తి చూపాడు. తరవాత, పాండవులు బసచేసిన కుమ్మరి కొండకి వెళ్ళి పలకరించి వచ్చారు బల రామకృష్ణులు.

పాండవులు అయిదుగురూ ద్రౌపదిని పెళ్ళి చేసుకుని, ఇంద్రప్రస్థంలో రాజ్యం చేస్తున్నప్పుడు కృష్ణుడు వచ్చి కొన్నాళ్ళు వాళ్ళతో గడిపాడు. అర్జునుడూ, తాను ఒకటే ప్రాణంలా వుంటూ వచ్చారు. ద్రౌపదిని సొంత తోడబుట్టువులా చూసుకున్నాడు. కృష్ణుడు ఎంతంటే అంత ధర్మరాజుకి. భీముడూ, నకుల సహదేవులూ అతణ్ణి గురువులా భావించేవారు. మేనత్త కుంతిని ఎంతగానో మన్నించేవాడు కృష్ణుడు. ఆమె కష్టాలు విని వోదార్చేవాడు.

ఒకనాడు యమున ఒడ్డు అడివికి వేటకి వెళ్ళాడు అర్జునుడు. అతడితో కృష్ణుడు వెళ్ళాడు. వేట అయాక, యమునలో నీళ్ళుతాగి ఓ దగ్గిర కూచున్నారు. అనుకోకండా అక్కడికో అమ్మాయి వచ్చింది. అందమంతా ఆమెలోనే వున్నట్టుంది.

ఎవరీమె అన్నట్టు అర్జునుణ్ని చూశాడు కృష్ణుడు. ఆమెనే అడిగాడు అర్జునుడు.

"సూర్యుడు మా తండ్రి. కాళింది అంటారు నన్ను."

"అడివిలో ఏం పని?"

"తపస్సు."

"ఎందుకని?"

"కృష్ణుణ్ని భర్తగా పొందాలని."

"ఈయనే కృష్ణుడు."

సిగ్గుతో తల వొంచుకుంది కాళింది. ఆమెని రథం మీద ఇంద్రప్రస్థం తీసుకు వచ్చేశారు కృష్ణార్జునులు.

ద్వారక తిరిగి వచ్చాక కాళిందిని పెళ్ళి చేసుకున్నాడు. అయితే రావడానికి ముందు ఖాండవవనం కాల్చినప్పుడు అర్జునుడికి అండగా నిలిచాడు. మంటల్లోంచి బయట పడిన మయుడికి ధర్మరాజుకోసం మంచి సభ నిర్మించమని నియోగించాడు.

ఇంద్రప్రస్థంలో పాండవులు ద్రౌపది విషయంలో ఒక నియమం చేసుకున్నారు. ఆమె ఒక్కొక్కరిదగ్గిరా ఒక్కొక్క ఏడాది వుండాలి. ఒకరితో రహస్యంగా వున్నప్పుడు ఇంకొకరు వెళ్ళకూడదు. అలా వెళితే పన్నెండేళ్ళు తీర్థయాత్ర చేయాలి. అయితే ధర్మరాజుతో ద్రౌపది వున్నప్పుడు తప్పనిసరిగా వెళ్ళవలిసివచ్చింది అర్జునుడు. నియమం ప్రకారము తీర్థయాత్ర చేశాడతడు. చివర సన్యాసి వేషంలో ద్వారక వెళ్ళాడు. తెలిసే అతడ్ని అంతఃపురంలోకి తీసుకు వెళ్ళి, చెల్లెలు సుభద్రని అతడి పరిచర్యకు నియోగించాడు కృష్ణుడు.

మేనత్త కొడుకుని అర్జునుడ్ని పెళ్ళాడాలని కలలు కంటూ వుండేది సుభద్ర. అర్జునుడికీ ఆమెమీదే వుండేది. అది బాగా తెలుసు కృష్ణుడికి. అందుకని అర్జునుడు సుభద్రని ఎత్తుకుపోయి పెళ్ళి చేసుకుందికి అన్ని అవకాశాలూ కల్పించాడతడు.

సుభద్రని ఎత్తుకుపోయాడు అర్జునుడు. బలరాముడు మండిపడ్డాడు. అడ్డుకుని సర్ది చెప్పాడు కృష్ణుడు. అలా కృష్ణార్జునుల చుట్టరికం మరింత బలపడింది.

## మిత్రవింద

కృష్ణుడి మరో మేనత్త రాజాదేవి. అవంతి రాజుని పెళ్ళాడిందామె. విందుడూ, అనువిందుడూ అని ఇద్దరు కొడుకులూ, మిత్రవింద అని కూతురూ వుండేవారామెకు. మిత్రవింద చక్కదనాల చుక్క. కృష్ణుడ్నే పెళ్ళాడాలని ఉవ్విళ్ళూరుతూ వుండేదామె. కాని విందానువిందులు దుర్యోధనుడి పక్షం వాళ్ళు. భారతయుద్ధంలో కౌరవులవేపే పోరాడారు.

స్వయంవరంలో రాజులందరూ చూస్తూవుండగా మిత్రవిందని ఎగరేసుకుపోయాడు కృష్ణుడు. ద్వారకకి తీసుకువచ్చి పెళ్ళి చేసుకున్నాడు గొప్పగా.

## నాగ్నజిత్తి

అయోధ్యరాజు నగ్నజిత్తు. అతడి కూతురు నాగ్నజిత్తి, అందానికి పెట్టింది పేరు. ఎంతోమంది రాజులు ఆమె కోసం వచ్చారు. అయితే నగ్నజిత్తు ఒక వింత షరతు పెట్టాడు. తన దగ్గిర ఏడు కోడెదూడ లుండేవి. ఎంపిక చేసిన మంచి జాతి దూడలవి. అసాధ్యమైనవి. ఎంతటి వాడికీ లొంగేవికావు. "అదిగో ఆ ఏడు గిత్తల్నీ ఎవరు అదుపులో పెడితే వారికి మా అమ్మాయినిచ్చి పెళ్ళి చేస్తాను." అని చాటించాడు.

"ఇంతేనా ? ఇదెంతలో మాట!" అంటూ దేశదేశాల రాజులు అయోధ్య దిగబడ్డారు. అయితే ఆబోతు

ల్లాగా బుసకొట్టాయి గిత్తలు. దగ్గరికైనా చేరనివ్వలేదు రాజుల్ని. అవి బుసకొట్టి తోకలెత్తేసరికి తోకలు ముడిచే వారు రాజులు. నవ్వుకునేది నాగ్నజిత్తి. 'అందరూ వస్తు న్నారు కృష్ణుడు వస్తే బాగుండేది.' అనుకునేది.

అనుకున్నట్టు ఓనాడు రానే వచ్చాడు కృష్ణుడు. కృష్ణుడు కోడెదూడలు ఏడింటినీ ఇట్టేలొంగదీశాడు. అతడేం చెపితే అది చేశాయవి.

కన్యనిచ్చి గొప్పగా పెళ్ళిచేశాడు అయోధ్యరాజు నగ్నజిత్తు విలువైన అరణమిచ్చి కూతుర్ని సాగనంపాడు. తక్కిన రాజుల కళ్లు కుట్టాయి. దారికాచి దాడిచేశారు.

అయితే అవాళ అర్జునుడూ వున్నాడు, కృష్ణుడి వెంట. రాజులందరినీ తరిమికొట్టాడు. కొత్త పెళ్ళికూతురితో ద్వారక చేరాడు కృష్ణుడు.

## భద్ర

కృష్ణుడి మరో మేనత్త శ్రుతకీర్తి కూతురు భద్ర. తండ్రి కేకయ దేశం రాజు ధృతకేతుడు.

మేనత్త కూతురు కనక భద్రనీ పెళ్ళాడాలనుకు న్నాడు కృష్ణుడు. పైగా ఆమెకూడా కృష్ణుడ్నే వలచింది. మేనరికం పెళ్లే జరిగింది. గొప్పగా జరిగింది. భద్రకి రోహిణి అని మరో పేరుండేది.

## లక్షణ

మద్రరాజ్యం రాజు బృహత్సేనుడు. ఇతడి కూతురు లక్షణ. అందానికి పేరు మోసిందామె.

బృహత్సేనుడు చిత్రమైన మత్స్యయంత్రం పెట్టి తానిచ్చిన విల్లు ఎక్కుపెట్టి, యంత్రంలో చేపని కొట్టినవారికి లక్షణనిచ్చి పెళ్ళి చేస్తానని, స్వయంవరం చాటించాడు. దేశ దేశాల రాజులు వచ్చారు. చేపని కొట్టలేకపోయారు. ధనుస్సే ఎత్తలేకపోయారు కొందరు పేరుపడ్డ విలుకాళ్ళందరూ తల వొంచుకు వెళ్ళిపోయారు.

చివరికి కృష్ణుడు వెళ్ళాడు. అవలీలగా విల్లు తీశాడు. అల్లెతాడు ఎక్కుపెట్టాడు. అవుపడీ అవపడనట్టున్న చేప నీడ నీళ్ళలో చూశాడు. చేపని పడగొట్టాడు. లక్షణని పెళ్ళి చేసుకుని ద్వారక వచ్చేశాడు.

## ప్రద్యుమ్నుడు

పెళ్ళయిన కొన్నాళ్ళకి మన్మధుడిలాంటి కొడుకుని కంది రుక్మిణి. అతడి పేరు ప్రద్యుమ్నుడు.

శంబరుడని ఒక రాక్షసరాజు వుండేవాడు. రుక్మిణి కొడుకు తనను చంపుతాడని విని, పురిటి గదిలోంచే బిడ్డని ఎత్తుకుపోయి, సముద్రంలో పడేశాడు. సముద్రంలో పెద్ద చేప పిల్లణ్ణి మింగేసింది. మింగీ మింగడంతోనే ఒక జాలారి వలలో చిక్కుకుందది. దాన్ని పట్టుకెళ్ళి శంబరుడికిచ్చి ఇనాం పుచ్చుకున్నాడు జాలారి.

శంబరుడి కోటలో ఎన్నాళ్ళయో ఒక వంటలక్క వుండేది. ఆమె పేరు మాయావతి. ఎప్పుడూ వయసులోనే వుండేదామె. నిజంగా రతీదేవిలా వుండేది. చేపని కోసిందామె. పిల్లడ్ని చూసి మురిసిపోయింది. పెంచి పెద్దచేసింది.

అతడికి నూనూగు మీసాల వయసు వచ్చేసరికి, తన వలపు వొలకపోసింది.

అంతవరకు ఆమెని అమ్మగానే చూస్తున్నాడు ప్రద్యుమ్నుడు. "ఇదేమిటి?" అని తిరగబడ్డాడు.

పెద్దకథ చెప్పింది మాయావతి:

"నువ్వు నా కొడుకువి కావు. మీ అమ్మ రుక్మిణి. అయ్య కృష్ణుడు. మీ వూరు ద్వారక. పురిటి గదినించి నిన్ను ఎత్తుకువచ్చాడు శంబరుడు. సముద్రంలో పారేశాడు.

పెద్దచేప నిన్ను మింగేసింది. జాలారి శంబరుడికిచ్చాడు. నేను కోసితీశాను; పెంచాను. ఇది ఎవరికీ తెలీదు. అంతా నాకు తెలుసు. నేను మామూల్మాలు మనిషిని కాను. రతిని. నువ్వు వెనకజన్మలో మన్మథుడివి. నీ కోసమే ఇన్నాళ్ళూ కనిపెట్టుకున్నాను.

శంబరుడ్ని చంపు. మీ అమ్మ నీ కోసం ఏడుస్తూనే వుంది. శంబరుడ్ని చంపి ద్వారక పోదాం."

మాయావతిని నమ్మాడు ప్రద్యుమ్నుడు. శంబరుడి మీద తిరగబడ్డాడు. అతడి కుమాళ్ళని చిత్రసేనుడూ, కృతసేనుడూ, సేనస్కంధుడూ, అతిసేనుడూ, నికలుడూ, శాన్తాన్తకరుడూ మొదలైన వారిని హతమార్చాడు. అలా

అతడి వందమంది కొడుకుల్నీ ఫూడ్చేశాడు. అతడి మంత్రుల్నీ చంపేశాడు. చతురంగ సైన్యాలూ చంపేశాడు.

తుదకి శంబరుడే వచ్చి పడ్డాడు. బలమైన బాణాలతో ప్రద్యుమ్నుడ్ని ముంచెత్తాడు. బ్రహ్మాండమైన బలశాలి ప్రద్యుమ్నుడు. శంబరుడి బాణాలన్నీ ఎగరగొట్టేశాడు. ఒక్కడే లెక్కలేనంతమందిలా పోరాడాడు. తుదకి వైష్ణ వాస్త్రంతో శంబరుడ్ని చంపేశాడు ప్రద్యుమ్నుడు.

రతీ ప్రద్యుమ్నులు ద్వారక వచ్చారు. అచ్చంగా మూడు పోలికలూ కృష్ణుడిలాగే వున్నాడు ప్రద్యుమ్నుడు. తమ కళ్ళే తాము నమ్మలేకపోయారు ప్రజలు. తిన్నగా కృష్ణుడి లోగిళ్ళ వెళ్ళారు రతీ ప్రద్యుమ్నులు.

లోగిళ్ళ స్త్రీలందరూ వచ్చి మూగారు. రుక్మిణీ వచ్చింది. 'నా ప్రద్యుమ్నుడు కొడుకదా!' అనుకుంది. అనుకోకండా ఆమెకు చనుబాలు చేపాయి. "ఉంటే ఇలాగే, ఇంతవాడే అయేవాడు." అంటూ కంట తడిపెట్టుకుంది. ఆమెకి నమస్కరించాడు ప్రద్యుమ్నుడు.

కృష్ణుడూ వచ్చాడు. చూడడంతోనే పోల్చు కున్నాడు. తెలిసినట్టే పలకరించాడు. అడుగులకి మ్రొక్కాడు ప్రద్యుమ్నుడు.

కథంతా చెప్పింది రతి. అందరూ ఆశ్చర్యపడుతూ ఆలకించారు. కొడుకుని గుండెలకద్దుకుంది రుక్మిణి. గుచ్చి కౌగిలించుకున్నాడు. కృష్ణుడు. అందరూ అపురూపంగా ఆదరించారు. "తప్పిపోయిన కొడుకు తిరిగి రావడమే కాదు, కోడలితో తిరిగి వచ్చాడు" అంటూ సంబరపడ్డారు.

శంబరుడు పురిటి గదినించి ప్రద్యుమ్నుణ్ణి పట్టుకుపోయిన నెలరోజులలోనే జాంబవతి కొడుకుని కంది. అతడి పేరు సాంబుడు. చిన్నప్పటినించీ సాంబుడికి అస్త్రవిద్య నేర్పి ప్రయోజకుణ్ణి చేశాడు బలరాముడు.

## పదహారు వేల మంది కన్యలు

ప్రాగ్జోతిషపురం రాజు నరకుడు. ఎంతో బలవంతుడు. ఎంతమందినో రాజుల్ని జయించి పదహారు వేలమంది రాచ కన్నెల్ని ఖైదులో వుంచాడు. ఇతడి ఏనుగు పేరు సుప్రతీకం. ఇతడి దుడుకుతనం విని కృష్ణుడు సత్యభామతో కలిసి ప్రాగ్జోతిషం ముట్టడించాడు. నరకుణ్ణి నరికేశాడు. అతడి కుమారుణ్ణి భగదత్తుని ప్రాగ్జోతిషానికి రాజు చేశాడు. ఈ భగదత్తుడు భారతయుద్ధంలో కౌరవుల పక్షం పోరాడాడు. ఇతడూ, ఏనుగు సుప్రతీకమూ అర్జునుడి చేత అంతరించాయి.

నరకుణ్ణి చంపి, అతడు చెరలో వుంచిన పదహారు వేల మంది రాచకన్నెల్ని విడిపించాడు కృష్ణుడు. పదహారు వేల మందీ కృష్ణుణ్ణే వరించారు. అంతమందినీ ఒక్కడే కట్టు కున్నాడు కృష్ణుడు. వారినీ, మంచి మంచి ఐరావతం జాతి ఏనుగుల్నీ ద్వారక తర్లించాడు. గొప్పగొప్ప మణులూ అవీ అక్కడివారు కృష్ణుడికి కానుక పూజించారు.

అరవై వేలమందికీ అరవై వేల లోగిళ్ళు కట్టించాడు కృష్ణుడు. అందరినీ ఒక్కలాగే ఏలుకున్నాడు. మొదటి ఎనిమిదిమంది భార్యలకీ తలా పదేసిమంది కొడుకులు కలిగారు.

ప్రద్యుమ్నుడూ, చారుదేష్ణుడూ, సుదేష్ణుడూ, చారుదేహుడూ, సుచారుడూ, చారుగుప్తుడూ, భద్ర చారుడూ, చారుచంద్రుడూ, విచారుడూ, చారుడూ రుక్మిణి కొడుకులు.

సాంబుడూ, సుమిత్రుడూ, పురుజిత్తూ, శతజిత్తూ, సహస్రజిత్తూ, విజయుడూ, చిత్రకేతుడూ, వసుమంతుడూ, ద్రవిడుడూ, క్రతుడూ జాంబవతి కొడుకులు.

భానుడు, సుభానుడు, స్వర్భానుడు, ప్రభానుడూ, భానుమంతుడు, చంద్రభానుడు, బృహద్భానుడు, అతి భానుడు, శ్రీభానుడు, ప్రతిభానుడు సత్యభామ కొడుకులు.

వీరుడు, చంద్రుడు, అశ్వసేనుడు, చిత్రగుడు, వేగవంతుడు, వృషుడు, ఆముడు, శంకుడు, వసుడు, కుంతీ నాగ్నజిత్తి కొడుకులు.

శ్రుతుడు, కవి, వృషుడు, వీరుడు, సుబాహువు, భద్రుడు, శాంతి, ధర్ముడు, వర్ణమానుడు, సోమకుడు, కాళింది కొడుకులు.

వృకుడూ, హర్షుడూ, అనిలుడూ, గృధ్రుడూ, వర్ధ నుడూ, అన్నాదుడూ, మహాశుడూ, పావనుడూ, వహ్నీ, క్షుధీ మిత్రవింద కొడుకులు.

సంగ్రామదత్తుడూ, బృహత్సేనుడూ, శూరుడూ, ప్రహరణుడూ, అరిజితుడూ, జయుడూ, సుభద్రుడూ, వాముడూ, ఆయువూ, సత్యకుడూ భద్ర కొడుకులు.

ప్రదోషుడూ, గాత్రవంతుడూ, సింహుడూ, బలుడూ,

ప్రబలుడూ, ఊర్ధ్వగుడూ, మహాశక్తీ, సహుడూ, ఓజుడూ, అపరాజితుడూ లక్షణ కొడుకులు.

వీళ్ళందరూ అంగ కృష్ణుణ్ణే పోలివుంటారు. కడప భార్యలకీ ఇలాగే కొడుకులు కలిగారు.

రుక్మిణికి ఒక కూతురు కూడా పుట్టింది. పేరు చారుమతి. ఆమెని కృతవర్మ కొడుకు బలి పెళ్ళి చేసుకున్నాడు.

ఇలా కృష్ణుడి సంతానం వేలు వేలుగా, తామర తంపరగా పెరిగింది. యాదవకులం సముద్రమంత అయింది. మనమలూ, ముమ్మనములూ కిలకిల్లాడారు. చుట్టాలూ పక్కాలూ చెప్పే అక్కరలేదు.

## ప్రభావతి

వజ్రనాభుడని ఒక రాక్షస రాజుండేవాడు. మేరు పర్వతం దగ్గిర తపస్సు చేసి వరాలు పొందాడు. అతడి రాజధాని వజ్రపురం. అతడి అంగీకారం లేందే ఎంతటివాడూ వజ్రపురంలో అడుగు పెట్టడానికి వీలుండేదికాదు.

వజ్రనాభుడికి ప్రభావతి అని ఒక కూతురుండేది. అపురూపమయిన సుందరి ఆమె.

ఇలా వుండగా ఓ నాడు ఓ రాజహంసలమంద వజ్రపురంలో దిగింది. చెరువుల్లోనూ, నడబావుల్లోనూ, వాలి ఈతాలాడాయి హంసలు. అందులో ఒకటి ప్రభావతి లోగిలి కోనేటిలో వాలింది. దానిపేరు శుక్తిమతి.

శుక్తిమతిని చూసి ముచ్చటపడింది ప్రభావతి. మెల్లి మెల్లిగా దాన్ని మచ్చిక చేసుకుంది.

మాటలు నేర్చిన హంస శుక్తిమతి. మచ్చికయి, ప్రభావతితో ఫూసులాడ్డమూ, కబుర్లు చెప్పడమూ మొదలెట్టింది. ఓ నాడు ఏకాంతంగా ప్రభావతితో ఇలా మొదలెట్టింది :

"ప్రభావతీ! నిజంగా ప్రభావతివే నువ్వు. నీ అంతటి సుందరిని ఎక్కడా చూడలేదు. వజ్రాల తునకవి నువ్వు. అందానికి తగిన వయసులో వున్నావు. వయసున్నప్పుడే అనుభవించాలి. ఏదన్నా వస్తుంది, కాని వయసు పోతే మరిరాదు.

"నువ్వు మరోలా అనుకోను అంటే చెపుతాను. నీ మేలుకోరే చెపుతున్నాను. నీకు తగిన వరుడు- నాకు తెలుసు.

ద్వారక అని ఒక పట్టణముంది. వినే వుంటావు. మన వజ్రపురం దానిముందు ఏమూల! ఆ మేడలూ, ఆ మిద్దెలూ, ఆ తోటలూ, ఆ బాటలూ- వాటికి అవేసాటి. శ్రీకృష్ణుడు కట్టించిన యాదవుల రాజధాని ద్వారక.

కృష్ణుడి పెద్దభార్య రుక్మిణి. రుక్మిణి పెద్దకొడుకు ప్రద్యుమ్నుడు. అతణ్ణి పోలిన అందగాణ్ణి ఎక్కడా చూడలేదు. కృష్ణుడే అందగాడు, అతడికంటే అందగాడు ప్రద్యుమ్నుడు. అన్నివిధాలా నీకు తగినవాడు. ఎంత అంద ముందో అంత మగసిరి వుంది అతడిలో. మొనగాళ్ళలో

మొనగాడు. యాదవుల సేనాపతి. చిన్నప్పుడే శంబరుణ్ణి చంపాడు. అతడి మాయలన్నీ చేజిక్కించుకున్నాడు.

ప్రభావతీ! అతడి అందచందాలు విడమర్చి చెప్పాలంటే, నేనుకాదు, నాలాటి వెయ్యిమందయినా చాలరు."

ఇలా ఎన్నో ప్రభావతి చెవిలో వూదింది రాజహంస శుక్తిమతి. నిట్టూరుస్తూ వింది ప్రభావతి. ఒళ్ళంతా చెవులు చేసి వింది. పులకరిస్తూ వింది.

"శుక్తిమతీ!" కొంచేపు వూరుకుని అంది ప్రభావతి, "ప్రద్యుమ్నుడు సాక్షాత్తూ మన్మథుడే అని నేనూ విన్నాను చూచాయగా. కానైతే మా వజ్రపురం నిజంగా వజ్రపురమే. పరాయి మగాడు నాన్నగారి అనుమతిలేందే తొంగి చూడలేడు. యాదవులకి మా నాన్న కన్యనివ్వడు. మరి మాకెలా కుదురుతుంది పెళ్ళి? ఇంతకీ అతడికి నేను నచ్చవద్దూ?"

"నచ్చడమూ నచ్చకపోడమూ - అది నాకు విడిచి, పెట్టు ప్రభా! నేను మంచి మంచి కథలు చెపుతాననీ, మాటలు నేర్చినదాననని మీ నాన్నతో చెప్పు. మీ నాన్న నన్ను తీసుకురమ్మంటాడు. అప్పుడు చూద్దువు కాని నీ శుక్తిమతి పాచిక" అంటూ రెక్కలు జాడించింది రాజహంస.

తండ్రి దగ్గిరికి వెళ్ళింది ప్రభావతి. హంసలాగే నడిచి వెళ్ళింది. కొలువులో వున్నాడు వజ్రనాభుడు. అతడి పేరంటే పిట్టలు నీళ్ళు తాగేవి కావు. గాలి కదిలేది కాదు. కూతుర్ని ఆదరంగా కూచోపెట్టుకున్నాడు దగ్గిర. సిరసు ముద్దాడాడు. మెల్లిమెల్లిగా ఎత్తుకుంది ప్రభావతి.

"నాన్నారండీ, మన వూళ్ళోకి హంసలు వచ్చాయండీ!"

"అవును, విన్నాను. నీకు కావాలా ?"

"ఉఁ హూఁ, నా కోనేట్లోకే వచ్చింది ఒకట్టి. దాని పేరు శుక్తిమతి. మనలాగే మాట్లాడుతుందది. దేశదేశాలు తిరిగిందేమో, ఎన్నో కథలు చెబుతుంది. నాతో మచ్చికగా వుంటుంది."

కూతురు మాట విని కుతూహలం కలిగింది వజ్రనాభుడికి. శుక్తిమతిని తీసుకురమ్మన్నాడు. వచ్చి హంసతో చెప్పింది ప్రభావతి. రాజసభకి వెళ్ళింది రాజహంస. ఎన్నో కబుర్లు చెప్పింది.

ఎంత ముచ్చట పడాలో అంత ముచ్చటా పడ్డాడు వజ్రనాభుడు. ఆమాటా, ఈమాటా చెప్పి నటుల ప్రశంస ఎత్తింది హంస.

"మహారాజా ! భద్రుడని ఒక నటుడున్నాడు. పేరు పడ్డ నటుడతడు. అతడి నటన చూడనివారి నేత్రాలు నేత్రాలు కావు. అతడి పాట వినని వారి చెవులు చెవులు కావు" అంది.

"అవును, మేమూ విన్నాం. అతడి ఉనికెక్కడ ?"

"ఉనికి ఒక దగ్గరంటూ లేదు భద్రుడికి. కాని తరచు ద్వారకలో అవుపిస్తూ వుంటాడు. రసికులున్న దేశాలకి వెళుతూ వుంటాడు. కానుకలూ, కట్నాలూ, మోసుకు వస్తాడు."

"అయితే ఈమారు నీ కంటపడినప్పుడు ఓ మారు ఈ వేపు రమ్మను."

"అలాగే" అని చెప్పి వచ్చేసింది శుక్తిమతి.

"ప్రభావతీ ! నీ రొట్టె నేతిలోపడింది. ప్రద్యుమ్నుణ్ణి పట్టుకు వస్తాను, విచారపడకు" అని చెప్పి వజ్రపురంనించి ద్వారక వెళ్ళింది. సముద్రం మధ్యాన లంకాపురంలా వుంది ద్వారక. యాదవులతో సముద్రంలో రెండో సముద్రంలా వుంది.

వెన్నెల ముద్దలా కిందకి దిగింది హంస. ఒంటరిగా ప్రద్యుమ్నుణ్ణి కలుసుకుంది. ప్రభావతి విషయం చెప్పింది. ఆమె రూపు రేఖలూ, వయసు తీరూ వర్ణించింది. ఆమె మీద వలపు రేకెత్తించింది. నీ కోసమే ఎదురుచూస్తూ కూచుంది ప్రభావతి." అంటూ తొందరచేసింది.

"అయితే ఉపాయమూ నువ్వే చెప్పు" హంసని నిమురుతూ అడిగాడు ప్రద్యుమ్నుడు.

"నువ్వెరగని మాయ ఏముంది?" అంటూ అందు కుంది శుక్తిమతి, "అయినా ఉపాయం సిద్ధంచేసే వుంచా న్నేను. నటుడు భద్రుడున్నాడు కదా! అతడి నటన చూడా లనుకుంటున్నాడు వజ్రనాభుడు. నువ్వు నటులలో నటుడివి, గాయకుల్లో గాయకుడివి. భద్రుడి వేషంలో వజ్రపురం దయచెయ్యి. ప్రభావతిని పట్టుకురా." అంది.

వజ్రపురానికి పయనమయాడు ప్రద్యుమ్నుడు. తన పయనం తండ్రి కృష్ణుడికి చెప్పాడు. గ్రహించాడు కృష్ణుడు.

సాంబుణ్ణీ, గదుణ్ణీ మరికొంతమందినీ ప్రద్యుమ్నుడి వెంట వెళ్ళమన్నాడు. భద్రుడి నటబృందంలాగే వారికీ వేషాలు వేయించాడు. ప్రద్యుమ్నుడు భద్రుడయ్యాడు. అతడే ఆ జట్టుకి నాయకుడు. సాంబుడు, విదూషకుడు. గదుడు సూత్రధారుడు. కొంతమంది పాటగాళ్ళు, కొంతమంది వాద్యగాళ్ళు, కొంతమంది సానులు.

ఇలా ఈ నటబృందం బయలుదేరి ముందు వజ్రపురం (దగ్గర) శివారుపట్నం సుపురం ప్రవేశించారు.

సుపురంవారు అంతకిముందే భద్రుడి పేరు వినే వుండడంచేత ఈ నటులనందరినీ ఆప్యాయంగా ఆదరించారు.

ఎప్పటి కబుర్లు అప్పుడు ప్రభావతికి అందజేస్తూ వుండేది శుచిమతి.

సుపురంలో రామాయణం అభినయించారు యాదవులు. దశరధుడు సానుల్ని పంపి ఋష్యశృంగుణ్ణి తెప్పించడం, శాంతనిచ్చి పెళ్ళిచేయడం, కొడుకులకోసం యజ్ఞం చేయడం, రామలక్ష్మణులూ భరతశత్రుఘ్నులూ పుట్టడం- చక్కగా అభినయంచేసి చూపారు. చక్కగా పాటలు పాడారు. వాళ్ళ వేషాలూ, దుస్తులూ, అభినయాలూ, రంగస్థలమూ చూస్తూ సుపురం వాళ్ళందరూ ఆశ్చర్యపోయారు. ఆనందం పట్టలేకపోయారు. కొసరి కొసరి మళ్ళీ మళ్ళీ ఆడించారు. బంగారు నగలూ, మంచి మంచి బట్టలూ బహూకరించారు.

భద్రుడి నాటకసంఘం సుపురం వచ్చిందనీ, అద్భుతంగా నాటకాలు వేస్తున్నదనీ విన్నాడు వజ్రనాభుడు. తన

వజ్రపురానికి రమ్మని కబురు పంపాడు. నటుల వేషంలో యాదవులు వజ్రపురంలో ప్రవేశించారు. మంచి భవనం బసగా యిచ్చాడు వజ్రనాభుడు. అన్ని సదుపాయాలూ కలిగించాడు. మంచి రంగస్థలం తయారయింది. వజ్రనాభుడు సభతీర్చి కూచున్నాడు. రాణివాసం స్త్రీలకోసం ప్రత్యేకం చోటు కేటాయించారు. అవాళ శివుడి పండగ. అందుకు సరిపోయినట్టు గంగావతరణం అభినయించారు యాదవులు. ముందుగా ప్రద్యుమ్నుడూ, సాంబుడూ, గదుడూ, రకరకాల వాద్యాలతో రాగాలాపన చేశారు. పాటలు పాడారు. వీణలతోనూ, వేణువులతో శ్రుతులు కలిపారు. సభ సభంతా వోలలాడించారు. నాంది మోయించారు.

గంగావతరణం తరవాత రంభా నలకూబర నాటకం వేశారు యాదవులు. ప్రద్యుమ్నుడు నలకూబరుడి వేషం వేశాడు. వేశ్య మనోవతి రంభపాత్ర ధరించింది. శూరుడు (యాదవుడు) రావణుడి వేషం వేశాడు. సాంబుడు విదూషకుడయాడు.

ఈ రంభానలకూబర నాటకంలో తమ నేర్పంతా అవుపరిచారు యాదవులు. రంగస్థలంలో వారు తయారు చేసిన కైలాసపర్వతం ఆశ్చర్యం కలిగించింది.

ఈ నాటకాలు చూసి ఆనందం పట్టలేకపోయాడు వజ్రనాభుడు. వజ్రాలూ, నగలూ, పట్టుబట్టలూ ఎన్నో అన్ని కట్నాలూ, కానుకలు ఇచ్చి సత్కరించాడు. ఎంతో కాలం ఆ నాటకాలవాళ్ళని వజ్రపురంలోనే వుంచేశాడు.

ప్రభావతీ ప్రద్యుమ్నుల మధ్య రాయబారం నడు

పుతూ వచ్చింది రాజహంస. రహస్యంగా అంతఃపురంలో ప్రవేశించాడు ప్రద్యుమ్నుడు. ప్రభావతిని గాంధర్వ వివాహము చేసుకున్నాడు. ప్రతిదినం తెల్లవార్లూ ఆమెతో వుండి వచ్చేసేవాడు.

వజ్రనాభుడికి సునాభుడని తమ్ముడుండేవాడు. అతడికి చంద్రవతీ, గుణవతీ అని ఇద్దరు కూతుళ్ళుండేవాళ్ళు. ఇద్దరూ రూపవతులు, గుణవతులు. ఇద్దరూ ప్రభావతితో స్నేహంగా వుండేవారు. తరుచు ఆమె దగ్గిరికి వచ్చేవారు. ఓ నాడు ప్రభావతీ ప్రద్యుమ్నులు కలిసివుండగా వాళ్ళు వచ్చి చూశారు. "ఏమిటక్కా ఇది?" అని అడిగారు.

"నాకు దూర్వాసముని ఒకమంత్రం మప్పాడు" అంది ప్రభావతి, "ఈ మంత్రం మహిమతో కోరుకున్న మగడు వస్తాడు. మీరూ కావాలంటే చెప్పండి. నా ప్రియుడులాంటి అందమైన మగళ్ళని మీ దగ్గిరికి వచ్చేట్టు చేస్తాను."

"అయితే పంపించు" అంటూ సంబరపడ్డారు వాళ్ళు.

చంద్రవతీ, గుణవతీ వెళ్ళాక ప్రద్యుమ్నుడితో నవ్వుతూ చెప్పింది ప్రభావతి:

"మీ తమ్ముళ్ళని సాంబుడ్నీ, గదుడ్నీ మా చెల్లెళ్ళ దగ్గిరికి పంపించు."

ప్రభావతి చెప్పినట్టే చేశాడు ప్రద్యుమ్నుడు. సాంబుడు గుణవతినీ, గదుడు చంద్రవతినీ రహస్యంగా

గాంధర్వ వివాహం చేసుకున్నారు. వారితో కూడి సుఖ పడుతూ వచ్చారు.

ఇదంతా రెండో కంటివాడికి తెలియకుండానే జరుగుతూ వచ్చింది. అంతఃపురాల రహస్యం ఎప్పుడూ అంతే.

ప్రభావతీ, చంద్రవతీ, గుణవతీ — ముగ్గురూ నీళ్ళాడారు. ముగ్గురూ ముత్యాలలాంటి కొడుకుల్ని కన్నారు.

మూడుమూర్తులా ప్రద్యుమ్నుడిని పోలిన కొడుకుని కంది ప్రభావతి. అలాగే తండ్రిని పోలిన కొడుకునే కంది చంద్రవతి. అతడిపేరు చంద్రప్రభుడు. గుణవతి కొడుకు గుణవంతుడు.

ఈ ముగ్గురూ మేడలమీద ఆడుకుంటూ ఓ నాడు కావలివాళ్ళ కంటపడ్డారు.

"ఇదేమిటి, కాపలా కాపలాలాగే వుంది, కన్యలు కొడుకులు కన్నారు! మన పీకలు తెగిపోతాయి" అంటూ భయపడిపోయారు. పడుతూ లేస్తూ వజ్రనాభుడి దగ్గిరికి పరిగెత్తారు. వింతకబురు విన్నవించారు.

ఉగ్రుడే అయిపోయాడు వజ్రనాభుడు. "కన్యల లోగిళ్ళలో కనపడ్డ మగపురుగునల్లా చంపెయ్యండని సైన్యం పంపాడు. తానూ, తమ్ముడు సునాభుడూ గదలు పట్టుకు బయల్దేరారు.

ప్రభావతీ, చంద్రవతీ, గుణవతీ కొడుకుల్నీ, మగల్నీ పట్టుకుని గోలుగోలుమన్నారు. ధైర్యంచెప్పి వోదార్చారు యాదవ కుమాళ్ళు. ముగ్గురూ ఆయుధాలు పట్టుకున్నారు. యుద్ధానికి సిద్ధమయారు.

ఇంతలో వజ్రనాభుడి సైనికులు యాదవ కుమాళ్ళని చుట్టుముట్టారు. ఘోరంగా మొదలయింది యుద్ధం.

కృష్ణుడి తరవాత కృష్ణుడంతవాడు ప్రద్యుమ్నుడు. పైగా మాయాయుద్ధం తెలిసినవాడు. మాయ విమాన మెక్కి, మబ్బుల్లోంచి మాయాయుద్ధం చేశాడతడు. ఒక్కడే ఎక్కడపడితే అక్కడ అవుపించాడు. వజ్రపుర మంతా కవుకులు పెట్టేశాడు వందలు వందలు, వేలు వేలు మందిని హతమార్చాడు. అవాళ తెల్లవార్లూ జరిగింది యుద్ధం. సాంబుడూ, గదుడూ, నటుల వేషంలో వున్న యాదవులందరూ హోరాహోరి పోరాడారు.

ఇక్కడ యుద్ధం మొదలయిందో లేదో, ద్వారకకి ఎగిరి, ఉప్పందించింది శుక్తిమతి. పొద్దుపొడిచే సరికి మర్నాడు, వజ్రపురం పొలిమేర మేఘా లురిమినట్టు మారుమోగింది పాంచజన్యం. దాంతో ఎక్కడలేని బలమూ, సాహసమూ, ఉత్సాహమూ పుంజుకున్నారు యాదవ కుమాళ్ళు.

తండ్రి దగ్గిరికివచ్చి నమస్కరించాడు ప్రద్యుమ్నుడు. గదా, సుదర్శన చక్రమూ ఇచ్చి, వజ్రనాభుడిమీదికి పురి కొల్పాడు కృష్ణుడు. పేట్రేగాడు ప్రద్యుమ్నుడు. గద పట్టుకుని వజ్రనాభుడిమీది కురికాడు. వజ్రనాభుడూ గద ఎత్తాడు. ఇద్దరూ గదలతో కొట్టుకున్నారు. ఇద్దరూ మూర్ఛ పోయారు. అంతలో తెలువుకున్నారు. పొలిమేరనించే పాంచ

జన్యం పూరించాడు కృష్ణుడు. సుదర్శనం ప్రయోగించాడు ప్రద్యుమ్నుడు.

ధగధగా మెరిసిపోతూ వెళ్ళింది సుదర్శనం. లిప్తలో వజ్రనాభుడి తల నరికేసింది.

ఇటు వజ్రనాభుడి తల కిందపడిందో లేదో, సునాభుడి తల ఎగరగొట్టేశాడు గదుడు. అప్పటికే సాంబుడు వజ్రనాభుడి సైన్యాలు తునాతునకలు చేశాడు. రాజు తెగి పోడంతోనే మిగిలిన సేనంతా చేతులు జోడించి నిలబడి పోయింది.

వజ్రపురం చుట్టుపట్ల చిలవలు పలవలుగా సుపురం లాటివి ఎన్నో అన్ని పట్నాలున్నాయి. వాటితోకూడా వజ్రపుర రాజ్యం సకల సంపదలతోనూ ప్రద్యుమ్న, సాంబ, గదుల కుమాళ్ళకి పంచి ఇచ్చి, వాళ్ళ నక్కడ రాజులుగా అభిషేకించాడు కృష్ణుడు. అదంతా అయాక తాను ద్వారక వచ్చేశాడు.

ప్రద్యుమ్నుడూ, సాంబుడూ, గదుడూ మరో ఆరు మాసాలు వజ్రపురంలో వుండి, కొడుకుల రాజ్యం స్థిర పడ్డాక, ద్వారక వచ్చేశారు.

వజ్రపురరాజ్యం చిరకాలం మేరుపర్వతానికి ఉత్తరంగా ఎదుగుతూ వచ్చింది.

# జలక్రీడ

సముద్రంలో జలక్రీడ జరపడంకోసం పిండారక తీర్థానికి బయలుదేరాడు కృష్ణుడు. ఉగ్రసేనుణ్ణీ, వసుదేవుణ్ణీ ద్వారకలో వుంచి యాదవులందరినీ బయలుదేరదీశాడు.

రుక్మిణీ, సత్యభామా, జాంబవతీ, కాళిందీ, నాగ్నజితీ, భద్రా, లక్షణా, మిత్రవిందా — ఎనమండుగురు దేవేరులూ, పదహారు వేలమంది భార్యలూకూడా వెళ్ళారు. బలరాముడు రేవతితో విడిగా బయలుదేరాడు. యాదవ కుమాళ్ళందరు తమ తమ భార్యలతో పయనమయారు.

వ్రజపురంనించీ, ఇతర చోట్లనించీ పట్టుకు వచ్చిన వేశ్యలు వందలు వందలు వెంట వచ్చారు. అందరూ అందంగా ముస్తాబులు చేసుకున్నారు. అంతమందీ అలా తర్లి వస్తూవుంటే అపురూపమైన శోభగా అవుపించింది.

కబురంది సుభద్రతో అర్జునుడూ అక్కడికి వచ్చాడు.

పెద్ద మంచినీళ్ళ సరస్సులా నిర్మలంగా వుంది సముద్రం. ప్రశాంతంగానూ వుంది. ఎంతోమేర మెడలోతు నీళ్ళతో వుంది.

పదహారువేల ఎనమండుగురు భార్యలతోనూ నీటిలోకి దిగాడు కృష్ణుడు. ఉల్లాసంగా జలక్రీడ మొదలెట్టాడు. అంత మందితోనూ అన్నిరూపులా చెట్టాపట్టాలు పట్టాడు. నీటిలో సంయాట లాడాడు. వలపులు కులికించాడు. ప్రతి భార్యా తనతో కృష్ణుడున్నాడనుకునేది. తననే వలిచాడనుకునేది.

తన రొమ్ముల గోటినొక్కులు చూసి మురిసిపోయేది. పెదవుల పంటినొక్కులికి గగుర్పొడిచేది.

నల్లమబ్బు జడివాన కురిసినట్టు అంతమందిమీదా నీళ్ళు చల్లేవాడు కృష్ణుడు. అంతమందీ అతడిమీద నీళ్ళు చల్లేవారు. కిలకిలా నవ్వేవారు. కేరింతలు కొట్టేవారు.

కుమాళ్ళందరూ తమతమ స్త్రీలతో నీళ్ళలో దిగారు. విచ్చలవిడిగా జలకేళి సలిపారు. అంతమందీ వుల్లి పొరలాటి పల్చటి బట్టలు కట్టుకున్నారు.

కొందరు ఈతకొట్టారు. కొందరు మునుగుతూ తేలారు. కొందరు నిలువీతలీదారు. కొందరు వెల్లకిలా ఈదారు. కొందరు బారలతో ఈదారు. కొందరు మునుగీత లీదారు.

కొందరు పడవలమీద వెళ్ళారు, నావలమీద వెళ్ళారు. ఆ పడవలూ, ఓడలూ కొన్ని హంసల్లా వున్నాయి. కొన్ని నెమళ్ళలా వున్నాయి. కొన్ని ఏనుగుల్లాగా, లొట్టిపిట్టల్లాగా వుండేవి.

కొందరు పాటలు పాడారు. కొందరు ఆటలాడారు. కొందరు వాద్యాలు వాయించారు.

"అమ్మో! పడిపోయాం, పడిపోయాం, పట్టుకోండి, పట్టుకోండి" అంటూ కొందరు స్త్రీలు మగల మెడలు పట్టుకు వేలాడారు. కొంతమంది కిలకిలా నవ్వారు. చప్పట్లు చరిచారు.

రేవతితో విడిగా నీటిలో క్రీడించాడు బలరాముడు.

సముద్రం నీలాకాశంలాగా, కృష్ణుడు చంద్రుడిలాగా, ఎనమండుగురు దేవేరులూ గ్రహాలలాగా, పదారు వేలమంది భార్యలూ నక్షత్రాల్లాగా అవుపించారు.

## నా వ కే ళి

ఎర్రపొద్దుపడింది. బంగారం పూతపోసినట్టు కనపడింది సముద్రం. జలకేళి చాలించాడు కృష్ణుడు. అంతమందీ వొడ్డుకి వచ్చారు. మంచి మంచి పొడిబట్టలు కట్టుకున్నారు. మైపూతలు పూసుకున్నారు. పూలదండలు వేసుకున్నారు. కృష్ణుడు పసుపురంగు పట్టుబట్టలు కట్టుకున్నాడు. బలరాముడు నీలిరంగు పట్టుబట్టలు కట్టుకున్నాడు. ఆడంగులు పద్మాల పట్టుచీరెలూ, రత్నాల రవికలూ కట్టుకున్నారు.

అంతమందీ మంచి మంచి పిండివంటలు తిన్నారు. మాంసాలతో మద్యపానం చేశారు. మద్యపానంలో బలరాముడిదే పైచేయి.

అనంతరం నావకేళి మొదలుపెట్టాడు కృష్ణుడు. రకరకాల నావలు సిద్ధమయాయి. నవరత్నాలు చెక్కిన నావలవి. కొన్ని నిడివిగా వుంటే కొన్ని చౌకమైనవి. కొన్ని చక్రంలా వుంటే కొన్ని పలకలుగా వుండేవి. మరికొన్ని స్వస్తికాకారమైనవి. కొన్ని గరుడపక్షుల్లాగా, కొన్ని నెమలిపిట్టల్లాగా, చిలకపిట్టల్లాగా చిత్రచిత్రంగా వుండేవి. కొన్ని రకరకాల మృగాల్లా వుండేవి. కొన్ని మరీ పెద్దవిగా, ఎంతోమంది పట్టడానికి వీలుగా వుండేవి. అవసరమైన అన్ని పదార్థాలతోనూ నిండివుండేవవి. ప్రతిదానికీ చుక్కాని

మనిషి వుండేవాడు. ప్రతి నౌకలోనూ తెల్లచిలకలు పాడుతూ వుండేవి. నెమళ్ళు ఆడుతూ వుండేవి. చలీ, వేడీ లేకండా పిల్లగాలులు వీస్తూ వుండేవి.

కొన్ని నావలు చక్కని సవారీలలాగ వుండేవి. కొన్ని మేడల్లాగా, మిద్దెలలాగా వుండేవి. కొన్ని మండపాలలాగా, మండువాలలాగా వుండేవి. కొన్ని కొండల్లా వుండేవి.

కొన్ని నావలు సముద్రం చీల్చుకుంటూ చువ్వల్లా పరిగెత్తాయి. ఒకదాంతో ఒకటి పోటీ పడ్డాయి. కొన్ని కెరటాల మీాద హంసల్లా తేలాడాయి. కొన్ని అల్లిబిల్లిగా పాముల్లా పరిగెత్తాయి. కొన్ని అడ్డదిడ్డంగా, కొన్ని మండలాకారంగా తిరిగాయి. వాట్టి రంగురంగుల జెండాలు రెపరెపలాడుతూ పిట్టల్లా ఎగిరాయి.

యాదవ కుమాళ్ళందరు తమతమ భార్యలతో తనివి తీరా క్రీడించారు. పాటలు పాడారు, ఆటలాడారు.

సరదాతీరా నావకేళి జరిపాక బయటికి దిగి భార్యలతో ఒడ్డుకి వచ్చేశాడు కృష్ణుడు. అలాగే యాదవు లందరూ వచ్చేశారు. అంతమందీ స్నానాలు చేశారు. తెల్ల మడతలు కట్టుకున్నారు. గంధాలు రాసుకున్నారు. ముస్తాబులు చేసుకున్నారు. పూలదండలు వేసుకున్నారు.

## చాలిక్య గానం

భార్యలందరితోనూ కృష్ణుడూ, రేవతితో బల రాముడూ, సుభద్రతో అర్జునుడూ, తమ తమ భార్యలతో

ప్రద్యుమ్నుడూ, సాంబుడూ మొదలైన కృష్ణుడి కుమారుళ్ళూ, బలరాముడి కుమారుళ్ళూ, సాత్యకీ, అక్రూరుడూ మొదలైన యాదవ నాయకులూ, తక్కిన యాదవులందరూ తమ తమ స్త్రీలతో కలిసి భోజనాలచోటికి చేరారు.

అప్పటికే వంటలు సిద్ధం చేసి పెట్టారు వంటవాళ్ళు. అంతమందీ పిండివంటలతో, మాంసంకూరలతోనూ, తృప్తిగా భోజనాలు చేశారు. శూలాలతో గుచ్చి వండిన పిట్టల మాంసాలు తిన్నారు. ఇనప పుల్లలతో గుచ్చి నేతిలో వండిన రకరకాల మృగాల మాంసాలు తిన్నారు. మైరేయం మొదలైన రకరకాల సారాలు కుత్తుకబంటిగా తాగారు.

అనంతరం సభతీర్చి సంగీతాలు పాడారు. కృష్ణుడు తన 'ఝల్లీసకం' అనే పిల్లనగోవి మోయించాడు. విశ్వ మోహనంగా పాడింది ఝల్లీసకం పిల్లనగోవి. తాగుడు మత్తులో స్త్రీలు మరింత మత్తుతో నృత్యం చేశారు. దిశలు పులకరించాయి. సముద్రం పొంగులు వారింది.

అంతమంది యాదవులూ, ఆడా, మగా తాగినా ఉద్ధవుడూ, మరి కొందరు మాత్రం ఆ పొంతకు పోలేదు. పళ్ళరసాలతో మాత్రమే తృప్తిపడ్డారు వారు.

పిల్లనగోవి పాట చాలించి ప్రద్యుమ్నుడి వేపు చూశాడు కృష్ణుడు. తండ్రి ఇంగితం గ్రహించాడు ప్రద్యుమ్నుడు. ఛాలిక్యగానం మొదలుపెట్టాడు.

కృష్ణుడికి ఎంతో ఇష్టమయిన గాంధర్వ గానం ఛాలిక్యగానం. తానే ఇది ఈ లోకంలో వ్యాప్తి చేశాడు.

తాను నేర్చి ఇతరులకి నేర్పాడు. తన తరవాత బల రాముడూ, ప్రద్యుమ్నుడూ, అనిరుద్ధుడూ, సాంబుడూ ఈ గానంలో పేరుపడ్డారు. వారున్నూ తక్కినవారికి నేర్పారు.

ఛాలిక్యగానం తన్మయం కలిగిస్తుంది; సుఖం కలి గిస్తుంది; శుభమూ కలిగిస్తూంది. వెనకటికి రేవతుడు అని ఒక గంధర్వులరాజు ఈ ఛాలిక్యగానం వింటూ యుగాలు దినాలుగా గడిపేశాడట.

ఈ గానంతో జరిపే క్రీడ ఛాలిక్యక్రీడ. పిల్లలకీ, పెద్దలకీ,అందరికీ నచ్చిన క్రీడ ఛాలిక్యక్రీడ.

ప్రద్యుమ్నుడు ఛాలిక్యగానం సాగిస్తున్నా, యావ న్మందీ తన్మయులై వింటున్నారు. ఇంతలో ద్వారకనించి వేగిరావులు కబురు తెచ్చారు.

## భానుమతి

వజ్రపురం వజ్రనాభుడికి నికుంభుడని మరో తమ్ము డుండేవాడు. షట్పురం అతడి నివాసం. అతడు ఉత్తర కురు భూమిలో తపస్సుచేసి, మూడు శరీరాలు పొందాడు. మాయలో ఘటికుడు, మంచి బలవంతుడు కూడా.

వజ్రనాభుణ్ణి చంపేసి, ప్రభావతిని పట్టుకుపోయారని, యాదవుల మీద పగపట్టాడు నికుంభుడు. యాదవులు పిండా రక క్షేత్రం వెళ్ళారని తెలిసి ద్వారక వచ్చాడు. అవుపడ కుండా అంతఃపురంలో చొరబడ్డాడు.

అంతఃపురాలలో కన్యలు కిమాత్రమున్నారు. జలకేళి

పిండారకం వెళ్ళలేదు వాళ్ళు. పోతుటీగ లోపలికి పోకండా కాపలా కాస్తున్నారు కావలిభటులు. మాయచేసి కనపడ కండా దూరాడు నికుంభుడు. రెండు శరీరాలు షట్పురం లోనే విడిచి ఒక శరీరంతో వచ్చాడతడు. అవుపడకండా అంతఃపురం ఉపవనంలో ఒక పొదరింట్లో కూచున్నాడు.

కొంచేపటికి అక్కడికే తిరుగుతూ వచ్చింది భాను మతి. భానుడి కూతురామె. అందాలబరిణ. నిండు యౌవ్వన వతి కన్య.

దొంగచాటున వచ్చి ఆమెని పట్టుకున్నాడు నికుం భుడు. కెవ్వుమంది భానుమతి. కేకలు వేసింది. పెద్దపెట్టున ఏడ్చింది, గింజుకుంది.

అంతఃపురమంతా విరగబడింది. ఉగ్రసేనుడూ, వసు దేవుడూ పరిగెత్తుకు వచ్చారు.

భానుమతి ఏడుపు వినబడుతూవుంది. ఆమె కాని, నికుంభుడు కాని అవుపడలేదు. వెంటనే బేగీరావుల్ని పిలిచి కృష్ణుడి దగ్గిరికి కబురు పంపాడు ఉగ్రసేనుడు.

అదిగో ఆ బేగీరావులే పిండారక క్షేత్రంలో ఛాలిక్యగానంలోవున్న కృష్ణుడి దగ్గిరికి కబురు పట్టుకు వచ్చారు.

కబురు వినడమే తడువు, అర్జునుడితో కలిసి ద్వారక బయలుదేరాడు కృష్ణుడు. అతడి అడుగుల్లో అడుగులు వేస్తూ ప్రద్యుమ్నుడూ బయలుదేరాడు.

వారు వచ్చేసరికి భానుమతిని ఎత్తుకుపోతున్నాడు నికుంభుడు. వెంట తరిమారు వారు.

గోకర్ణ క్షేత్రంలో భానుమతిని విడిచిపెట్టి షట్పురం పారిపోయాడు నికుంభుడు. వెంటపడ్డారు కృష్ణార్జునులు.

భానుమతిని ద్వారక చేర్చి, షట్పురం వచ్చాడు ప్రద్యుమ్నుడు.

ఈ ముగ్గురితో హోరాహోరి పోరాడాడు నికుంభుడు. తుదకి సుదర్శనచక్రంతో అతడి తల నరికేశాడు కృష్ణుడు. ద్వారక తిరిగివచ్చి పాండవుల చిన్నతమ్ముడికి-సహదేవుడి కిచ్చి భానుమతిని పెళ్ళిచేశాడు.

## కాపిత్థులు

వసుదేవుడికి బ్రహ్మదత్తుడని ఒక స్నేహితుడుండే వాడు. ఇద్దరూ చిన్నప్పుడు ఒక్క గురువు దగ్గరే చదువుకున్నారు.

బ్రహ్మదత్తుడు మంచి పండితుడు. యాజ్ఞవల్క్యుడి శిష్యుడు. వేదాలూ, వేదాంగాలూ తెలిసినవాడు. బుద్ధిమంతుడు. అతడికి కొంతమంది కూతుళ్ళుండేవాళ్ళు. అంతమందీ అందగత్తెలు.

వసుదేవుడి సాయంతో ఓమారు పెద్ద యజ్ఞం తలపెట్టాడు బ్రహ్మదత్తుడు. పడాది యజ్ఞమది.

షట్పురం ఆవర్తనది ఒడ్డున యజ్ఞశాల తయారయింది. యాజ్ఞవల్క్యుడూ, వ్యాసుడూ, సుమంతుడూ,

జైమినీ, జాబాలీ, దేవలుడూ - ఇంకా ఎంతోమంది మునులూ వచ్చారు. ద్వారకనించి దేవకీవసుదేవులూ వచ్చారు.

పట్పురంలో కాపిత్థులని దానవులుండేవారు. బలవంతులు వాళ్ళు. కపిత్థవృక్షాల (వెలగచెట్ల) కింద తపస్సు చేశారు వాళ్ళు. అందుకని కాపిత్థులయారు. బ్రహ్మదత్తుడి యజ్ఞం దగ్గిరికి వాళ్ళుకూడా వచ్చారు. ఎంతో ధనం ఖర్చుపెడుతున్నాడు యజ్ఞదత్తుడు. అతడి దగ్గిర రత్నాలు చూశారు కాపిత్థులు. అతడి కూతుళ్ళనీ చూశారు. వాళ్ళ నోరూరింది.

"బ్రహ్మదత్తా!" బింకంగా అడిగారు వాళ్ళు. "అందంగా వున్నారు మీ అమ్మాయిలు. వీళ్ళని మాకిచ్చెయి. వీళ్ళతో నీ రత్నాలూ కావాలి."

కాపిత్థుల నాయకుడు నికుంభుడు. "అవును. కాళ్ళు కడిగి కన్యాదానం చెయ్యి. కట్నాలూ, కానుకలూ ఇయ్యి. కాదంటావా, నీ యజ్ఞం గిజ్ఞం తగలబెట్టేస్తాం. అంతేకాదు; యజ్ఞంలో మాకూ వాటా ఇవ్వాలి" అంటూ గద్దించాడు.

"నికుంభా!" నెమ్మదిగా చెప్పాడు బ్రహ్మదత్తుడు, "అల్లరి చెయ్యకండి. మీరు కోరినన్ని రత్నాలిస్తాను. కావలిస్తే తీసుకోండి. నా కూతుళ్ళు కావాలనడం కూడదు. యజ్ఞంలో వాటా మీకు లేదు. దుడుకుతనానికి దిగితే మీరే చెడతారు. చూడండి, వసుదేవుడిక్కడే వున్నాడు. యాదవుల ప్రభువు కృష్ణమూర్తి నాపాలి దేవుడు."

"అలాగా?" కవ్వించి నవ్వారు కాపిత్థులు. యజ్ఞ

శాల వూడ పెరికారు. బ్రహ్మదత్తుడి కూతుళ్ళకోసం మాటు కాశారు.

కృష్ణుడికి వుప్పందింది. ప్రద్యుమ్నుణ్ణి ఆగమేఘాల మీద పట్నం పంపాడు.

"ప్రద్యుమ్నా! చప్పున పట్నంవెళ్ళు. నువ్వు శంబరుడి దగ్గిర నేర్చిన మాయకి పనిపడిందిప్పుడు. బ్రహ్మదత్తుడి కూతుళ్ళు కాపిత్థులకి కనపడకండా చెయ్యి. మాయ కన్యలు కల్పించు. నీ అడుగుల్లో అడుగులు వేసి నేనూ వస్తున్నాను. తాతా, నానమ్మా అక్కడే వున్నారు, జాగ్రత్త" అన్నాడు.

తండ్రిగారు చెప్పడమే తడువు, పట్నంలో వాలాడు ప్రద్యుమ్నుడు. తాతగారికి ధైర్యం చెప్పాడు. బ్రహ్మదత్తుణ్ణి ఓదార్చాడు. అతడి కూతుళ్ళని అవుపడకండా చేశాడు. అచ్చంగా అలాటివాళ్ళనే మాయకూతుళ్ళని సృష్టించాడు. కాపిత్థుల కంటపడ్డారు మాయకన్యలు. పట్టుకుపోయి గంతులు వేశారు కాపిత్థులు. భద్రంగా సాగింది బ్రహ్మదత్తుడి యజ్ఞం.

దేశదేశాల రాజులు యజ్ఞానికి వచ్చారు. అందరినీ గౌరవించాడు బ్రహ్మదత్తుడు. ఘనమైన ఆతిథ్యమిచ్చాడు.

బ్రహ్మాండమైన వ్యక్తి బ్రహ్మదత్తుడు. అయిదువందల మంది భార్యలతడికి. అందులో బ్రాహ్మణ భార్యలు రెండు వందలమంది. క్షత్రియ స్త్రీలు వందమంది. కోమటి పడుచులు వంద. శూద్ర స్త్రీలు నూరుగురు. ప్రతి భార్యకీ ఒక కొడుకూ, ఒక కూతురూ పుట్టారు.

అయిదువందల కూతుళ్ళూ అయిదువందల రత్నాలు.

అందాల చందమామలు. వారిలో నాలుగువందల కూతుళ్ళని ఎంచి ఎంచి, మంచి మంచి రాజులకిచ్చి పెళ్ళిచేశాడు. మిగిలిన వందమందినీ ఈ యజ్ఞసమయంలో రాజులకిచ్చి పెళ్ళి చేయాలని పిలిపించాడు. వాళ్ళకోసమే కలబడ్డారు కాపిత్థులు. మాయకన్యల్ని పట్టుకుపోయారు.

బ్రహ్మదత్తుడి యజ్ఞానికి జరాసంధుడూ, శిశుపాలుడూ, దంతవక్త్రుడూ, మాళవుడూ, రుక్మీ, ఆహ్వృతీ, నీలుడూ, ధర్ముడూ, విందుడూ, అనువిందుడూ, శల్యుడూ, శకునీ, కర్ణుడూ, కౌరవులూ, పాండవులూ, ఇంకా ఎందరో రాజులూ, షట్పురం వచ్చారు. వీరిలో కొందరు బ్రహ్మదత్తుడి కన్యల కోసం నికుంభుడితో చేతులు కలిపారు. మాయకన్యల్ని కొందరు పంచుకున్నారు. పాండవులు మాత్రం ఆ పొంతకి పోలేదు.

ఆ కన్యలందరూ అందగత్తెలు మాత్రమే కాదు. అప్సరసలలాగ ఆటపాటలు నేర్చినవారు.

ఎత్తుకువచ్చిన కన్యల్ని లంచమిచ్చి ఎంతోమంది రాజుల్ని వశపరుచుకున్నాడు నికుంభుడు. వసుదేవుడి సాయంతో బ్రహ్మదత్తుడు తమమీదికి యాదవుల్ని తర్లించుకు వస్తాడని ముందే సిద్ధపడ్డాడు. కాపిత్థసేనంతా కట్టుదిట్టం చేశాడు.

ఇంతలో పెద్ద యాదవసేన వేసుకుని షట్పురం వచ్చాడు కృష్ణుడు. ఆవర్తనది ఒడ్డున మంచి విశాలమైన ప్రదేశంలో డేరాలు వేయించాడు. శిబిరం కట్టుదిట్టం చేయించాడు.

మర్నాడు ఉదయం యాదవులందరు రణభేరి వేయిం చారు. కవచాలు వేసుకుని, ఆయుధాలు పట్టుకుని సింహ నాదాలు చేశారు. పాండవులు యాదవులతో చేరారు. యజ్ఞం కాపాడడానికి వారిని నియమించాడు కృష్ణుడు.

గదుడూ, సాంబుడూ కలిసి మకరవ్యూహం పన్నారు. సారణుడూ, ఉద్ధవుడూ, సాత్యకీ, భోజుడూ, వైతరణుడూ, అనాధృష్టీ, అనిరుద్ధుడూ, చారుదేష్ణుడూ, విపృథువూ, కృతవర్మా, దంష్ట్రిడూ, విచక్షుడూ, అరిమర్దనుడూ - ఇంకా కొందరు యోధులూ వ్యూహం కీలకస్థానాల్లోనూ, ముందు వెనకల్లోనూ, నిలబడ్డారు. పట్నురం ముంచెత్తే సముద్రంలా నడిచింది మకరవ్యూహం. దానికి నాయకుడు యాదవవీరుడు అనాధృష్టి.

కయ్యానికి కాలుదువ్వుతూనే కాసుక్కూచున్నారు కాపిత్థులు. ఏనుగులమీదా, ఎనుపోతులమీదా, గాడిదల మీదా, గుర్రాలమీదా "బప్పరి సింగా" అంటూ బయలు దేరారు. కొంతమంది మొసళ్ళమీద కూచున్నారు. కొంత మంది తాబేళ్ళమీద కూచున్నారు. కొందరు ఒంటెల మీాదెక్కారు.

ఆ రాణువంతటకీ నాయకుడు నికుంభుడు. పెద్ద రథం మీాద బుసకొడుతూ వచ్చాడు.

శిశుపాలుడి నాయకత్వంకింద దుర్యోధనుడూ, అతడి తమ్ములూ, రుక్మీ, శల్యుడూ, శకునీ, భగదత్తుడూ, జరా సంధుడూ, సుశర్మా, విరాటుడూ నికుంభుడి సహాయానికి వచ్చారు.

యాదవసేనా, కాపిత్థసేనా కలబడ్డాయి. బాణాలూ, పరిఘలూ, పట్టిసాలూ, శతఘ్నులూ - రకరకాల ఆయుధాలతో కొట్టుకున్నాయి.

మాయాయుద్ధం మొదలెట్టాడు నికుంభుడు. కనపడకండా అయిపోయాడు. పట్నంలో మాయగుహాలు కల్పించాడు. ధృష్టినీ, కృతవర్మనీ, చారుదేష్ణుడూ, భోజుడూ, వైతరణుడూ, రుక్షుడూ, సనత్కుమారుడూ, ఉల్ముకుడూ మొదలైన వారినీ ఆ గుహాలలో కట్టేశాడు.

అది కనిపెట్టి కృష్ణుడూ, బలరాముడూ, ప్రద్యుమ్నుడూ, అనిరుద్ధుడూ మండిపడ్డారు. గుడ్లురిమాడు కృష్ణుడు. ధనుస్సు సంధించాడు. విషనాగుల్లాటి బాణాలు కుమ్మరించాడు.

వందలు వందలు, వేలు వేలు కూలిపోయారు కాపిత్థులు. రాళ్ళూ రప్పలూ, మాళ్ళూ మాకులూ, ముసలాలూ ముద్గరాలూ వాన కురిపించారు. గావుకేకలు వేశారు. గొల్లు గొల్లు చేశారు. జడివాన లెక్కచెయ్యని ఆబోతులా వాటిని రవంతా లెక్క చెయ్యలేదు కృష్ణుడు. వరసపెట్టి పగవాళ్ళని పడగొట్టాడు. అగ్గిపిడుగుల బాణాలు కురిపించాడు.

నిలవలేకపోయింది నికుంభుడి దండు. కకావికలయిపోయింది. కాళ్ళకి బుద్ధిచెప్పింది.

నికుంభుడి కంటే మాయలో ఏడాకులు ఎక్కువ చదివాడు ప్రద్యుమ్నుడు. పెద్ద మాయసారంగం కల్పించాడు. తానుమాత్రం కనిపించకండా కాపిత్థులకి సాయం వచ్చిన మొనగాళ్ళని ఒక్కొక్కణ్ణీ ఆ సారంగంలోకి పడదోశాడు.

మాయపాశాలతో బంధిచాడు. అలా తన మాయతోనే కర్ణుణ్ణీ, దుర్యోధనుడూ, దుశ్శాసనుడూ, భీష్ముడూ, శకునీ, శల్యుడూ మొదలైన వారినీ; నీలుడూ, ద్రుపదుడూ, విరాటుడూ, విందాను విందులూ మొదలైన వారినీ; జరాసంధుడూ, శిశుపాలుడూ, త్రిగర్తుడూ, రుక్మీ, భగదత్తుడూ, వాసంతుడూ, మొదలైనవారినీ సారంగంలో కట్టేసి పెట్టాడు. వారిని కనిపెడుతూ వుండమని అనిరుద్ధుణ్ణి నియమించాడు. వారి రథాలూ, ఏనుగులూ గుర్రాలూ, ఆయుధాలూ అన్నీ లాక్కున్నాడు. ఆ వూపున వచ్చి, కాపిత్థ సేనమీద విరుచుకు పడ్డాడు. బాణాలవాన కురిపించాడు.

అటు కృష్ణుడూ, ఇటు ప్రద్యుమ్నుడూ, చిచ్చుల పిడుగుల్లా రెచ్చిపోడంతోనే మరింత జర్జరిల్లిపోయింది నికుంభుడి చతురంగసేన. దిక్కూ తెన్నూ తెలీకుండా పిక్కబలిము చూపింది. పారిపోతున్న వాళ్ళని చూశాడు, విప్పాలు కళ్ళాడు నికుంభుడు. పౌరుషం పురెక్కించాడు. మళ్ళించాడు. ఎలాగో నిలబడింది నికుంభు సేన.

ఇంతలో కొంత సేన బ్రహ్మదత్తుడి యజ్ఞంమీదికి నడిచింది. అయిదుగురూ అయిదు కొండల్లాగా నిలబడ్డారు పాండవులు. వచ్చిన కాపిత్థులందరినీ నరికి నరికి రక్తం నదులు పారించారు.

ఆ రక్తం నదుల్లో కాపిత్థుల జుత్తులే నాచు. రథ చక్రాలు తాబేళ్ళు. రథాలు సుడిగుండాలు. ఏనుగులు కొండలు. ఈటెలూ, జెండాలూ, చెట్లూ, ఏదుపులూ మొర్రలూ పురుములు.

నిలువునా మండిపోయాడు నికుంభుడు. మళ్ళీ మాయ లంకించుకున్నాడు. అవుపడకండా అర్జునుడిమీాదా, మిగిలిన పాండవులమీాదా అగ్నిబాణాలు కుమ్మరించాడు. కృష్ణుడి మీాదా అలాగే కురిపించాడు.

కృష్ణుడు ధ్యానదృష్టితో చూశాడు. నికుంభుడి మాయ మాయమయింది. అందరికీ అతడు అవుపించాడు. అవుపించడంతోనే అర్జునుడు గాండీవం సారించాడు. పిడుగుల్లాంటి బాణాలు కొట్టాడు. కానీ ఒక్కటీ నికుంభుణ్ణి దూసుకుపోలేదు. వంకరపోయి కింద పడిపోయాయి.

ఆశ్చర్యపోయాడు అర్జునుడు. కృష్ణుణ్ణి అడిగాడు.

"ఏమిటీ చిత్రం!"

"తపస్సుచేసి సంపాదించిన శక్తి" నవ్వుతూ చెప్పాడు కృష్ణుడు. "తపస్సుచేసి మూాడు శరీరాలు సంపాదించాడు వీడు. వెనక మేము వజ్రనాభుడ్ని చంపిన పగ పెట్టుకుని మా భానుడి కూతుర్ని భానుమతిని ఎత్తుకుపోయినప్పుడు వీడి ఒక శరీరం నాశనం చేసేశాను. మరో శరీరం తపస్సులో వుండి వీడ్ని కాపాడుతూ వుంది. అంచేతే నీ బాణాలు పని చేయడంలేదు. వీడికాలం దగ్గిర పడింది"

కృష్ణుడి మాటలు విన్నాడు నికుంభుడు. పట్నంలోకి పారిపోయాడు. పట్నంలోనే అతడి అసలు శరీరం తపస్సులో వుంది. భయంకరమయిందది.

నికుంభుడ్ని వెంట తరుముతు వెళ్ళాడు కృష్ణుడు.

ఒక చీకటి సొరంగంలో చొరబడ్డాడు నికుంభుడు. విడవకండా వెంటపడ్డాడు కృష్ణుడు.

వెళుతూ వెళుతూ ఎదురు తిరిగాడు నికుంభుడు. పెద్ద పరిఘ తీసి కృష్ణుడిమీాద విసిరాడు. కృష్ణుడు గద విసిరాడు. పరిఘ తగిలి కృష్ణుడూ, గద తగిలి నికుంభుడూ జుమాలుమని పోయారు. అంతలోనే జల్దుకున్నారు. యుద్ధానికి సిద్ధపడ్డారు.

ఇంతలో బలరాముడూ, పాండవులూ అక్కడికి వచ్చారు.

మాయచేసి నికుంభుడు గుహల్లో కట్టిపెట్టిన రాజుల్ని, యాదవుల్ని ప్రద్యుమ్నుడు విడిపించాడు. తాను బంధించిన కర్ణుడూ, దుర్యోధనుడూ మొదలయిన వాళ్ళనీ విడిపించాడు. సిగ్గుపడి తలలు వొంచుకున్నారు కౌరవులు.

కృష్ణుడూ, నికుంభుడూ ఎంతోసేపు యుద్ధం చేశారు. రకరకాల ఆయుధాలతో కొట్టుకున్నారు.

చివరికి సుదర్శన చక్రం తీశాడు కృష్ణుడు. గురిచూసి విసిరాడు. తళతళా మెరుస్తూ మెరుపులు మెరుస్తూ వెళ్ళింది సుదర్శనం. నికుంభుడి తల నరికేసింది.

సింహనాదాలు చేశారు యాదవులు. శంఖాలు పూరించారు పాండవులు. కనపడకండా పారిపోయారు కాపిత్థులు.

బ్రహ్మదత్తుడి అశ్వమేధం అడ్డూ ఆపూ లేకండా పూర్తయింది. అతడికి పట్నపురం దఖలు పరిచి, పరివారంతో ద్వారక వచ్చేశాడు కృష్ణుడు.

పట్నపురం కాపిత్థ కన్యకల్ని, అందగత్తెల్ని, యావనవతుల్ని యాదవకుమాళ్ళు ద్వారకానగరం తెచ్చుకున్నారు.

కృష్ణుడిచ్చిన ఎన్నో రథాలూ అవీ పాండవులు తెచ్చుకున్నారు.

దుర్యోధనుడూ మొదలయినవారు దుఃఖపడుతూ ఇళ్ళకి మళ్ళారు.

## పరాచికం

ఇంతమంది భార్యలున్నా ఎవతెనీ నొప్పించేవాడు కాడు కృష్ణుడు. ప్రతి ఇల్లాలూ తానే భాగ్యవంతురాలు అనుకునేట్టు నటించేవాడు. ప్రేమించేవాడు. మురిపించేవాడు. మురిసిపోయేవాడు. పరియాచకాలాడేవాడు. ఉలికించేవాడు. ఉబ్బించేవాడు. కృష్ణప్రేమలో తమ్ముతాము మరిచిపోయేవారు వాళ్ళు.

"రుక్మిణీ!" ఓనాడు ఆమెతో అన్నాడతడు, "ఏం చూసి నన్ను కట్టుకున్నావు చెప్పూ! చిన్న రాజునయినా కాను నేను. శిశుపాలుడిలాటి మామా రాజుల్ని కాదని నా వెంట వచ్చేశావు. కబురుపెట్టీ మరీ నన్ను రమ్మన్నావు. అన్నకి అవమానమయినా ఓర్చుకున్నావు. పాపం, తిరిగీ ఇంటి మొహం చూడలేదు మీ అన్న! మారాజుని కట్టుకుంటే మారాణీవయేదానివి. రాజ్యాలేలేదానివి! ఇప్పుడైనా చెప్పు, మించిపోయింది లేదులే. మారాణివి కావాలనుంటే-"

వినలేకపోయింది పాపం రుక్మిణి. తట్టుకోలేకపోయింది పరియాచికం. కన్నీళ్ళతో తెలివితప్పి పడిపోయింది.

నాలిక కరుచుకున్నాడు కృష్ణుడు. ఆమెని పొదివి పట్టుకున్నాడు. ఉపచారాలతో తెలువుకున్నట్టు చేశాడు.

"పరియాచికానికే ఇలా అయిపోతారా ?"

"పరియాచికమా ఇది"

వెక్కి వెక్కి ఏడ్చింది రుక్మిణి.

"నీ నోట ఈ మాట వినాలనే అన్నాను, అంతే. నాకు తెలీదూ, నువ్వు నా రాణివి" అంటూ బుజ్జగించాడు కృష్ణుడు.

"మహారాణిని కావాలన్నానా నేను !" మెల్లిమెల్లిగా కళ్ళు తుడుచుకుంటూ అంది రుక్మిణి, "నీ రాణిని కావాలనే నీ వెంట వచ్చాను. నిలకడలేని సంపదలమీద ఎన్నడూ లేదు నాకు. నిన్ను ప్రేమిస్తున్నానూ అంటే నీ ఈ లలాటమూ, నేత్రాలూ, మీసమూ, గెడ్డమూ – ఈ అందమూ చూసికాదు. ఏదో చెప్పలేని - దానికోసమే ప్రేమిస్తున్నాను. ప్రపంచంలోని ఐశ్వర్యమంతా దానిముందు దిగదుడుపు. రాజ్యాలూ, సామ్రాజ్యాలూ అన్నీ దాని కాలిగోటికి పోలవు." అంటూ తల వంచుకుంది.

"ఇదిగో ఇది వినడానికే వుడికించాను" అంటూ ఆమెని దగ్గిరికి తీసుకున్నాడు కృష్ణుడు.

కృష్ణుడి భార్యలందరిలోనూ అభిమానవతి సత్యభామ. ఈసుకి పెట్టిందిపేరు. తనంత అందకత్తె వేరొకతె లేదని గర్వం. కృష్ణుడు ముప్పొద్దులా తనదగ్గరే వుండాలనీ, తన తోనే గడపాలనీ ఆమె కోరిక. ఆమె దగ్గిర అలాగే నటించే వాడు కృష్ణుడు.

ఓనాడు పారిజాతపుష్పం రుక్మిణికి కృష్ణుడిచ్చాడని ందామె. తోకతొక్కిన పాములాగ లేచింది. నగలూ అవీ

తీసి పారేసింది. మొహాన కుంకుం చెరిపేసుకుంది. మాసిన చీరకట్టి, అలకగదిలో పడుకుంది.

కృష్ణుడు వచ్చి బుదిరించాడు. తుదకి పారిజాతం చెట్టే తెచ్చి ఆమె పెరట్లో నాటాడు.

అలా అంతమంది భార్యల్నీ ఆనందపరుస్తూ కాపరం చేస్తూ వుండేవాడు. సత్యభామమాత్రం అప్పుడప్పుడు ఉపద్రవం తెస్తూనే వుండేది. కృష్ణుణ్ణి తన కొంగుని ముడికట్టుకోవాలని "పుణ్యకవ్రతం" వంటి వ్రతాలూ చేసేది.

## జరాసంధుడి అంతం

ఇంద్రప్రస్థంలో కృష్ణుడు చెప్పివచ్చిన ప్రకారం ధర్మరాజుకోసం సభ తయారుచేశాడు మయుడు. అంతా బంగారంతోనూ, రకరకాల రత్నాలతోనూ తయారయిందది. నీళ్ళున్నచోట లేనట్టూ, లేనిచోట వున్నట్టూ, ద్వారం లేనిచోట వున్నట్టూ, వున్నచోట లేనట్టూ భ్రాంతి కలిగించేదది. ఎక్కడా అంత చిత్రమైన సభ లేదు.

మయసభతో ధర్మరాజు కీర్తి మరింత హెచ్చింది. దాంతో రాజసూయం చేయాలని సంకల్పం కలిగిందతనికి. అందుకని ఇంద్రసేనుణ్ణి కృష్ణుడి దగ్గరికి ద్వారక పంపాడు.

అందెవేసిన సారథి ఇంద్రసేనుడు. ఆగమేఘాలమీద వచ్చి కృష్ణుణ్ణి దర్శించాడు.

కాలకృత్యాలు తీర్చుకుని, ముస్తాబు చేసుకుని, సుధర్మ సభలో కూచున్నాడు కృష్ణుడు. తన వాళ్ళ మంచిచెడ్డలు

విచారించాడు. ప్రజల కష్టసుఖాలు ఆలకించాడు. మంత్రులతో మంతనాలు సలిపాడు. కళలూ శాస్త్రాలూ చర్చించాడు.

ఇంతలో ఇంద్రసేనుణ్ణి చూసి ఎంతో ఆదరించాడు. ఇంద్రప్రస్థంలోని అందరి క్షేమం విచారించాడు.

"ఏం, తొందరపని కలగలేదు కదా?"

చిరునవ్వుతో అడిగాడు.

చేతులు జోడించి చెప్పాడు ఇంద్రసేనుడు.

"నీ సెలవు ప్రకారం మయసభ తయారయింది. నీ దర్శనం కోరుతూ వుంది.

ధర్మరాజు రాజసూయం చేయాలనుకుంటున్నాడు. నీ సెలవు కావాలి. దయచేయమని నన్ను పంపాడు."

ఇంద్రసేనుడి నోట్లో మాట నోట్లోనే వుంది. మగధ నించి ఒక మనిషి వచ్చి చేతులు జోడించి నుంచున్నాడు.

"ఎవరు?" అన్నట్లు చూశాడు కృష్ణుడు.

"ప్రభూ! జరాసంధుడు మగధ గిరివ్రజంలో ఖైదు చేసిన రాజులు పంపిన దూతని నేను. జరాసంధుడు వెనక దిగ్విజయం చేసినప్పుడు, అతడి అడుగులికి మడుగులొత్తని రాజుల్ని ఇరవయి వేలమందిని బంధించి చెరసాలలో పెట్టి హింసపెడుతున్నాడు. బంధీలయిన రాజులందరూ పంపుకున్న విన్నపం చిత్తగించు. కృష్ణప్రభూ! జరాసంధుడి బంధిఖానాలో అష్టకష్టాలూ అనుభవిస్తున్నాం. చావుబతుకుల్లో వున్నాం. ఈ దుర్మార్గుడు బలివేయకముందే మమ్మల్ని బతి

కించు. నీ వాళ్ళం మేం. నీ నీడ కోరుతున్నాం. నువ్వు తప్ప ఇంకే దిక్కు లేదు మాకు."

మగధ మనిషి సందేశం విన్నాడు కృష్ణుడు. ఉద్ధవుడూ, విత్రుడుడూ, విదూరథుడూ బభ్రుడూ, మొదలైన మంత్రుల వేపు తిరిగి 'ఏమంటారు?' అన్నట్టు చూశాడు.

అందరిలోకీ బుద్ధిమంతుడు ఉద్ధవుడు. కృష్ణుడి పరమ నేత్రం వంటివాడు. ఇలా అందుకున్నాడతడు:

"ఇటు ఇంద్రప్రస్థం నించీ, అటు మగధనించి ఒక్క మారే వచ్చారు దూతలు. కాగల కార్యం గంధర్వులే తీరుస్తారిక. రాజుల రక్షణా, ధర్మరాజు రాజసూయం ఒక్కపనితోనే నెరవేరతాయి. అంతేకాదు మన పక్కలో బల్లెమూ ముక్కలవుతుంది. రాజులందరినీ గెలిచినవాడే రాజసూయం చెయ్యాలి. అందరిలోకీ బలవంతుడు జరాసంధుడు. అతణ్ణి గెలిస్తే కడమరాజులు ఇట్టే తలవొగ్గుతారు.

జరాసంధుడు ఆయుధాలతో చావడు. ద్వంద్వ యుద్ధంలో దారికి వస్తాడు. ధర్మరాజు తమ్ముడు భీముడు దానికి తగినవాడు."

యాదవ సభంతా ఉద్ధవుడ్ని సమర్థించింది. ఇంద్రప్రస్థం పయననుయాడు కృష్ణుడు. రథం సిద్ధం చేశాడు దారుకుడు.

మగధ మనిషిని సాదరంగా సెలవిచ్చి పంపాడు కృష్ణుడు. "వెళ్ళు, రాజులకి ధైర్యం చెప్పు. మీ కష్టాలు గట్టెక్కడానికి ఎంతో కాలం పట్టదు - అని నా మాటగా

చెప్పు" అన్నాడు. రథమెక్కి తన రాణువతో ఇంద్రప్రస్థం వచ్చాడు.

అతడు వస్తాడని ఇంద్రప్రస్థం ముస్తాబు చేసిపెట్టారు. జనం బారులు తీర్చి నుంచున్నారు. వీధి గుమ్మాల్లోనూ, మేడలమీదా ఆడంగులు కళ్ళప్పగించి నుంచున్నారు. చీరెలు జారిపోతున్నా, కొప్పులు విడిపోతున్నా, చెంగులు ఎగిరి పోతున్నా కానుకోలేదు వాళ్ళు.

ఎదురు వచ్చారు పాండవులు. ధర్మరాజుకి నమస్కరించాడు కృష్ణుడు. భీమార్జునుల్నీ, నకుల సహదేవుల్నీ గుచ్చి కౌగిలించుకున్నాడు. వారి వందనాలందుకున్నాడు. లోగిలిలోకి వెళ్ళి మేనత్త కుంతికి నమస్కరించాడు. చెల్లెలు సుభద్రనీ, ద్రౌపదినీ ఆదరించాడు. వారి వందనాలందుకున్నాడు.

కృష్ణుడి వెంట అతడి భార్యలూ, పరివారమూ వచ్చారు. ఎవరికి తగిన మర్యాదలూ, సత్కారాలూ జరిగించారు పాండవులు.

కుశల ప్రశ్నలూ అవీ అయాక ఓనాడు కృష్ణుడితో కూడా కొలువులో కూచున్నాడు ధర్మరాజు. తమ్ములు భీముడూ, అర్జునుడూ, నకులుడూ, సహదేవుడూ ఎవరి స్థానాల్లో వారు కూచున్నారు.

కులాసాగా అందరూ కూచున్నాక, కృష్ణుడ్ని చూస్తూ నెమ్మదిగా అందుకున్నాడు ధర్మరాజు:

"కృష్ణా! మా వాళ్ళందరూ రాజసూయం చెయ్యమంటున్నారు నన్ను. అది కష్టసాధ్యమని ఎరుగుదును.

అయినా నీ ఆసరాతో అభిలాష పడుతున్నాను. నువ్వు ఏం చెపితే అది చేస్తాను. నువ్వు కాదంటే ఆ జోలికి పోను. ఆదేశించు" అన్నాడు.

"ఎదురులేని సంకల్పం నీది." అంటూ ఎత్తుకున్నాడు కృష్ణుడు, "రాజసూయానికి తగిన సాధన సంపత్తి అంతా వుంది నీకు. అయితే రాజసూయం చేయవలిసినవాడు సమ్రాట్టు కావాలి. సమ్రాట్టు కావాలంటే రాజులందరినీ గెలవాలి. దిగ్విజయం చేయాలి. నీ నలుగురు తమ్ములూ నాలుగు దిక్కులూ గెలుచుకు వస్తారు. సందేహం లేదు. అయితే వున్న రాజుల బలాబలాలు విచారించాలి. పగవాడెవడో లెక్క వేయాలి.

భీష్ముడు, దుర్యోధనుడు, ద్రోణుడు, కృపుడు, కర్ణుడు, రుక్మి, ఏకలవ్యుడు, శ్వేతుడు, శకునీ వీరాధివీరులు. కాని వీరు నీకు అడ్డురారు.

మా యాదవులలో పద్ధెనిమిది వేలమంది జ్ఞాతులున్నారు. అందరికందరూ బలవంతులు. బలరాముడు, సాత్యకీ, ప్రద్యుమ్నుడు, సాంబుడు, చారుదేష్ణుడు, చారుదేవుడు అతిరథులు. కృతవర్మా, ఉగ్రసేనుడు, అనాధృష్టీ, సమీకుడు, సమితింజయుడు, కంకుడు, శంకుడు, కుంతిభోజుడు మొదలైనవారు మహారథులు. వీరున్నా నీకు అడ్డురారు.

మేం పురూరవ వంశం వారమంటే మేం ఇక్ష్వాకు వంశం వారమంటూ అక్కడక్కడ మీసాలు మెలివేస్తున్న రాజులు వంద వంశాల వారన్నా వుంటారు. యయాతి

వంశంవారూ, భోజవంశంవారూ హెచ్చుగానే వున్నారు. భగదత్తుడూ, పురజిత్తూ, వంగ, పుండ్ర, కిరాత దేశాల రాజులూ, ఛేదిరాజు భీష్మకుడూ, పౌండ్రకుడూ, వీళ్ళంతా అదుగో ఆ జరాసంధుడికి దాసులు. అతడికి భయపడి భోజ వంశం పద్ధెనిమిది కులాలూ ఉత్తరాదికి పారిపోయాయి. శూర సేన, భద్రకార, శాల్వ, పడిచ్చర, కుళింద, కుంతి, శేల్వా యన రాజులు దక్షిణాదిని తలదాచుకున్నాయి. దక్షిణ పాంచాలం, తూర్పు కుంతిభోజ, కోసల, మత్స్య దేశాల రాజులు, పాంచాలం వాళ్ళూ పలాయనం చిత్తగించారు. శిశుపాలుడంతటివాడు జరాసంధుడి సేనానిగా కుదురు కున్నాడు. దంతవక్త్రుడూ, అతగాడి బానిస.

ఇదంతా చూస్తే ధర్మరాజా, జరాసంధుడే ఇప్పుడు బలశాలి. అతడే సమ్రాట్టు. ఇంతెందుకూ, మా సంగతే చూడు. వాడితోనే వేగలేక పుట్టినవూరు మధుర వొదిలేసి, సముద్రంలోకి పారిపోయాం. కనక జరాసంధుడున్నంత వరకూ నువు సమ్రాట్టువి కాలేవు. రాజసూయం చెయ్య లేవు.'' అన్నాడు కొంచేపు ఆగి మళ్ళీ అందుకున్నాడు :

''అలా అని ఆగిపోనక్కరలేదు. దేనికయినా ఉపాయం వుండనే వుంటుంది. నేనూ, అర్జునుడూ, భీముడూ, వెళతాం. జరాసంధుణ్ణి అంతంచేసి వస్తాం. ఎంతోమంది రాజుల్ని చెరలోవుంచాడు వాడు. వాళ్ళందరినీ విడిపిస్తాం. నీ రాజ సూయానికి పిలుస్తాం. ఈ రాజుల్ని బలికోసమే బంధించాడు వాడు. అనుకున్నదానికి నూటికి ఇరవైపాళ్ళు తక్కువున్నారు

రాజులు. వెల్తే పూర్తికాగా అందరినీ బలివేసి తన వ్రతం పూర్తిచేయాలని వాడి సంకల్పం.

ఆయుధాలతో చావడు జరాసంధుడు. మల్ల యుద్ధంలో చస్తాడు. భీముడు వాణ్ని చీల్చి చంపుతాడు. జర సంధించిన రెండు చెక్కలూ రెండుగా చీల్చడమే దీనికి ఉపాయం. కనక మా ముగ్గురమూ మగధ, గిరివ్రజం వెళ్ళ డానికి అనుమతించు."

భీమార్జునులతో కలిసి బ్రాహ్మణవేషం వేసు కున్నాడు కృష్ణుడు. కొండలూ, అడవులూ, ఏళ్లూ, వూళ్ళూ దాటి వాళ్ళతో గిరివ్రజం వెళ్ళాడు. బ్రహ్మలతో కలిసి జరాసంధుడ్ని చూచాడు.

కండలు తిరిగిన వీరి ముగ్గిరి శరీరాలూ, తీరుతెన్నులూ చూచాడు జరాసంధుడు, అనుమానిస్తూనే అడిగాడు:

"ఏం కావాలి?"

"యుద్ధం కావాలి." అన్నాడు కృష్ణుడు.

"ఎక్కడో విన్నట్టేవుంది నీ గొంతుక, ఎవరు నువ్వు? క్షత్రియుడివా?"

"అవును, కృష్ణుడంటారు నన్ను. నీకు తెలిసినవాణ్ణే. ఇతడు భీముడు, ఇతడు అర్జునుడు. నీతో ద్వంద్వయుద్ధం కోరివచ్చాం. విరగబడి నవ్వాడు జరాసంధుడు.

"నా పేరంటే తోకముడిచిన పిరికిపంద కృష్ణుడివేనా? యుద్ధం కావాలా? సరదా పుట్టిందా? ఇస్తాను. యుద్ధమే ఇస్తాను, రా! కాని మళ్ళీ పారిపోకండామాత్రం నిలబడు. వంటింటి కుందేలువి, ఎటుపోతావు! ఇది గిరివ్రజం. నేను

జరాసంధుణ్ణి, అయితే పిరికి పారుబోతుల్తో చెయ్యిచేసుకోను. కనక నీతో కాదు. ఇదిగో వీడు, ఈ భీముడు కంటికి ఆనుతున్నాడు కొంచెం. వీడితో పోట్లాడతాను, రమ్మను.”

జబ్బచరిచాడు జరాసంధుడు. భీముడి వీపుతట్టాడు కృష్ణుడు.

గిరివ్రజం వూరి పొలిమేర మైదానంలో జరాసంధుడూ, భీముడూ పోట్లాడారు. గదలతో ద్వంద్వయుద్ధం చేశారు. మల్లయుద్ధం కుస్తీపట్లు పట్టారు. ఆబోతుల్లాగ, ఏనుగుల్లాగ దెబ్బలాడారు. పగళ్ళు పగపట్టి పోరాడేవాళ్ళు, రాత్రుళ్ళు మిత్రుల్లా వుండేవాళ్ళు. అలా ఇరవయ్యేడు పగళ్ళు పోట్లాడారు. ఎవర్ని ఎవరూ గెలవలేకపోయారు.

మర్నాడు యుద్ధానికి సిద్ధపడుతూ “జరాసంధుడిని చంపలేను” అన్నాడు భీముడు.

“పద” అన్నాడు కృష్ణుడు.

జరాసంధుడితో చేతులు కలిపాడు భీముడు. కృష్ణుడి వేపు చూశాడు. చిన్నకొమ్మ పట్టుకుని, చీల్చిపడేశాడు కృష్ణుడు.

జల్దుకున్నాడు భీముడు. జరాసంధుడిని పడదోశాడు. అతడి ఒకకాలు తన కాలితో అణిచిపెట్టాడు. రెండోకాలు రెండుచేతులతోనూ పట్టుకుని బలంకొద్దీ చీల్చేశాడు. రెండు చెక్కలయిపోయాడు జరాసంధుడు. ప్రాణం వదిలేశాడు.

జరాసంధుణ్ణి భీముడిచేత అలా చంపించి, చెరలోని రాజులందరినీ విడిపించాడు కృష్ణుడు.

అంతమంది రాజులూ వచ్చి కృష్ణుడి అడుగులమీద వాలారు. కన్నీళ్ళతో అతడి అడుగులు కడిగారు. పరిపరి విధాల స్తోత్రాలు చేశారు. అంతకాలమూ తాముపడ్డ కష్టాలన్నీ మరిచిపోయారు.

అందరినీ ఆదరించాడు కృష్ణుడు. ధైర్యం చెప్పాడు. వారు ఖైదులో వేసుకున్న మురికిగుడ్డలు తీయించి విలువైన వస్త్రాలు ఇప్పించాడు. నగలు ముస్తాబు చేయించాడు. మంచి విందు భోజనాలు పెట్టించాడు. "ధర్మం తప్పకండా రాజ్యాలు పాలించండి" అంటూ ప్రబోధించాడు. అందరికీ అన్ని రథాలిప్పించి వారి వారి దేశాలకి సాగనంపాడు. మగధకి జరాసంధుడి కొడుకుని సహదేవుణ్ణి రాజు చేశాడు. అతడిచ్చిన విలువైన కానుకలు పుచ్చుకున్నాడు.

జరాసంధుడి దగ్గిర 'సోదర్యం' అని గొప్ప రథముండేది. ఇద్దరు రథికులు కూచుని యుద్ధం చేయదగిన రథమది. ఎంతమంది ఏకమై వచ్చినా ఓడించగలదది. దాన్ని తన వశం చేసుకున్నాడు శ్రీకృష్ణుడు. అదంతా అయాక భీమార్జునులతో కలిసి ఇంద్రప్రస్థం వచ్చేశాడతడు.

పట్నం పొలిమేర చేరగానే పాంచజన్యం పూరించాడు కృష్ణుడు. పౌండ్రకం పూరించాడు భీముడు. దేవదత్తం పూరించాడు అర్జునుడు.

మూడు శంఖాలూ విన్నాడు ధర్మరాజు. గెలుపు సాధించి కృష్ణుడు భీమార్జునులతో వచ్చేశాడు అని తెలుసుకున్నాడు. ఉన్నపాళాన లేచాడు. తమ్ములతోనూ, మంత్రులతోనూ ఎదురు వెళ్ళాడు.

భీమార్జునులతో ధర్మరాజుకి నమస్కరించాడు కృష్ణుడు. ముగ్గురినీ కౌగిలించుకున్నాడు ధర్మరాజు.

అలా తన పగవాడ్ని జరాసంధుడ్ని పాండవులచేత అంతం చేయించి, ధర్మరాజు రాజసూయానికి అడ్డులేకండా చేసి, పరివారంతో ద్వారక తిరిగి వచ్చేశాడు కృష్ణుడు. జరాసంధుడు చచ్చాడనగానే ఎగిరి గెంతేశారు యాదవులు.

## బృందావనంలో బలరాముడు

ఉన్నట్టుండి బృందావనం గొల్లపల్లె వెళ్ళాలని దీవి పుట్టింది బలరాముడికి. కృష్ణుడితో చెప్పి, వెనకటి కోనారి వేషం వేసుకుని, రథంమీద బయలుదేరాడు. చిన్నప్పుడు ఆడుతూ, పాడుతూ తిరిగిన బృందావనం చూడగానే అతడి తనువు పులకరించింది. ఆనాటి దినాలు తనువుకి వచ్చాయి. అదే యమున. అదే గోవర్ధనం. అదే గొల్లపల్లె. అవే ఆల మందలు. ఒళ్ళు మరిచిపోయాడు బలరాముడు.

"బలరామయ్యా! బలరామయ్యా!" అంటూ పల్లెపల్లె పరిగెత్తుకు వచ్చారు.

నందుడికీ, యశోదకీ నమస్కరించాడు బలరాముడు. కన్నీళ్ళతో కావలించుకున్నారు వారు. కరువుతీరా ముద్దులాడారు.

"ఎన్నాళ్ళకి కనిపించావు బాబూ! నీ తమ్ముడు కృష్ణుడు కులాసాగా వున్నాడా? మీరు కంటపడక కళ్ళ వెలుగే మాసి పోయిందయ్యా! పెద్దవాడి వయిపోయావు. అమ్మనీ, నాన్ననీ తలుచుకుంటాడా బాబూ, కృష్ణుడు.

నీలాగే పెద్దవాడయ్యుంటాడు మాకన్న." ఇలా అడిగిందే అడుగుతూ, అతడి తెల్లటి శరీరం నిమురుతూ వుక్కిరి బిక్కిరి చేసేశారు.

అన్ని ప్రశ్నలూ వింటూ, అన్నిటికీ అన్ని జవాబులూ చెప్పాడు బలరాముడు. తనకంటే పెద్దలైన కోనార్లందరికీ దండాలు పెట్టాడు. చిన్నవాళ్ళని దీవించాడు. కొందరిని గుచ్చి కౌగిలించుకున్నాడు. అందరినీ కుశలమడిగాడు. ఎవరిని ఏ వరసతో పిలవాలో ఆ వరసతో పిలిచాడు. ఆ వావితో మాటలాడాడు.

"మమల్ని మరిచేపోయావు రామయ్యా!" చనువుగా, స్నేహంగా అన్నారు వాళ్ళు, "కృష్ణయ్యా అంతే! పట్నం చేరిన ప్రతివాళ్ళూ అంతేలే, మీ మేడలముందు మా గుడిసెలు కనబడవు. మీ రథాలముందు మా ఎడ్ల బండ్లు కనపడవు. మీ ఏనుగులూ, గుర్రాలముందు మా ఆల మందలూ అవుపడవు."

నవ్వుతూ అవన్నీ విన్నాడు బలరాముడు ఆనందించాడు.

"ఏది ఏమైనా వ్రేపల్లి నేను పుట్టినచోటు. తమ్ముడూ నేనూ ఇక్కడే పెరిగాం. ఏమాత్రమయినా మేం ప్రయోజకులమయామంటే అదంతా మీ చలవ. మేం మీవాళ్ళం. మీరు మా వాళ్ళు" అంటూ వాళ్ళని సంతోషపరిచాడు బలరాముడు.

బలరాముడు వచ్చాడంటే సంబరపడ్డారు గొల్లభామలు. "ఒక్కడే వచ్చాడా?" అంటూ పరిగెత్తుకు

వచ్చారు. అతడి చుట్టూ మూగారు. "దారితప్పి వచ్చావా రామయ్యా? ఇన్నాళ్ళకి తనువులో పడిందా బృందా వనం? తమ్ముడు రాలేదా? ఆయనెందుకు వస్తాడులే! ఇక్కడెవ్వరున్నారుగనుక! పట్నం వన్నెల విసనకర్రల ముందు గొల్లపడుచులూ, పల్లెగుంటలూ ఏం పనికొస్తారు?

ఎంత మాయకాడయ్యా మీ నల్ల తమ్ముడూ! నమ్మించి గొంతులు కోశాడు. అన్నీ నమ్మాం. ఒక్క మాటా నిలకడలేదు. అన్నీ నీటిమీద రాతలే.

విన్నామయ్యా, విన్నాం. ఎనమండుగురు రాణీల్ని పెళ్ళాడాడు. పదహారువేల రాజు కూతుళ్ళని కట్టుకున్నాడు. పిల్లా జెల్లా కన్నాడు. మమ్మల్ని మరిచిపోయాడు" అంటూ వెక్కి వెక్కి ఏడ్చారు. ఇంకా ఇలా అన్నారు:

"మా ఇళ్లూ, వాకిళ్లూ వొదిలేశాం. మగళ్ళని వొదులుకుని అతగాడి వెంట పడ్డాం. నువ్వెరగంది ఏముందికనక. ఆ యమునలో తానాలూ, ఇసుకతిన్నెల సలాపాలూ, వెన్నెల రాసక్రీడలూ, తలుచుకుని తలుచుకుని కుమిలిపోతున్నామయ్యా కుమిలిపోతున్నాం" అంటూ మరింత ఏడ్చారు.

నెమ్మదిగా ఓదార్చాడు బలరాముడు. కృష్ణుడు వారితో చెప్పమన్న మాటలు చెప్పి వినిపించాడు. వసంత కాలమంతా బృందావనంలోనే వున్నాడు. అక్రూరుడితో మధుర వెళ్ళినప్పటినుంచీ అంతవరకూ తాము చేసినవన్నీ కథలలాగ చెపుతూ, పాత నేస్తాలతో గడిపాడు. మద్యం తాగుతూ మత్తెక్కి తిరిగాడు. తాను తాగడమేకాక గొల్ల

భామలచేతా తాగించాడు. వాళ్ళతో తోటల్లోనూ, యమున ఇసక పర్రలలోనూ క్రీడించాడు.

ఒకనాడు బృదావనం అడివిలో కూచుని చిత్తుగా తాగి, గోపికలతో తాగించి, ఆ మత్తులో ఏమేమో చేశాడు. ఉన్నట్టుండి జలక్రీడకి బుద్ధిపుట్టింది. దూరాన యమున పారుతూవుంది. తాగిన మత్తులో "రావే యమునా దగ్గిరికి రా!" అన్నాడు. రాలేదు యమున. అంతేసి గుడ్లుచేసి లేచాడు. తన నాగలితో తవ్వితవ్వి యమునని బృందావనం పెరటిదాకా పారినట్టు చేశాడు. తాగినవాడితో తగువేమిటి అన్నట్టు అలాగే పారుతూ వచ్చింది యమున.

అలా తాగుతూ, గొల్లభామలతో రమిస్తూ, జలక్రీడ లాడుతూ బృందావనంలో కొన్నాళ్ళు గడిపి ద్వారక వచ్చేశాడు బలరాముడు.

## "హస్తిన గంగలో కలిపేస్తా"

దుర్యోధనుడికి లక్షణ అని ఒక కూతురుండేది. కృష్ణుడి కొడుకుల్లో సాంబుడు ఆమెని వలచి పెళ్ళిచేసుకోవాలనుకున్నాడు. కాని దుర్యోధనుడు ఇష్టపడలేదు. స్వయంవరం చాటించాడు. ఒడుపుచూసి లక్షణను ఎత్తుకురాబోయాడు సాంబుడు. పట్టుకున్నారు కౌరవులు.

సామాన్యుడుకాడు సాంబుడు. ఒక్కడే అయినా కౌరవులతో పోరాడాడు. వాళ్ళని ఏడుచెరువుల నీళ్ళు తాగించాడు. కాని కర్ణుడూ మొదలైనవారు ఒక్కసారి

మీదపడ్డారు. లక్షణతో కూడా సాంబుణ్ణి పట్టేసి తీసుకు పోయారు. కదలనివ్వకుండా కట్టిపడేశారు.

ద్వారకలో సాంబుడు కనపడలేదు. కలవరపడింది జాంబవతి. అంతటా వెదికారు యాదవులు. కౌరవులు కట్టి పడేశారని కబురు తెలిసింది తుదకి.

మండిపడ్డారు యాదవులు. హస్తిన ముట్టడికి బయలు దేరారు. కత్తులూ, కటార్లూ సవరించారు. "బప్పరిసింగా" అంటూ పొలికేకలు వేశారు. అట్టుడికినట్టు వుడికిపోయింది ద్వారక.

"ఆగండి" అన్నాడు బలరాముడు. "నేను వెళతాను. వాళ్ళు దారికి రాకపోతే అప్పుడు వుండనేవుంది దండో పాయం" అంటూ రథమెక్కి హస్తిన బయలుదేరాడు. ఉద్ధవుడూ మొదలైన కొద్దిమందినిమాత్రం వెంట తీసుకు వెళ్ళాడు. పట్నంబయటే వుండి, ఉద్ధవుణ్ణి ధృతరాష్ట్రుడి దగ్గిరికి పంపాడు.

బలరాముడు వచ్చాడంటే గౌరవించినా, సాంబుణ్ణి మాత్రం విడిచిపెట్టమన్నారు కౌరవులు. అంతేకాదు, అన రాని మాటలూ అని అవమానించారు.

భగ్గుమన్నాడు బలరాముడు. హస్తిన గంగలో కలి పేస్తాను అంటూ నాగలి తీశాడు. నాగలి మొనతో హస్తినా నగరం పెల్లగించాడు. ఊగిసలాడిపోయింది హస్తిన. భూకంపం పుట్టినట్టయింది. పట్టణమంతా దడదడలాడింది. కంగారు పడిపోయారు కౌరవులు. సాంబుడి కట్లు విప్పేశారు.

లక్షణతో కూడా అతణ్ని తెచ్చి బలరాముడి ఎదట పెట్టారు. మన్నించమని వేడుకున్నారు.

నాగలి నిలిపేశాడు బలరాముడు. వధూవరుల్ని కట్నాలూ, కానుకలూ ఇచ్చి సాగనంపారు కౌరవులు. పన్నెండువేల ఏనుగులూ, పదివేల గుర్రాలూ, ఆరువేల రథాలూ అరణమిచ్చాడు దుర్యోధనుడు.

అదిగో అవాళ బలరాముడు నాగలి మొనతో పెల్లగించడం చేతనే ఇప్పటికీ ఏటవాలుగా వుంటుంది గంగవేపు హస్తిన.

## పౌండ్రకవాసుదేవుడు

కరూశదేశం రాజు పౌండ్రకవాసుదేవుడు. అతడి చుట్టూ చేరినవాళ్ళు అతణ్ని "నీ అంతవాడు లేడని పొగిడే వారు. అవుననుకునే వాడతడు. వసుదేవుడి కొడుకు కనక కృష్ణుణ్ని వాసుదేవుడనేవారు. "అదేమిటి? ఇద్దరు వాసు దేవులేమిటి? నేనే అసలు వాసుదేవుణ్ని" అనేవాడు పౌండ్ర కుడు. కృష్ణుడిలాగే కిరీటం పెట్టుకునేవాడు. శంఖం, చక్రం, గదా, ధనుస్సూ పట్టుకునేవాడు. కృష్ణుడిలాగే తన చక్రం పేరు సుదర్శనమనీ, గదపేరు కౌమోదకమనీ, ధనుస్సు శార్ఙ్గ మనీ, శంఖం పాంచజన్యం అనీ చెప్పుకునేవాడు. కృష్ణుడిలాగే పసుపురంగు పట్టుబట్ట కట్టుకునేవాడు. పూలదండలు వేసు కున్నాడు. "నేనే, నేనే వాసుదేవుణ్ని. మరొకడు లేడంటూ

చాటుతూ వచ్చాడు. అంతతో వూరుకోలేదతడు. ఓనాడు కృష్ణుడి దగ్గిరికి దూతని పంపాడు.

"కృష్ణా! నిజమయిన వాసుదేవుడ్ని నేను. నువ్వు వాసుదేవుడివి కావు. ఇకనించి ఆ పేరు నువ్వు మాను కోవాలి. అంతేకాదు. నీ చక్రమూ, గదా, విల్లూ, శంఖమూ పారెయ్యాలి. ఇలా చేశావా సరేసరి, కాదంటావా, చంపే స్తాను." అని సందేశం పంపాడు.

దూత వచ్చి యాదవుల సభలో ఉగ్రసేనుడి ముందు సందేశం వినిపించాడు. నవ్వుకున్నారు యాదవులు.

మాటలతో మానుకోలేదు పౌండ్రక వాసుదేవుడు. ఓనాటి రాత్రి, ఏకలవ్యుడితోనూ, కాశీరాజుతోనూ కలిసి ద్వారకమీద దాడి చేశాడు. కృష్ణుడు లేడారాత్రి. ఏక లవ్యుడి కిరాతసేనా, పౌండ్రకుడి కరూశసేనా ద్వారక చుట్టు ముట్టాయి. బలరాముడూ, సాత్యకీ మొదలైన యాదవ వీరులు సేనలతోఎదిరించారు. తెల్లవారులూ ఘోరంగా జరి గింది యుద్ధం.

తూరుపు పలకబారుతూ వుండగా కృష్ణుడి పాంచ జన్యం వినిపించింది. యాదవసేన సముద్రంలా వుప్పొంగింది.

తనలాగే వేషం వేసుకుని, తనలాగే ఆయుధాలు పట్టు కుని బోరవిరుచుకు నించున్న పౌండ్రక వాసుదేవుడ్ని చూశాడు కృష్ణుడు. నవ్వాపుకోలేకపోయాడు.

అంతవరకూ సరాసరి సాత్యకితో పోరాడుతున్న పౌండ్రక వాసుదేవుడు కృష్ణుడివేపు తిరిగాడు. సేనల్ని

రెచ్చగొట్టాడు. గదలూ, ముద్గరాలూ, శస్త్రలూ, కత్తులూ కురిపించారు సైనికులు. బాణాలతో ముంచెత్తారు.

కనుబొమలు ముడిపెట్టారు కృష్ణుడు. ధనుస్సు మోగించాడు. బాణాలు సంధించాడు. పౌండ్రకసేన పడగొట్టాడు. కాశీరాజుసేన కణువు కొట్టాడు. సుదర్శనం ప్రయోగించాడు. ఏనుగులు పీనుగులు చేశాడు. గుర్రాలు కూలగొట్టాడు. రథాలు పిప్పిచేశాడు. సైనికుల తలకాయ లెగరగొట్టాడు. పగవాళ్ళ దండంతా పరుగులు తీసింది.

పౌండ్రక వాసుదేవుడి మీాదికే వురికింది కృష్ణుడిరథం.

"పౌండ్రకా! నీ మాటే నిజం. ఇద్దరు వాసుదేవులుండకూడదు" అంటూ చక్రం విసిరాడు కృష్ణుడు. పౌండ్రకుడి తల ఎగరగొట్టేసింది చక్రం. ఆగలేదు కృష్ణుడు. పౌండ్రకుడి తలకిందపడిందో లేదో కాశీరాజు తలా నరికిపారేశాడు. ఏకలవ్యుణ్ణీ, అతడి కిరాతసేననీ తరిమితరిమికొట్టాడు బలరాముడు. ఒక్క ఊపిరితో వుడాయించాడు ఏకలవ్యుడు.

కాశీరాజు కొడుకు సుదక్షిణుడు. తండ్రిచావు సహించలేకపోయాడు. ద్వారకమీాద దండెత్తాడు. సుదర్శనం వేసి, కాశీపట్నం కాల్చి వొదిలిపెట్టాడు కృష్ణుడు.

## గ్రహణం నాడు

ఆ ఏడు సూర్యగ్రహణం పూర్ణగ్రాసం వడింది. దేశమంతటినించీ జనం శమంతపంచకంలో స్నానాలు చేయడానికి కురుక్షేత్రం దిగబడ్డారు.

వెనక పరశురాముడు రాజుల్ని నరికి, వాళ్ళ రక్తంతో అయిదు మడుగులు పెట్టి, తర్పణం చేశాడట. ఆ అయిదు మడుగులే శమంతకపంచకం.

ద్వారకనించి ఉగ్రసేనుడూ, దేవకీవసుదేవులూ, బలరామకృష్ణులూ, అక్రూరుడూ, గదుడూ, ప్రద్యుమ్నుడూ, సాంబుడూ, కృష్ణుడి యావన్మంది భార్యలూ, బలరాముడి తల్లి రోహిణీ, భార్య రేవతీ మొదలైనవారు రథాలమీదా మేనాలమీదా వచ్చారు. యాదవుల సేనాధిపతి కృతవర్మా, మరి కొందరూ పట్నం కాపలాకోసం ద్వారకలోనే వుంటూ వచ్చారు.

బృందావనం గొల్లపల్లెనించి నందుడూ, యశోదా, అంతమందీ గొల్లభామలూ బళ్ళమీదా వాటిమీదా బయలుదేరి వచ్చారు. ఇక్కడైనా కృష్ణుడు కనపడడా? అని గొల్లభామల కుతూహలం.

హస్తినాపురంనించి భీష్ముడూ, ధృతరాష్ట్రగాంధారులూ, విదురుడూ తమ్ములతో దుర్యోధనుడూ, ద్రోణాచార్యుడూ, కృపాచార్యుడూ, అశ్వత్థామా మొదలైనవారు వచ్చారు.

ఇంద్రప్రస్థం నించి కోడళ్ళతోనూ, కొడుకులతోనూ కుంతీదేవి వచ్చింది.

కుండిననించి భీష్మకుడూ, మత్స్యదేశంనించి విరాటరాజూ, పాంచాలంనించి ద్రుపదుడూ వచ్చారు.

అలాగే కుంతిభోజుడూ, నగ్నజిత్తూ, పురజిత్తూ,

సాల్వుడూ, దృష్టకేతూ, దమఘోషుడూ, విశాలాక్షుడూ, యుధామన్యుడూ, సుశర్మా, బాహ్లికుడూ, మిథిల, మద్ర, కాశీ, కేకయ దేశాల రాజులూ వచ్చారు.

మత్స్య, కేరళ, ఉశీనర, కోసల, విదర్భ, కురు, సృంజయ, కాంభోజ, మద్ర, కుంతి, ఆనర్త దేశాల ప్రజలూ తండోపతండాలు వచ్చారు.

ఎవరి బంధువుల్ని వారు కలుసుకున్నారు. ఎవరి ఆప్తుల్ని వారు ఆదుకున్నారు. ఎవరి స్నేహితుల్ని వారు చేరదీశారు.

ఈ కలయికకి మంచి అవకాశం కల్పించింది గ్రహణం.

రామకృష్ణులు నందుడికీ యశోదకీ నమస్కరించారు. ఇద్దరినీ కన్నీళ్ళతో కౌగిలించుకున్నారు వాళ్ళు. కరువుతీరా ముద్దులాడారు. నన్ను "మరిచేపోయావు నాయనా!" అంటూ కృష్ణుణ్ణి పట్టుకుని ఏడ్చింది యశోద.

"ఎంత మారి పోయాడమ్మా!" అంటూ బొమ్మల్లాగ నిలబడిపోయారు నిచ్చెరపోతూ గొల్లభామలు. చెట్ల నీడల్లో ఏకాంతంగా అతడి దగ్గిర చేరారు. అతడి లావణ్యం కళ్ళతో తాగేస్తూ చూశారు. పెదవులు కరుచుకున్నారు. మనసా అతణ్ణి సందిటలోకి లాక్కున్నారు.

"ఎప్పుడయినా నేను తనువుకి వస్తుంటానా?" అంటూ చిరునవ్వులతో వాళ్ళని కౌగిలించుకున్నాడు.

"నా ప్రాణం ఒకటీ, మీరు ఒకటీ కాదు నాకు. ఎప్పుడూ నా మనసులోనే వున్నారు మీరు. నాకు తెలుసు మీ మనసులో వున్నానేను. శారీరక ప్రెమ ప్రేమకాదు.

మానసిక మయిందే ప్రేమ." అంటూ ఎన్నో చెప్పి వాళ్ళని తృప్తిపరిచాడు.

కృష్ణుడి భార్యల్ని గొల్లభామలూ, గొల్లభామల్ని కృష్ణుడిభార్యలూ ఒకళ్ళనొకళ్ళు చూసుకున్నారు.

దేవకీ, రోహిణీ యశోదని గౌరవంగా కలుసుకున్నారు.

"అమ్మా నాన్నా లేని పిల్లల్ని, పసికందుల్ని కన్న కొడుకుల్లాగ పెంచావు. నువ్వే నిజమైన తల్లివి" అంటూ కళ్ళనీళ్ళు పెట్టుకుంది దేవకి.

"చెల్లెలు ఏమయిందని ఒక్కమారూ అడిగావు కాదు కదా, అన్నయ్యా!" అంటూ వసుదేవుడి దగ్గిర చదికిలబడింది కుంతి.

కృష్ణుడి యావన్మంది భార్యలూ, ద్రౌపదీ మొదలైన పాండవులభార్యలూ, గొల్లభామలూ, తక్కిన ఆడంగులూ ఒక దగ్గిర మాటామంతీ ఆడుతూ కూచున్నారు. ఆ మాటా ఈ మాటా అయాక నవ్వుతూ కృష్ణుడి భార్యల్ని ద్రౌపది అడిగింది.

"ఎన్నాళ్ళయో అనుకుంటున్నాను. మా అన్నయ్య ఇంతమందిని పెళ్ళాడాడు కదా! ఈ పెళ్ళిళ్ళు ఎలా జరిగాయో వినాలనివుంది వదినెలూ! మీరేమీ అనుకోకపోతే మీ పెళ్ళినాటి ముచ్చట్లు వినిపిస్తే సంతోషిస్తాను. మళ్ళీ ఇంతమందిమి ఇలా ఒక్కదగ్గిర ఎలా కలుస్తాం? నువ్వు ముందు చెప్పమ్మా రుక్మిణీ!"

"అయితే ఆలకించు" అంటూ అందుకుంది రుక్మిణి.

"నన్ను శిశుపాలుడికి కట్టబెట్టాలని మా వాళ్ళ నిర్ణయం. మా అన్న రుక్మి మరీనీ. నా కిష్టంలేదు. చెప్పొద్దూ, తెగించి మీ అన్నయ్యకి కబురు పంపాను. సమయానికి వచ్చి నన్ను పట్టుకు వచ్చేశారు. పెద్ద యుద్ధమే జరిగింది. గెలుపూ, నేనూ మీ అన్నయ్యకే దక్కాం."

"మరి నీ మాట వదినా?" సత్యభామ నడిగింది ద్రౌపది.

"నన్ను ఇంకొకరికిస్తానని మాట ఇచ్చాడు మా నాన్న సత్రాజిత్తు. అయితే శ్యమంతకమణి అడివిలో పోగొట్టుకుని చచ్చిపోయాడు మా చిన్నాన్న. మీ అన్నయ్యే మా చిన్నాన్నని చంపేసి మణి ఎత్తుకుపోయాడని నింద మోపాడు మా నాన్న. అసలు మణి పట్టుకుపోయింది ఈ జాంబవతి తండ్రి. పదిమందిలో నిందపడలేక, అడివికి వెళ్ళి అన్నాళ్ళు దెబ్బలాడి మణి తెచ్చి మా నాన్నకిచ్చి నింద బాపుకున్నాడు మీ అన్నయ్య. ఊరికే నింద మోపాను కదా, అని నొచ్చుకుని, మీ అన్నయ్యకి నన్నిచ్చి తాళి కట్టించాడు మా నాన్న." అంది సత్యభామ.

"అవును, అక్కయ్య చెప్పినట్టు మణికోసం మా ఇంటికి వచ్చాడు మీ అన్నయ్య. మహాబలవంతుడు మా నాన్న. ఎన్నాళ్ళో దెబ్బలాడాడు, ఓడిపోయాడు. నన్నిచ్చి పెళ్ళిచేశాడు." అంది జాంబవతి.

"ఏముంది? నా స్వయంవరం జరిగింది. మా అన్న

దమ్ముల్ని ఓడించి నన్ను ఎగరేసుకు వచ్చాడు మీ అన్నయ్య." అంది మిత్రవింద.

"మరి నీ మాట వదినా! ?"నాగ్నజిత్తివేపు చూస్తూ అంది ద్రౌపది.

"బావనే పెళ్ళాడాలనుండేది నాకు. అయితే మా నాన్న చిత్రమైన స్వయంవరం చాటించాడు. ఎంపికచేసి ఏడుగిత్తలు జతపరిచాడు. ఎవ్వడికీ లొంగేవి కావవి. వాటిని అదుపులోపెట్టి ముకుతాడు వేసిన వారికి నన్నిచ్చి పెళ్ళిచేస్తా నన్నాడు. ఎంతోమంది వచ్చారు. వాటి కొమ్ములూ, వాటి బుసకొట్టడాలూ చూసి వెళిపోయారు. మీ అన్న వచ్చాడు. నేను చూస్తూనేవున్నాను ఏమవుతుందోనని. ఇట్టే వాటిపొగరు అణిచేసి ముకుతాళ్ళు వేసి పట్టుకున్నాడు. గొప్పగా జరిగింది మా పెళ్ళి" అంది నాగ్నజిత్తి. నగ్నజిత్తు కూతురు కనక నాగ్నజిత్తి. ఆమె అసలుపేరు సత్య.

"నాకూ మేనమామ కొడుకే కదా, మీ అన్నయ్య" అంది భద్ర. "బావనే పెళ్ళాడతా నన్నాన్నేను. ఏముందీ? పిలిచి కన్యాదానం చేశాడు మా నాన్న ధృతకేతుడు. బాగా సారె అదీ పెట్టి పంపాడు."

"మరి నా మాట చెపుతాను, విను" అంటూ ఎత్తుకుంది లక్షణ. "నీ స్వయంవరంలాగే నా స్వయంవరం లోనూ మత్స్యయంత్రం పెట్టించాడు మా నాన్న బృహత్సేనుడు. మీ యంత్రంలో చేప కనపడేదట. మాది కడవ నీటిలో మాత్రం నీడగా అవుపడేది. నీడచూసి, కనపడని చేపని గురిచేసి కొట్టాలి. ఎంతెంతవాళ్ళో వచ్చారు. వెళ్ళి

పోయేవాళ్ళు. అందరినీ చూసేదాన్ని. మగధ, అవంతి, ఛేదిదేశాల రాజులు వచ్చారు. భీముడూ, దుర్యోధనుడూ, కర్ణుడూ, అర్జునుడూ వచ్చారు. కర్ణుడూ, అర్జునుడూ విల్లు తీశారు. నారి తొడిగారు. కర్ణుడు గురి కానలేకపోయాడు. అర్జునుడు గురి కనిపెట్టినా, చేప కొట్టలేకపోయాడు. అప్పుడు మీ అన్నయ్య వచ్చి, గురి చూసి, చేప పడగొట్టేశాడు. నా నోము పండింది.

నన్ను రథంమీద పట్టుకు వస్తుంటే, కళ్ళు కుట్టిన మచ్చరగొట్టు రాజులు కొందరు కుమ్మక్కయి, దారికి అడ్డం వచ్చారు. అందరినీ తోకలు ముడిపించి ద్వారక నన్ను తీసుకువచ్చాడు మీ అన్నయ్య. ఇదీ నా పెళ్ళి ముచ్చట." అంది.

"ఇంక మిగిలింది మీ మాటే, కానివ్వండి" అంటూ పదహారువేలమంది రాస పడుచుల వేపు చూసింది ద్రౌపది.

"ఖైదే కన్నవారిల్లయింది మాకు. పెళ్ళిలో" అంటూ అందుకుంది ఒకామె. "నరకుడు మా తండ్రుల్ని ఓడించాడు. మమ్మల్ని ఖైదులో పెట్టాడు. ముద్దూ ముచ్చటా మరిచిపోయాం. తిండికీ, గుడ్డకీ వాచిపోయాం. ఓమారు మూాల కొండకోనలో బంధించాడు వాడు. మా పుణ్యాం పండి, మీ అన్నయ్య వచ్చాడు. వాణ్ణి చంపేసి, మా చెర విడిపించి పుణ్యాం కట్టుకున్నాడు. దిక్కులేని మాకు దిక్కు కలిగించాడు. మమ్మల్ని పెళ్ళి చేసుకున్నాడు. ఆయన పాద సేవకయినా తగని మేం ఆయన ఇల్లాళ్ళమని చెప్పు కుంటున్నాం.

కృష్ణుడిమీద అంతమంది భార్యలూ కనపరిచిన ప్రేమా, అనురాగమూ విని మెచ్చుకుంది ద్రౌపది. సుభద్రా మొదలైనవారు ఆశ్చర్యపోయారు. గొల్ల భామలు కుతూహలంగా విన్నారు.

వసుదేవుడు, నందుడు, బలరామకృష్ణులు, పాండవులూ మొదలైనవారు ఓ దగ్గిర మాట్లాడుకుంటూ కూచున్నారు. వారి దగ్గిరికి ఎంతోమంది మునులు వచ్చారు. వారిలో వ్యాసుడు, నారదుడు, చ్యవనుడు, దేవలుడు, విశ్వామిత్రుడు, వసిష్ఠుడు, శతానందుడు, అసితుడు, భరద్వాజుడు, అత్రీ, మార్కండేయుడు మొదలైన మహాఋషులు ఎందరో వున్నారు. వారి శిష్యులూ వున్నారు.

వారిని చూడడంతోనే రామకృష్ణులూ, వసుదేవుడూ మొదలైన యాదవులూ, పాండవులూ అందరూ తడబడుతూ లేచారు. ఋషుల అడుగులకి దండాలు పెట్టారు. అర్ఘ్య పాద్యాలు, ఆసనాలు ఇచ్చి గౌరవించారు.

"ఇవాళ మా జన్మ తరించింది" అంటూ ఆరంభించాడు కృష్ణుడు. "తెలివి తెలిసిన మునీశ్వర్లు మీరు. మీ పాదాలే తీర్థాలు, నీళ్ళు నిండిన ఏళ్ళు కావు. మీ వునికులే దేవాలయాలు, రాతిగుళ్ళు కావు. మీరే దేవుళ్ళు, రాతి బొమ్మలు కావు. అగ్నీ, సూర్యచంద్రులూ, చుక్కలూ, ఆకాశమూ, గాలీ, నీరూ, నేలా అజ్ఞానం పోగొట్టవు. తెలివికి మీ మాటలే రాజబాటలు. కఫ, వాత, పైత్యాల దేహం శవంతో సమానం. దీన్ని నమ్ముకున్నవాడూ, రాతి

బొమ్మ దేవుడనుకున్నవాడూ, ఏళ్ళూ, కోనేళ్ళూ తీర్థాలను కున్నవాడూ గాడిదతో సమానుడు" అన్నాడు.

"అవును, కృష్ణా ! అన్నీ తెలిసిన వాడివి నువ్వు. నీ తెలివికి తుదిలేదు, హద్దుల్లేవు. తెలిసినవాడే బ్రాహ్మడు. ఉత్తమ బ్రాహ్మడివి నువ్వు. నీకు మా నమస్కారం" అన్నారు మునులు.

ఇంకా ఇలా అన్నారు వారు :

"నిన్ను కని దేవకీవసుదేవులు ధన్యులయారు. నీ సాంగత్యంతో గొల్లలూ, యాదవులూ, పాండవులూ తరించారు."

అప్పుడు వసుదేవుడు లేచి, జోడించిన చేతులతో అడిగాడు :

"భగవంతులారా ! ఏం చేస్తే కర్మవించి విడుదల కలుగుతుంది ?"

"వసుదేవా ! అన్నీ తెలిసిన కృష్ణుడే ఉన్నాడయ్యా నీ దగ్గర. అయినా అడిగావు కనక చెప్తున్నాం. ఏ కోరికా లేకుండా యజ్ఞం చెయ్యి. కోరికలు మానుకోడమే సన్యాసం. సన్యసించు" అన్నారు ఋషులు.

యజ్ఞం తలపెట్టాడు వసుదేవుడు. మునీశ్వర్లనే రుత్విజులుగా వరించాడు. యజ్ఞదీక్ష పూనాడు. అతడి భార్యలు రోహిణి, దేవకీ, శాంతిదేవ, ధృతదేవ, కౌసల్య, పౌరవి, మిత్రదేవి, శ్రుతదేవి, యశోధర మొదలైన పద్ధెనమందీ దీక్ష పట్టారు. మాంగలిక ద్రవ్యాలతో ముస్తాబులయారు.

వసుదేవుడు శుచిస్నానం చేశాడు. కాటుక పెట్టుకున్నాడు. వెన్న పూసుకున్నాడు. పద్ధెనమంది భార్యల చేతా అభిషేకం చేసుకున్నాడు. లేడితోలు కప్పుకున్నాడు.

బలరామకృష్ణులతో కలిసి యాదవులందరూ ముస్తాబులయి, భార్యలతో కూడా వచ్చి యజ్ఞం దగ్గిర సభలో కూచున్నారు. పాండవులు, కౌరవులు, యావన్మంది చుట్టాలు, పక్కాలు, స్నేహితులు, దేశదేశాల రాజులు, మహారాజులూ ఎవరి స్థానాలలో వారు కూచున్నారు.

శంఖాలు మోగాయి. మద్దెళ్ళూ, తాళాలూ, బూరాలూ గింగురుమన్నాయి. ఋషుల మంత్రాలు ప్రతిధ్వనించాయి.

గొప్పగా జరిగిపోయింది వసుదేవుడి యజ్ఞం. భార్యతో అతడి అవబృథస్నానం పూర్తయింది.

బ్రాహ్మలకే కాదు, కుక్కలూ మొదలయిన జంతువులకి కూడా ముప్పూటలా తృప్తిగా పిండివంటలతో కూడా భోజనాలు పెట్టారు. అడిగినా అడక్కపోయినా పేదలకి ధనం పంచిపెట్టారు. విదర్భ, కోసల, కురు, కాశి, కేకయ, సృంజయ, మొదలైన రాజులకీ, బంధువులకీ కానుకలిచ్చి సాగనంపారు.

భీష్ముడూ, ధృతరాష్ట్రుడూ, విదురుడూ, కుమాళ్ళతో కుంతీ, ద్రోణుడూ, వ్యాసుడూ మొదలైన ఋషులూ సగౌరవంగా వీడుకోలు తీసుకుని తమతమ నివాసాలకు వెళ్ళిపోయారు.

వసుదేవుడూ, ఉగ్రసేనుడూ వుండండని బలవంత

పెట్టడంవల్లా, రామకృష్ణుల స్నేహంవల్లా, నందయశోదలూ, గొల్లభామలు, మిగిలిన కోనారులు కొన్నాళ్ళు యాదవుల దగ్గిర వుండిపోయారు.

మాటామాంతీ ఆడుతూ ఒకనాడు నందుడి రెండు చేతులు పట్టుకున్నాడు వసుదేవుడు.

"ఏదయినా తెంపుకోగలం. కానీ అన్నా! స్నేహం మాత్రం తెంపుకోలేం, అందునా నీ స్నేహం, మీా ఆవిడ స్నేహం ఎన్నటికి తెగనిది. మీా మేలు ఎలా మరవడం. ఇదంతా మీా చలవ. మీారే ఆదుకోకపోతే నా రామకృష్ణులు నా ఆరుగురు కూనల్లాగే అయిపోవేవారు.

నందా! ఇప్పటికీ ఆరుగురినీ మరవలేనయ్యా మళ్ళీ కనిపిస్తారా నా చిట్టిపాపలు!

అవాళ, ఈ నల్లనయ్య పుట్టినాడు. ఆ వానలో కటికి చీకట్లో, కంచునెత్తుకుని మీా ఇంటికి వచ్చాను. తలుచుకుంటే గుండె తరుక్కుపోతుంది. నువ్వు పెట్టిన ఫుత్ర భిక్షయ్యా, ఇది నువ్వుపెట్టిన భిక్ష. ఎన్ని జన్మలెత్తినా నీ ఋణం, యశోద ఋణం తీర్చుకోలేం మేము. దేవకి కొడుకు కాడు కృష్ణుడు, యశోద కొడుకు. వసుదేవుడి కొడుకుకాడు, నందుడి కొడుకు. గొల్లల రాజువి నువ్వు. గొల్లలరాణి యశోద. మా నాయన చిన్ననాటి ముద్దూ ముచ్చటా మీారే చూశారు. మా పాపిష్టి కళ్ళకి ఆ ప్రాప్తం లేకపోయింది. ఏం చేస్తే మీా స్నేహం తీర్చుకోగలం చెప్పూ! ధనంవల్ల కళ్ళు కనపడలేదిప్పుడు."

అంటూ అంటూ నందుణ్ణి పట్టుకుని ఏడ్చేశాడు వసు

దేవుడు. నందుడూ కళ్ళనీళ్ళు పెట్టుకున్నాడు. అతడి నోట మాట పెగల్లేదు.

వసుదేవుడి స్నేహం తెంచుకోలేక బలరామకృష్ణుల మీది మమత ఒదులుకోలేక రేపూ, మాపూ అంటూ మూడు నెలలు వుండిపోయాడు నందుడు. ఎంత వున్నా వుండాలనే వుండేది గొల్లభామలకి.

తుదకి వదల్లేక, వదల్లేక ఓనాడు పయనం కట్టాడు. బళ్ళు పూశాడు.

వసుదేవుడూ, ఉగ్రసేనుడూ నందుడికీ, యశోదకీ, కడపకోనార్లకీ, గొల్లభామలకీ ఎన్నో అన్ని కానుకలిచ్చారు. కృష్ణుడూ, బలరాముడూ, ఉద్ధవుడూ, అక్రూరుడూ మొదలైన వారు ఎంతో దూరం సాగనంపారు.

## మహిమలు

కృష్ణుడిలో విచిత్రమయిన మహిమలుండేవి. అవసరమైనప్పుడు వినియోగించేవాడతడు. అవన్నీ వింటూ వుండే వారు దేవకీవసుదేవులు, అబ్బురపడుతూ వుండేవారు.

ప్రతిదినమూ తల్లిదండ్రుల అడుగులకి దండం పెట్టే వారు బలరామకృష్ణులు.

ఓనాడు కుమాళ్ళతో నెమ్మదిగా అన్నారు దేవకీ వసుదేవులు :

"నాయనా, కృష్ణా! రామా! అందరూ అంటున్నారు, మీరు చెయ్యలేంది ఏదీ లేదని, మీరు తలెత్తాక ఏ లోపమూ లేదు మాకు. కాని ఒక్కటి మాత్రం బాధగా వుంది. మీ

అన్నలు ఆరుగుర్నీ పాపిష్టి కంసుడు పొట్టలో పెట్టుకున్నాడు. కళ్ళారా వాళ్ళని చూడనన్నా చూడలేదు మేం. మీరు మీ గురువు కొడుకుని, చచ్చిపోయిన వాణ్ణి తెచ్చిచ్చారు కదా! మీ అన్నల్ని మాకు ఓమారు చూపించండి బాబూ!" అంటూ బతిమిలాడారు.

"అలాగే" అన్నారు రామకృష్ణులు. కంసుడు చంపేసిన ఆరుగురినీ అమ్మకీ నాన్నకీ అవుపరిచారు. స్మరుడూ, ఉద్గీథుడూ, పరిష్వంగుడూ, పతంగుడూ, క్షుద్రభృత్తుడూ, ఘృణీ అని ఆ ఆరుగురూ దేవకీ వసుదేవులికి నమస్కరించి వెళ్ళిపోయారు.

* * *

"ఒక్క భార్య రేవతితో కులాసాగా వుంటున్నాడు బలరాముడు. ఎనమండుగురు పట్టపు దేవేరులూ, పదహారు వేలమంది రాచకన్నెలూ కట్టుకున్నాడు కృష్ణమూర్తి. నిజానికి, గడుసుదయితే, ఒక్క ఇల్లాలితోనే వేగడం కష్టం మనిషి. అలాటిది ఇంతమందితో ఎలా నెగ్గుకువస్తున్నాడో మహానుభావుడు!"

అంటూ సందేహంగా వుండేది నారదుడికి.

"పోనీ వీళ్ళందరూ అలాంటి ఇలాంటి వాళ్ళా? ఒకళ్ళని మించిన వాళ్ళొకళ్ళు. మగడు రాత్రింబగళ్ళు తమ దగ్గిరే వుండాలంటారు. తమ మాట జవదాట కూడదంటారు! ఈ గుండు గొమ్మల అనుమానమేదో తీర్చేసుకోవాలి." అంటూ ఓ మంచిరోజు చూసి ద్వారక దిగబడ్డాడు.

కన్నుల పండువుగా వుంది ద్వారక, కలకలలాడుతూ.

రకరకాల పూలతో విరగబూసి వున్నాయి పూల తోటలు. ఆరముగ్గిన పళ్ళతో ఒంగి ఒంగి పడుతున్నాయి పళ్ళతోటలు. పద్మవనాలతో గమ్ముమని పోతున్నాయి కోనేళ్ళు. తుమ్మెదలు సంగీతాలు పాడుతున్నాయి. రాజ హంసలు కిలకిలలాడుతున్నాయి. తోటలో నెమళ్ళు పురులు విప్పి ఆడుతున్నాయి. చిలకలూ, మైనగోరలూ, గండు కోయిలలూ కూస్తున్నాయి.

ఎత్తయిన తొమ్మిది లక్షల భవనాలున్నాయి పట్నంలో. అన్నీ స్పటికం మణులతో చేసినవి. బంగారం తోనూ, వెండితోనూ కట్టినవి. మరకతమణులూ, వజ్ర వైఢూర్యాలూ తాపినవి. వీధులన్నీ విశాలంగా వున్నాయి. అంగళ్ళు అందంగా వున్నాయి.

రథసాలలూ, ఏనుగుసాలలూ, గుర్రాలసాలలూ, గొప్పగా వున్నాయి.

సభామండపాలూ, రచ్చచావిళ్లూ సుందరంగా వున్నాయి.

రాజవీధిని ఎండ తగలకండా చందువాలు కట్టారు. చలివేంద్రాలు పెట్టారు.

నగరమంతటా జెండాలు ఎగురుతున్నాయి. వాద్యాలు మోగుతున్నాయి. అగరుధూపాలు రేగుతున్నాయి.

అవన్నీ చూస్తూ, తలపూపుతూ రాజవీధిని నడిచి వెళ్ళాడు నారదుడు.

భవనాలన్నిటికి నడుమ, కొండల నడుమ మేరు పర్వతంలా వుంది కృష్ణుడి భవనం.

పదహారు వేలకిమించి గొప్ప గొప్ప మందిరాలున్నాయి.

బాగా చూసి అన్నిటిలోకి పెద్దమందిరంలోకే వెళ్ళాడు నారదుడు.

గరుడపచ్చల స్తంభాలు, వైఢూర్యాల పైకప్పులు. ఇంద్రనీలాల గోడలూ, మంచిముత్యాల చందువాలూ కళ్ళు జిగేలు మనిపిస్తూ వుంది భవనం. రతనాల నగలు ముస్తాబు చేసుకుని ముచ్చటగా వున్నారు పనికత్తెలు. అంతటా రతనాల దీపాలు వెలుగుతున్నాయి. సువాసన ధూపాలు రగులుతున్నాయి. అంతా అపురూపంగా వుంది. రుక్మిణీదేవి మందిర మది.

యాదవుల అంతఃపురాలకి ఆటంకం లేదు నారదుడికి. వేళాపాళా లేదు. అనుమతీ గినుమతీ అక్కరలేదు. చరచరా నడిచాడు లోపలికి.

రతనాల వేనుగుదంతం పందిరిమంచం, పట్టుపానుపు మీద కూచున్నాడు కృష్ణుడు. పక్కని రుక్మిణి కూచుంది. చామరం వేస్తూ వుంది.

నారదుడు రాగానే వున్నపాళాన లేచాడు కృష్ణుడు. నమస్కారం చేశాడు. అర్ఘ్యమూ పాద్యమూ ఇచ్చాడు. ఉన్నతమయిన ఆసనం ఇచ్చి కూచోపెట్టాడు. నెమ్మదిగా నవ్వుతూ కుశల మడిగాడు. 'ఆజ్ఞాపించు' అన్నట్టు చల్లగా చూశాడు.

"ఏం లేదు, ఓమారు చూసి వెళదామని వచ్చాను, చూశాను. వెళ్ళివస్తాను." అని లేచాడు నారదుడు. గుమ్మం దాకా వచ్చి సాగనంపాడు కృష్ణుడు.

గబగబా నడిచి మరో లోగిలిలోకి వెళ్ళాడు నారదుడు. అదీ రుక్మిణి భవనంలాగ అపురూపంగానే వుంది. అక్కడా వున్నాడు కృష్ణుడు. తన దేవేరితోనూ, ఉద్ధవుడితోనూ కలిసి పాచికలాడుతున్నాడు.

నారదుడు రావడంతోనే పాచికలు పడేశాడు. తడబడుతూ లేచి నమస్కరించాడు. నవ్వుతూ కుశల మడిగాడు. ఆసనం వేసి సేదదేర్చాడు. 'ఆజ్ఞాపించు' అన్నట్టు చల్లగా చూశాడు.

వెనకట్రిలాగే చెప్పి అక్కణ్ణుంచి బయలుదేరాడు నారదుడు. మరో లోగిలిలోకి వెళ్ళాడు.

అన్ని లోగిళ్ళూ అద్భుతంగానే వున్నాయి. దేనికేదీ తీసిపోయినట్టులేదు.

అక్కడా అవుపించాడు కృష్ణుడు. భార్యతో కలిసి కొడుకులతో ఆడుకుంటున్నాడు.

అలా ఒక లోగిలి తరవాత మరో లోగిలి తిరిగాడు నారదుడు. అన్ని లోగిళ్ళలోనూ భార్యతో కలిసి కనపడ్డాడు కృష్ణుడు. భార్యలందరితోనూ ఒకేలాగ మసులుతున్నాడు. అందరూ అతణ్ని ఒకేలాగ ప్రేమిస్తున్నారు. ప్రతి భార్యా తన దగ్గరే కృష్ణుడున్నాడనుకుంటూ వుంది. తనమీదే మక్కువ అని మురిసిపోతూ వుంది.

ఒక్క లోగిలీ వొదలకుండా అన్ని లోగిళ్లూ, పదారు

వేల ఎనిమిది లోగిళ్ళూ తిరిగాడు నారదుడు. తెలతెల్ల పోయాడు. కాళ్ళుపీకి చదికిలబడ్డాడు.

కేవలం భార్యలతోనే గడపడం కాదు. రాజ కార్యాలూ నిర్వహిస్తూ కనిపించాడు కృష్ణుడు. ఓ దగ్గిర బల రాముడితో వుంటే ఓ దగ్గిర ఉద్ధవుడితో అవుపించాడు.

"చిత్రం!" అనుకుంటూ వచ్చినదారి పట్టాడు నార దుడు.

* * *

ఓ మారు మిథిల వెళ్ళాడు కృష్ణుడు. దారుకుడు రథం సిద్ధం చేశాడు. గరుడపక్షి జెండా గాలిలో ఎగిరిస్తూ బయలు దేరింది రథం.

దారి కడాకూ జనులు జేజేలు పట్టారు. కానుకలిచ్చి పూజించారు. నదీ నదాలు, పల్లెలు, పట్నాలు, దాటు కుంటూ వెళ్ళాడు కృష్ణుడు. ఆనర్త, మరుదేశాలు, కురు జాంగల, కంకణ దేశాలు, మత్స్య, కేకయ, పాంచాల, కుంతి, శూరసేన, కోసల దేశాలు దాటి మిథిలాపట్నం వెళ్ళాడు.

అప్పుడు మిథిల ఏలుతున్న జనకుడు బహులాశ్వుడు. (మిథిల రాజులకి 'జనకుడు' అన్నది బిరుదు పేరు)

కృష్ణుడు వచ్చాడనగానే మంత్రులతోనూ, పురో హితులతోనూ ఎదురు వచ్చాడు బహులాశ్వుడు. అర్ఘ్యమూ, పాద్యమూ ఇచ్చి గౌరవించాడు.

మిథిలలో శ్రుతదేవుడని ఒక బ్రాహ్మడుండేవాడు. బుద్ధిమంతు డతడు. ధర్మపరుడు. అతడూ అర్ఘ్యమూ పాద్యమూ ఇచ్చి కృష్ణుడ్ని గౌరవించాడు.

జనకుడు తన దగ్గిరికి వచ్చి ఆతిథ్యం పుచ్చుకో మన్నాడు కృష్ణుడ్ని. శ్రుతదేవుడు తన ఇంటికి ఆతిథ్యానికి రమ్మన్నాడు.

ఇద్దరి పిలుపులూ ఒప్పుకున్నాడు కృష్ణుడు. ఇద్ద రింటికీ వస్తానన్నాడు.

నా ఇంటికే వస్తాడనుకున్నాడు బహులాశ్వుడు. నా ఇంటికే వస్తాడనుకున్నాడు శ్రుతదేవుడు.

రాజువెంట నడిచింది కృష్ణుడి రథం. అలాగే బ్రాహ్మడి వెంటా నడిచింది. అయితే రాజువెంట వెళు తూన్న రథం బ్రాహ్మడికి అవుపడలేదు. బ్రాహ్మడి వెంట వెళ్ళిన రథం రాజుకీ అవుపడలేదు.

ఇద్దరి ఇళ్ళకీ ఒకేసారి వెళ్ళాడు కృష్ణుడు. ఇద్దరి దగ్గిరా ఒకేసారి ఆతిథ్యం పుచ్చుకున్నాడు. ఒకే కృష్ణుడు ఇద్దరయాడు.

తన ఇంటికే వచ్చాడని జనకుడూ, తనింటికే వచ్చా డని శ్రుతదేవుడూ ఆనందంతో ఆకాశమందుకున్నారు.

వెనక పౌండ్రక వాసుదేవుడు ద్వారక మీద దాడి చేసే ముందు కృష్ణుడు బదరికాశ్రమం వెళ్ళి తపస్సు చేసి వచ్చాడు. తాను తిరిగి వచ్చేదాకా ద్వారకలో చేయవలసిన కట్టుదిట్టాలన్నీ చేశాడు. పట్నం వెయ్యికళ్ళతో కాపాడమని సాత్యకినీ, ఉద్ధవుణ్ణీ నియమించాడు. పట్నం నాలుగు ద్వారాలలో మూడు ద్వారాలు మూసేసి, ఒక్క ద్వారమే తెరిచి వుంచాడు. పట్నం బయటలు ఆటలూ, వేటలూ బందు

చేయించాడు. వచ్చిపోయే మనుష్యుల్లో తన వారెవరో, పగ వారెవరో పరీక్షించే ఏర్పాటు చేశాడు.

ఆలా అన్ని కట్టుదిట్టాలుచేసి, ఎవరికి చెప్పవలిసింది వారికి చెప్పి, బదరికాశ్రమం వెళ్ళి తపస్సులో కూచున్నాడు కృష్ణుడు.

గంగకి ఉత్తరంగా వున్న బదరికలో చలించని చిత్తంతో తపస్సులో వున్నాడు కృష్ణుడు. అర్ధరాత్రయింది. ఘోరమైన అరుపులు వినిపించాయతడికి. రకరకాల జంతువుల అరుపులవి. ఇంతలో మృగాలూ, మృగాల వెంట పిశాచులూ వచ్చారు. పిశాచుల చేతుల్లో దీపాలున్నాయి. వాళ్ళంతా నెత్తురు తాగుతున్నారు. పచ్చిమాంసం నములుతున్నారు. అందరి కందరూ వికారంగా వున్నారు.

వాళ్ళలో ఇద్దరు మరీ ఇదిగా వున్నారు. ఇద్దరిలో పెద్దవాడు:

"ఏడిరా కృష్ణుడు? ఎక్కడున్నాడురా?" అంటూ అరుచుకుంటూ వచ్చాడు.

"ఎవరు నువ్వు? ఏమిటి ఇదంతా?" అని అడిగాడు కృష్ణుడు.

"నేనా? నేను కనపడలేదూ, నేను పిశాచుల రాజుని. ఘంటాకర్ణుణ్ణి. "విష్ణువు" అన్నమాట నా చెవిలో పడకుండా చెవులికి ఘంటలు కట్టుకున్నాను. వీళ్ళంతా నా వాళ్ళు. పచ్చిమాంసమూ, పచ్చిరక్తమూ మా తిండి. మనిషి మాంసం, అందులో బ్రాహ్మడి మాంసం, బ్రాహ్మడి నెత్తురు మా ఇష్టం. నువ్వు బ్రాహ్మడివా?"

"కాదు క్షత్రియుణ్ణి."

"బతికిపోయావు. మాంసం కావాలా? ఇదిగో ఇప్పుడే రెండుముక్కలు చేశాను, ఈ బ్రాహ్మణ్ణి. కావాలంటే ఈ మీాఎ ముక్క నములు బావుంటుంది. ఇంతకీ ఇలా ఎందుకు వచ్చానంటావు? పిశాచుడిగా వుండడం ఇష్టంలేదు నాకు. అందుకే కైలాసపర్వతం నించి వస్తున్నాను. వీడు నా తమ్ముడు. కైలాసంలో చెప్పారు. కృష్ణుడని ఎవడో వున్నాట్ట! అతగాడు పిశాచుల కులం పోగొడతాట్ట. ఇక్కడికే వస్తాడన్నారు. అందుకే వచ్చాను. అతగాడి వూరు ద్వారక అట! ఇక్కడ దొరక్కపోతే ద్వారకే వెళతాను. పడమటి సముద్రంలో వుందట కృష్ణుడి ద్వారక. ఆఁ, ఇంతకీ నువ్వెవడివో చెప్పావుకావు. చెప్పు, ఎవడివి నువ్వు?"

"నేను" నవ్వుతూ అన్నాడు కృష్ణుడు, "నేనే కృష్ణుణ్ణి."

కాళ్ళమీద పడ్డాడు ఘంటాకర్ణుడు. లేవనెత్తాడు కృష్ణుడు. పిశాచరూపంపోయి నుంచున్నాడు ఘంటాకర్ణుడు.

తపస్సు పూర్తిచేసుకుని వచ్చేశాడు కృష్ణుడు.

* * *

యాదవకుమాళ్ళు ప్రద్యుమ్నుడూ, సాంబుడూ, గదుడూ, చారుభానుడూ, మరికొందరూ కులాసాగా తిరుగుతూ, తిరుగుతూ తోటలో ఒక నుయ్యి చూశారు. నూతిలో నీరులేదు. ఓ పెద్ద తొండ పడుంది. దాన్ని పైకి తీయాలని చూశారు కుర్రాళ్లు. తియ్యలేకపోయారు. కృష్ణుడితో వెళ్ళి చెప్పారు.

నవ్వుతూ వచ్చాడు కృష్ణుడు. నూతిలో తొండని ఎడమ చేత్తో ఇట్టే పైకి తీశాడు.

కృష్ణుడి చెయ్యి తగలడంతోటే, తొండ మనిషిగా మారి నుంచుంది. కుమాళ్లు నిచ్చెరపోయారు.

"ఎవరు నువ్వు?" అడిగాడు కృష్ణుడు.

"ఇక్ష్వాకు వంశంలో ఒకప్పుడు మహారాజున్నేను. నృగుడు నా పేరు.

చేతికి ఎముక లేకండా దానాలు చేశాను. చెప్పకో కూడదు, ఎన్ని ఆవులు ఎంతమంది కిచ్చానో, ఎంత ధాన్యం, ఎంత బంగారం ఎంతమంది కిచ్చానో లెక్క లేదు.

ఒకనాడు ఒక ఆవు ఒక బ్రాహ్మనుడికిచ్చాను. అది కన్నె తెంపుకు వచ్చేసింది. మా ఆవుల్లో కలిసిపోయింది. తెలీక అది మరో బ్రాహ్మనుడికిచ్చేశాను. మొదటి బ్రాహ్మణుడు వెదుకుతూ వెళ్ళి ఆ ఆవు తనదన్నాడు. ఇద్దరూ తగువుపడ్డారు. దానికి బదులు ఎన్నో ఆవులిస్తానన్నాను. కాదు అదే కావాలని కూచున్నారు ఇద్దరూ. ఇచ్చింది తిరిగి తీసుకున్నట్టయింది. ఈ తొండ పుట్టుక వచ్చింది. సెలవు." అంటూ వెళ్ళిపోయాడు నృగుడు. నిచ్చెరపోయి నించుండి పోయారు యాదవకుమాళ్లు.

అసలు ఈ మహిమలు కృష్ణుడిలో పుట్టుకతోనే వుండేవి.

చిన్నప్పుడు మన్నుతినేవా డతడు. ఓనాడు అన్న బలరాముడు చూశాడు. అమ్మ యశోదతో చెప్పాడు. కర్ర పట్టుకు వచ్చింది యశోద.

"నేను తినలేదు కావలిస్తే చూడు" అంటూ నోరు తెరిచాడు కృష్ణుడు

మన్ను లేదు, ప్రపంచమంతా కనపడింది యశోదకి.

కలకాదు కదా అని కంగారుపడింది పిచ్చితల్లి.

కౌరవసభలో ద్రౌపది బట్టలు వూడదీయడానికి వచ్చాడు దుశ్శాసనుడు. "అన్నా" అని అరిచింది ద్రౌపది. ఆమె మానం బయటపడకండా కోకమీద కోక కల్పించాడు కృష్ణుడు.

అతడి మహిమ లన్నిటిలోకి అద్భుతమయింది విశ్వరూపం.

కౌరవుల దగ్గిరికి రాయబారం వెళ్ళాడతడు. అప్పుడు కట్టిపడెయ్యాలనుకున్నాడు దుర్యోధనుడు. అదిగో అప్పుడే మొదటిసారి విశ్వరూపం చూపించాడు కృష్ణుడు. కళ్ళులేని ధృతరాష్ట్రుడికి కూడా కనిపించునట్టు చేశాడు. కంగారు పడి పోయారు కౌరవులు. దుర్యోధనుడు మాత్రం "ఇలాంటి మహిమలు నేనూ కొన్ని నేర్చుకున్నాను." అన్నాడు తరవాత.

మహాభారత యుద్ధంలో అర్జునుడు కౌరవసేన చూసి కళవిళ పడ్డాడు. "తాతల్నీ, తండ్రుల్నీ, అన్నదమ్ముల్నీ, గురువుల్నీ, స్నేహితుల్నీ చంపడానికి నా చేతులు రావడం లేదు" అంటూ విల్లూ, అమ్ములు పడేసి, రథంమీద చతికిల బడి పోయాడు.

అతణ్ని యుద్ధంలో నిలబెట్టడం కోసం మళ్ళీ విశ్వరూపం చూపెట్టాడు కృష్ణుడు.

వేనవేలు శిరస్సులు. వేనవేలు కళ్ళు. వేనవేలు నోళ్ళు. వేనవేలు చేతులు. వేనవేలు నాలికలు.

ఎంత భయంకరమో అంత అద్భుతంగా వుండేది విశ్వరూపం. చూడలేక, చూడలేక చూశాడు అర్జునుడు. చేతులు జోడించాడు. జేజేలు పలికాడు.

అలాగే మరోమారు ఉదంకుడికి చూపించాడు. హస్తినని౦చి ద్వారక వెళ్లేదారి ఎడారిలో వుండేవాడు ఉదంకుడు. భారతయుద్ధమయిపోయాక ద్వారక వెళుతూ అతడి ఆశ్రమంలో ఆగాడు కృష్ణుడు. "భారతయుద్ధానికి నువ్వే కారణం. శపిస్తాను" అన్నాడు ఉదంకుడు. విశ్వరూపం చూపాడు కృష్ణుడు. శాంతించాడు ఉదంకుడు.

## వానరుడు

ఓనాడు రైవత పర్వతంమీద తాగి సంగీతం పాడుతూ కూచున్నాడు. ప్రక్కనే మధుపాత్ర వుంది. ప్రియురాళ్ళూ, అందమైన అమ్మాయిలూ వున్నారు. చల్లగాలి సముద్రం కెరటాలమీంచి తేలి తేలి వస్తూవుంది.

ఇంతలో ఎక్కణ్ణుంచి చూశాడో పెద్ద వానరుడు, బలరాముడున్న చోటికి చెట్లమీంచి వురికాడు. అతడి పేరు ద్వివిదుడు. నరకుడి నేస్తం అతడు. నరకుణ్ణి కృష్ణుడు వెళ్ళి చంపేశాడని విని పగ తీర్చుకోవాలని దిగబడ్డాడు.

కృష్ణుడి ఆనర్త దేశంలో ఉపద్రవం పుట్టించాడు. ఉన్నట్టుండి వూళ్ళు తగలబెట్టేసేవాడు. పంటలు పాడుచేసేవాడు. తోటలు ధ్వంసం చేసేవాడు. నదుల గట్లు విరగ్గొట్టి

వూళ్ళు ముంచేసే వాడు. ద్వారకమీద రాళ్ళు రువ్వే వాడు. ఆలమందలు చెదరగొట్టేవాడు.

బలరాముణ్ణి చూసి ఒళ్ళు పొంగించాడు ద్వివిదుడు. అసలు వల్లమాలిన బలవంతుడతడు. ఆడాళ్ళ ఎదటికి వెళ్ళి చిందులు తొక్కాడు. వింతగా చూశారు వాళ్ళు. కొందరు సరదాగా నవ్వారు.

చెట్టుమీంచి చెట్టుకి దూకాడు ద్వివిదుడు. పూల చెట్లు దులిపాడు. పళ్ళచెట్లు దులిపాడు. భయపెట్టాడు. పరవళ్ళు తొక్కాడు.

తాగిన మత్తులో అదేమీ గమనించలేదు బలరాముడు. అరమూత కళ్ళతో పాటలు పాడుతూ కూచున్నాడు. అతడి ఎదటికే దుమికాడు ద్వివిదుడు. అతడు తాగుతున్న బంగారం కల్లుముంత పట్టుకెళ్ళి పగలగొట్టాడు. పైగా వికరబడి నవ్వాడు.

రెప్పలెత్తి చూశాడు బలరాముడు. చిన్నరాయి తీసి బెదిరించాడు.

స్త్రీ జనంమీద పడ్డాడు ద్వివిదుడు. వాళ్ళ చీరెలు చింపేశాడు. వేళాకోళాలాడాడు. తేరి చూశాడు బలరాముడు. దేశంలో ఉపద్రవం చేస్తున్నవాడు వీడే అని గుర్తించాడు. నాగలి తీశాడు. ముసలం పట్టుకున్నాడు.

పెద్ద గుగ్గిలంచెట్టు పెరికాడు ద్వివిదుడు. బలరాముడి తలమీద గురిపెట్టి విసిరాడు.

ఎడమచేత్తో పట్టేశాడు బలరాముడు. ముసలంతో

ద్వివిదుడి నెత్తిమీద బాదాడు. తల చిట్లి నెత్తురు చివ్వున చిమ్మింది.

లక్ష్యపెట్టలేదు ద్వివిదుడు. చెట్టుమీద చెట్టు పెరికి చెట్లవాన కురిపించాడు. పెద్ద పెద్ద రాళ్ళు పెరికి విసిరాడు, వూపిరాడనివ్వకండా. చివరికి బలరాముణ్ణి అడిచి పట్టుకున్నాడు. రొమ్ముమీదపడి పిడిగుద్దులు గుద్దాడు.

ఎక్కడలేని కోపం తెచ్చుకున్నాడు బలరాముడు. అతడి కళ్ళు జోతుల్లాగ మెరిశాయి. పెదవులదిరాయి. కనుబొమలు ముడివడ్డాయి. విషనాగులా బుసకొట్టాడతడు. పిడుగుల్లాటి పోట్లు ద్వివిదుణ్ణి పొడిచాడు. కొండలదిరాయి. ద్వివిదుడి గుండెలు పగిలాయి. ముక్కుంటా, నోటంటా రక్తం కక్కుకున్నాడతడు. నిండుప్రాణం నిలువునా వొదిలేశాడు.

అంతవరకూ ప్రాణాలు గుప్పెట్లో పెట్టుకున్న స్త్రీలు మెల్లిమెల్లిగా బలరాముడి చుట్టూ చేరి అతడి ఆయాసం పోగొట్టారు. అతడి ప్రతాపం పాటలకింద పాడారు.

## రాజసూయంలో తొలిపూజ

ధర్మరాజు దిగ్విజయం పూర్తయింది. తూరుపు దిక్కు గెలిచి భీముడూ, దక్షిణాది గెలిచి సహదేవుడూ, పడమటి తట్టు గెలిచి నకులుడూ, ఉత్తరాది గెలిచి అర్జునుడూ లెక్కా జమా లేనంత ధనం పట్టించుకు వచ్చారు. ధర్మరాజు పిలుపు అందుకని దేశదేశాల రాజులు ఇంద్రప్రస్థం తర్లివచ్చారు.

దరద దేశం రాజూ, బాహ్లీకుడూ, అంగ, వంగ దేశాల రాజు కర్ణుడూ, దుర్యోధనుడూ, భీష్ముడూ, గాంధారం రాజు సుబలుడూ, శకునీ, జయద్రధుడూ, భీష్మకుడూ, భోజకటకం రాజు రుక్మి, కిన్నరదేశం రాజు ద్రుముడూ, దంతవక్త్రుడూ, భగదత్తుడూ, భూరిశ్రవుడూ, మగధ సహదేవుడూ, ద్రుపదుడూ, విరాటరాజూ, బృహద్బలుడూ, అవంతి విందానువిందులూ, మద్రరాజు శల్యుడూ, ఏకలవ్యుడూ, శిశుపాలుడూ, వృషసేనుడూ, కళింగం రాజూ మొదలైన రాజులూ,మహారాజులు కానుకలు పట్టుకువచ్చారు.

అందరి కంటే ముందే వచ్చి ధర్మరాజుకి చేదోడు వాదోడుగా నిలబడ్డాడు కృష్ణుడు. యాదవ ప్రముఖులూ అతడివెంట వచ్చారు.

వ్యాసుడు, భరద్వాజుడు, సుమంతుడు, గౌతముడు, అసితుడు, చ్యవనుడు, వసిష్ఠుడు, విశ్వామిత్రుడు, కణ్వుడు, కవషుడు, మైత్రేయుడు, త్రితుడు, వామదేవుడు, సుమతీ, జైమినీ, క్రతువూ, పైలుడు, పరాశరుడు, గర్గుడు, వైశంపాయనుడు, అధర్వుడు, కశ్యపుడు, ధౌమ్యుడు, మొదలైన వారు ఋత్విజులయారు.

ప్రతి పనీ కృష్ణుడి మాట ప్రకారమే చేస్తూ వచ్చాడు ధర్మరాజు. బంగారపు నాగలితో యజ్ఞంచోటు దున్నాడు. విధిప్రకారం దీక్షపట్టాడు.

చెప్పలేనంత గొప్పగా జరిగింది రాజసూయం. యావన్మందీ అన్నివిధాలా తృప్తిపడ్డారు. సోమరసం తీసిన

అభిషేకంనాడు అంతర్వేదిలో యావన్మంది రాజులూ, మునులూ కూచున్నారు. అందరినీ వరసక్రమంలో పూజించాలి ధర్మరాజు. ఎవరిని ముందు పూజించాలి. అందరిలోనూ తొలిపూజకి తగినవారెవరు?

నిశ్శబ్దమయింది సభ. భీష్ముడివేపు చూశాడు ధర్మరాజు.

"చుక్కల్లో రాజు చంద్రుడని చెప్పాలా?" అంటూ కృష్ణుణ్ణి చూపించాడు భీష్ముడు.

"అవును, అందరిలోకీ కృష్ణుడు ఉత్తముడు." అంటూ అందుకున్నాడు పాండవుల సహదేవుడు, "ముందు అర్ఘ్యమిచ్చి ఇతడే పూజించదగిన పురుషోత్తముడు."

అవునంటే అవునన్నారు రాజులు. మునులూ తల ఊపారు.

సంతోషించాడు ధర్మరాజు. పాద్యం తెచ్చి కృష్ణుడి కాళ్ళు కడిగాడు. సిరసుమీద వేసుకున్నాడు. పసుపురంగు బట్టలూ, రత్నాల నగలూ వాటితో అర్ఘ్యమిచ్చాడు. అలా అందరిలోనూ తొలిపూజచేశాడు. సభసభంతా సంతోషంతో కేకలు వేశారు. కృష్ణుణ్ణి పొగిడారు.

## శిశుపాలుడి శివాలు

"ఏమిటీ నీచప్పని!" అంటూ తొకతొక్కిన తాచులా లేచాడు శిశుపాలుడు. "ఈ కృష్ణుడా తొలిపూజకి దొరికాడు మీకు! నిన్న మొన్నటిదాకా సొమ్ములు

కాస్తూ బతికాడు. పాలుపట్టడానికి వచ్చిన ఆడదాన్ని చంపి స్త్రీహత్యాపాతకం మూట కట్టుకున్నాడు. తోడ పెద్దుని చంపి గోహత్య చేశాడు. మేనమామ కూడు తిని, మేనమామనే చంపేశాడు. బృందావనంలో వీడు దూరని కొంపలేదు, తడవని ఆడపిల్లలేదు. పచ్చి వ్యభిచారి, దొంగ, తాగుబోతు.

ఏం చూసి పూజించారయ్యా? రాజా, పోనీ ఓ మడి చెక్క రాజ్యమైనా వుందా? ఖైదులో పుట్టాడు, గొల్ల వాళ్ళ కూడుతిని బతికాడు.

భీష్మా! ముసలితనంలో మతి చెడింది నీకు. నపుంసకుడివి నువ్వు. చేతకాక బ్రహ్మచారినని చెప్పుకుంటావు. ఆ మాత్రం చేతనయితే పడుచు మరదళ్ళని పరాయి మగాడికి అప్పజెప్పి వంశం నిలుపుకుంటావా! అలాటి సంతతి కనకనే పాండవులు ఈ అఘాయిత్యానికి పాలుపడ్డారు నీ మాటమీద.

రాజా కాడు, వృద్ధుడా కాడు, పండితుడా కాడు, కుల మున్నవాడా కాడు. మరి ఏం చూసి చేశారీ గౌరవం? తెలీక మీరు చేశారే కట్టండి, తగుదునమ్మా అని ఏ మొహం పెట్టుకుని పుచ్చుకున్నాడీ పెద్దమనిషి? రాజులంద రికీ ఎందుకీ అవమానం?" అంటూ తన పక్షం రాజుల్ని రెచ్చగొట్టాడు.

"శిశుపాలా! ఎందుకీ శివాలు! మాకు తెలుసు నీ కంటే, మాకంటే, ఇక్కడున్న యావన్మందికంటే లోక మంతటికంటేకూడా గొప్పవాడు కృష్ణుడు. అందుకనే ముందు అతణ్ణి గౌరవించాం. ఇది కాదన్నవాడి నెత్తిమీద

నా ఎడమకాలు పెడతాను" అంటూ ముందుకి వచ్చాడు సహదేవుడు.

"అవును, అంతే" అన్నాడు భీష్ముడు. అప్పటికే పళ్ళు కొరుకుతున్నాడు భీముడు.

అయినా ఆగలేదు శిశుపాలుడు. భీష్మున్నీ, కృష్ణుణ్ణీ నోటికి వచ్చినట్టు తిట్టడం లంకించుకున్నాడు. తన జట్టురాజులతో కలిసి యుద్ధానికి సిద్ధపడ్డాడు.

అంతవరకూ గంభీరంగా కూచున్న కృష్ణుడు చివాల్న లేచాడు.

"ఇదిగో వినండి. వీడు మా మేనత్త కొడుకు. మా మేనత్త మొహంచూసి ఇంతవరకూ వీణ్ని సహిస్తూ వచ్చాను. చుట్టరికమైనా చూడకండా, మా యాదవులంటే కంటిమంట వీడికి మొదటినించీ. మా పగవాడైన జరాసంధుడికి సేనాధిపతిగా వున్నాడు. నేను ప్రాగ్జ్యోతం వెళ్ళినప్పుడు మా ఊరికి అగ్గిపెట్టాడు. ఉగ్రసేనుడు రైవత మీాద తిరుగుతూవుంటే దొంగచాటుగా అతడి మనుషుల్ని చంపేసి వచ్చాడు. మా తండ్రి సాక్షాత్తూ మేనమామ వీడికి. అతడు అశ్వమేధం తలపెడితే, గుర్రం దాచేశాడు. బభ్రుడి భార్యని ఎత్తుకుపోయాడు. విశాలరాజు కూతుర్ని భద్రని పట్టుకుపోయాడు. సహించినంతకాలం సహించాన్నేను. ఇవాళ—" అంటూ సుదర్శనచక్రం పట్టుకున్నాడు. చక్రంన శిశుపాలుడి మీాదికి విసిరాడు. శిశుపాలుడి తల ఎగిరిపోయింది. మొండెం నేల దొర్లిపోయింది.

శిశుపాలుడు తెగిపోవడంతోనే, అంతవరకూ అతడ్ని వెనకేసుకు వచ్చిన రాజులు సేనలతోకూడా గుడారాలు వొదిలేసి పారిపోయారు. తమతమ దేశాల పొలిమేరలు చేరు కున్నాకగానీ వూపిరి తీసుకోలేదు.

అవభృథ స్నానానికి గంగానదికి బయలుదేరాడు ధర్మరాజు. బంగారం రథంమీద ద్రౌపదితో కూచున్నాడు. పట్టుబట్టలు కట్టుకుని రథంమీద అతడు వెళుతూవుంటే శంఖాలు మోగాయి. బూరాలు, వాద్యాలు గింగురు మన్నాయి. సానిమేళాలు వసంతాలాడుతూ, ఆడా మగా ప్రజలు ఉల్లాసంతో వెంటవెళ్ళారు. రాజులు, రక్షణతో రాణులు, మంత్రాలతో ఋత్విజులుకూడావెళ్ళారు. పల్లె పల్లెలనించి వచ్చిన ప్రజలు, పట్నంవాళ్ళూ ఆడా, మగా పిన్నా, పెద్దా పసుపుగుండా, బగ్గుండా ఒకళ్ళమీద ఒకళ్ళు పూసుకుంటూ నడిచారు. అపూర్వమయిన పండగలా అవు పించిందది.

అలావెళ్ళి గంగనీటితో అవభృథ స్నానంచేశాడు ధర్మరాజు. యజ్ఞం పూర్తయాక చేసే స్నానం అవభృథ స్నానం. స్నానమయాక పట్టుబట్టలు కట్టుకున్నాడు. బట్టలు, రతనాల నగలు వేసుకున్నాడు. నగలు, ఆవులు పంచి పెట్టాడు. ప్రజలందరినీ సంతోష పెట్టాడు.

దేశదేశాలనించి వచ్చిన రాజుల్ని సాదరంగా సాగ నంపాడు. ధర్మరాజు ధర్మగుణమూ, చెప్పుకుంటూ వారంతా తమ తమ దేశాలు దూరదూరాలు తర్లి వెళ్ళారు.

సాంబుడూ మొదలైన కుమాళ్ళనీ, యాదవ ప్రము

ఖుల్నీ పంపేసి, భార్యలతోనూ బలరాముడితోనూ కలిసి కొన్నాళ్ళు ఇంద్రప్రస్థంలో పాండవులతో గడిపాడు కృష్ణుడు. తమ్ములతో దుర్యోధనుడూ కొన్నాళ్ళున్నాడు.

## మచ్చరం మంట

రాజసూయంతో ధర్మరాజు చక్రవర్తులలో చక్రవర్తి అయాడు. కృష్ణుడూ, దుర్యోధనుడూ, భీముడూ, అర్జునుడూ నకులసహదేవులూ, కర్ణుడూ, సాత్యకీ, విదురుడూ, ద్రౌపది, మొదలైనవారు యజ్ఞంలో ఒకొక్క పనీ నిర్వహించారు. రాజులు తెచ్చిన కట్నాలూ, కానుకలూ ఇన్నీ అన్నీ కావు.

ఇవన్నీ ఒక ఎత్తు, మయుడు తయారు చేసిన మహాసభ ఒక ఎత్తు. చిత్రవిచిత్రమైన సభ అది. కృష్ణుడి వేలాది భార్యలూ, ద్రౌపదీ, సుభద్రా ముస్తాబులయి అందులో తిరుగుతూ రత్నాలు తాపిన వారి బంగారం కాలిఅందెలూ, మొలనూళ్ళూ, జడగంటలూ ఘల్లంటే ఘల్లుమంటూ వుంటే, వారి అంగరాగాలూ, పూలదండలూ ఘుమఘుమలాడుతూ వుంటే, వారి నవ్వులు, నాట్యాలు వినిపిస్తూ వుంటే అపురూపంగా వుండేది. అదంతా అందరికీ వేడుకగా వుండేది. ఒక్క దుర్యోధనుడికి మాత్రం మనసులో మచ్చరం మండిపోతూ వుండేది.

అవాళ మయసభలో కొలువు తీర్చి కూర్చున్నాడు, బంగారం సింహాసనం మీద. పక్కనే మరో బంగారం

సింహాసనం మీద కృష్ణుడు కూర్చున్నాడు. భీమార్జునులు, నకులసహదేవులూ రెండు వేపులా కూర్చున్నారు. మంత్రులు కూచున్నారు. వందిమాగధులు కృష్ణుణ్ణీ, ధర్మరాజునీ పొగుడుతూ పాటలు పాడుతున్నారు.

ఇంతలో దుశ్శాసనుడూ మొదలైన తమ్ములతో కలిసి మయసభ చూడడానికి వచ్చాడు దుర్యోధనుడు.

ఎంతటివాడయినా మయసభలో తికమకపడతాడు తెలియకపోతే. అసలే దురభిమాని దుర్యోధనుడు. ఒకణ్ణి అడగడం అతడికి అవమానం. తలమీద కిరీటం, మెళ్ళో హారాలూ, చేతిలో చంద్రహాసం కత్తీ-ఠీవిగా లోపలికి రాబోయాడు. "అది ద్వారం కాదు మహారాజా!" అన్నారు ద్వారపాలకులు.

ధుమధుమలాడుతూ వాళ్ళు చూపినదారిని లోపల దూరాడు దుర్యోధనుడు. కోనేటిలా చిత్రించిన నేలచూసి, కోనేరే అనుకుని బట్టలు మీదికెత్తాడు. నీరు లేకపోవడంతో తెల్లపోయాడు. అలాగే నీరు కాదనుకుని నిజమైన కోనేటిలో దిగబడి పోయాడు. అతడి అవస్థచూసి భీముడు విరగబడి నవ్వాడు హేళనగా. మిగిలిన రాజులూ నవ్వారు. స్త్రీలు కిలకిల నవ్వారు. ధర్మరాజు తప్పు తప్పన్నాడు. కృష్ణుడు పురికొల్పాడు.

చిన్నబుచ్చుకున్నాడు దుర్యోధనుడు. అసలే దురభిమాని అతడు. చెప్పకుండా చెయ్యకుండా హస్తినాపురం వెళ్ళిపోయాడు. మచ్చరంతో మండిపోతున్న అతడికి ఈ అవమానం పుండు మీద కారం చల్లినట్లయింది. మహా

భారత యుద్ధానికి కారణమయింది. నవ్వుతూ వూరుకున్నాడు కృష్ణుడు.

## సౌభం : సాల్వుడు

కృష్ణుడి మీదా యాదవుల మీదా కత్తికట్టిన ముఖ్యులలో సాల్వుడొకడు. తపస్సు చేసి 'సౌభం' అని గొప్ప విమానం సంపాదించాడతడు. చిన్నదీ చిట్టికదీ కాదది. పట్నం వంటిది. దానవుల దగ్గిర మాయయుద్ధం కూడా నేర్చుకున్నాడు సాల్వుడు. కృష్ణుడూ బలరాముడూ లేకపోవడం చూసి పెద్దదండు వేసుకుని ద్వారకముట్టడించాడు. పట్నం పాడుపాడు చేశాడు. సౌభంమీంచి రాళ్ళూ రప్పలు కుమ్మరించాడు. కనపడీ కనపడకుండా యుద్ధం చేశాడు. భయపడి పోయారు ప్రజలు.

దాంతో ప్రద్యుమ్నుడూ, సాత్యకీ, చారుదేష్ణుడూ, సాంబుడూ, అక్రూరుడూ, కృతవర్మా, భానువిందుడూ, గదుడూ, సుకసారణులూ మొదలైన యాదవవీరులు సాల్వుణ్ణి ఎదిరించారు. కవచాలు కట్టుకుని, ఆయుధాలు పట్టుకుని రథాలమీద రాణువలతో బయలుదేరారు.

సాల్వుడిసేనా యాదవసేనా కలపడింది. రెండు సేనలూ హోరాహోరి పోరాడాయి. మాయామాయుద్ధం చేశాడు సాల్వుడు. సుడిగాలి పుట్టించాడు. రాళ్ళవాన కురిపించాడు. పాములూ, తేళ్లూ కురిపించాడు. ఉరుములు వురిమించాడు. మెరుపులు మెరిపించాడు.

అతడి విమానం రకరకాలయింది. కిందికి దిగేది,

లిప్తలో మీదికెగిరేది. ఒక్కటే పదిలాగ అవుపించేది. అంతలో మాయమయేది.

చిమ్మచీకట్లు కల్పించాడు సాల్వుడు. వెలుగుబాణాలు వేశాడు ప్రతివింధ్యుడు. సాల్వుడి సేనాపతిని బాణాలతో ముంచెత్తాడు. సాల్వుడి మాయ మాయ చేశాడు. సాల్వుడి మీద సానపెట్టిన వందబాణాలు నాటించాడు. అతడి చతురంగసేన నురుమాడాడు. అతడి ప్రతాపం చూసి యావన్మందీ, భళీ ప్రతివింధ్యా భళీ, అన్నారు.

ఇంతలో సాల్వుడి మంత్రి ద్యుమంతుడు దూసుకు వచ్చాడు. "బప్పరిసింగా" పొలికేక పెట్టాడు. పాతిక వాడి వాడి బాణాలు వరసపెట్టి తగిలించాడు ప్రద్యుమ్నుడు.

అన్నీ ఆపుకుంటూ పెద్ద గదతీసి విసిరాడు ద్యుమంతుడు. ప్రద్యుమ్నుడి ఎదుర్రొమ్ముమీద తగిలింది గద. తెలివి తప్పిపోయాడు ప్రద్యుమ్నుడు. రథం తప్పించి పట్టుకు పోయాడు దారుకుడి కొడుకు సారథి. అంతలోనే తెలువు కున్నాడు ప్రద్యుమ్నుడు. యుద్ధం తప్పించి తెచ్చావని సారథిని గదిమాడు ప్రద్యుమ్నుడు. "నిన్ను రక్షించడం నా ధర్మం" అంటూ సాల్వుడిమీదికి రథంతోలాడు సారథి. "కాదు ద్యుమంతుడి మీదికే పోనీ రథం" అన్నాడు ప్రద్యుమ్నుడు.

బరిమీద పాములాగ పరిగెత్తింది ప్రద్యుమ్నుడి రథం. వెళుతూనే నాలుగుబాణాలు వేశాడు. ద్యుమంతుడి నాలుగుగుర్రాలూ చంపేశాడు. అతడి సారథి తల నరికేశాడు.

అతడి ధనుస్సూ, రథంమీంది జెండా నరికేసి అదే వూపున అతడి తలా నరికేశాడు.

సాత్యకీ, సాంబుడూ, కృతవర్మా మొదలయిన యాదవయోధులు పెట్రేగిపోయారు. సాల్వుడిసేన తరిమి తరిమి కొట్టారు. తరిమి తరిమినా తరుగులేకండా తిరగబడింది సాల్వుడిసేన-మాయసేన.

అలా విడుపూ విరామం లేకండా రోజుకాదు రెండు రోజులుకాదు, ఇరవయ్యేడు రోజులు సాగింది సాల్వుడి సౌభ యుద్ధం.

యాదవుల సైన్యం ఎంతో నాశనమయింది. పట్నం పాడయింది. తోటలు, కోనేళ్ళు, వీథులు, మేడలు, మిద్దెలు ఎన్నో నాశనమయాయి.

ఇంద్రప్రస్థంలో కృష్ణుడి మనస్సు మనస్సులో లేకండా పోయింది. ద్వారకమీందికి తనువుపోయింది. మేనత్త కుంతి తోనూ, చెల్లెలు సుభద్రతోనూ, ద్రౌపదితోనూ, బావ మరుదులు పాండవులతోనూ "వెళ్ళివస్తాను" అనిచెప్పి ద్వారక పయనమయాడు. అన్న బలరాముడ్నీ, యావన్మంది భార్యల్నీ తర్లించుకువచ్చాడు.

ఊరి పొలిమేర చేరేసరికే అంతా అవగతమయిం దత డికి. పాంచజన్యం పూరించాడు. పిడుగు లురిమింది పాంచ జన్యం. అటు సాల్వుడిసేనా, ఇటు యాదవసేనా జల్దుకుంది.

బలరాముడితో స్త్రీ జనాన్ని పట్నంలోకి పంపిం చేశాడు కృష్ణుడు. తాను సాల్వుడిమీందికి నడుం కట్టాడు.

"నీ కోసమే చూస్తున్నాను" అంటూ సౌభంతో ఎదురు వచ్చాడు సాల్వుడు. అంటూనే దారుకుడి మీద శక్తి గురిపెట్టి విసిరాడు. బాణం వేసి ముక్కముక్కలు కొట్టేశాడు కృష్ణుడు. అదే వడిని పదహారు బాణాలు సాల్వుడి గుండెలు దూసెళ్ళిపోయినట్టు గుప్పించాడు. సౌభం బాణాలతో కప్పెట్టాడు.

జంకలేదు సాల్వుడు. ఒడుపు చూసి కృష్ణుడి ఎడమ జబ్బ మీద పిడుగులాటి బాణాలు కొట్టాడు. దెబ్బతో కృష్ణుడి చేతివిల్లు పట్టుతప్పి కిందపడిపోయింది.

సింహనాదం చేశాడు సాల్వుడు. "కృష్ణా! మా శిశుపాలుడికిచ్చిన పిల్లని దొంగచాటున ఎత్తుకు వచ్చావు. బాపనాడిలా మారువేషం వేసుకుని, దొంగదారిని వెళ్ళి, నీకు చేతకాక భీముడిచేత అధర్మంగా జరాసంధుణ్ణి చంపించావు. ఆదమరిచి నించున్న శిశుపాలుణ్ణి అన్యాయంగా నరికేశావు. అన్నీ ఇవాళ తీర్చేస్తాను. ఇదిగో ఇది సౌభం. నీ చావుకే తెచ్చాను. అప్పుడు మధురనించి ద్వారక పారిపోయావు. ఇప్పుడు ద్వారకనించి వల్లకాటికే పరిగెడతావు." అంటూ వింటి నారి మోగించాడు.

"అరిచే కుక్క కరవదు సాల్వా. కరిచే కుక్క మొరగదు. వల్లకాడు నిన్నే పిలుస్తూవుంది. అందుకే తలుచుకుంటున్నావు." అంటూ గద తీశాడు కృష్ణుడు. పూనిపట్టి సాల్వుడి మీద తగిలించాడు. ఊగిపోయాడు సాల్వుడు. సౌభంతో మాయమయాడు. చూస్తూ నించున్నాడు కృష్ణుడు.

ఇంతలో ద్వారకనించి ఒక మనిషి రొప్పుకుంటూ వచ్చాడు.

"ప్రభూ! ప్రభూ!" అంటూ బావురుమన్నాడు.

"ఏం, ఏం జరిగింది?" అడిగాడు కృష్ణుడు.

"దేవకీదేవి పంపింది. సాల్వుడు వచ్చి వసుదేవుణ్ణి ఈడ్చుకు పోయాడు. ఏడుస్తూ ఆ తల్లి నీకీమాట చెప్పమంది" అన్నాడు వాడు

నిజమే అనుకున్నాడు కృష్ణుడు. ఒక్క క్షణం తడబడి పోయాడు.

మరుక్షణంలో వసుదేవుణ్ణి పట్టుకుని సాల్వుడు ఎదట నిలబడ్డాడు. కత్తితీసి వసుదేవుడి తల నరికేశాడు.

కళ్ళు మూసుకున్నాడు కృష్ణుడు. అదంతా నిజమా అనుకున్నాడు. కళ్ళు విప్పాడు. ఎదట సౌభం లేదు, సాల్వుడు లేడు. వసుదేవుడి తలాలేదు, మొండెమూ లేదు. అంతా మాయ అని తెలుసుకున్నాడు కృష్ణుడు.

సౌభంమీంచి సకిలించాడు సాల్వుడు. రకరకాల ఆయుధాలు కుమ్మరించాడు.

ఇక వీణ్ణి వూరుకోకూడదనుకున్నాడు కృష్ణుడు. సౌభం ముక్కకి ముక్కా, చెక్కకి చెక్కా చితకగొట్టేశాడు. సాల్వుడి కవచం చీల్చేశాడు, అతడి చేతులు నరికేశాడు. సుదర్శన చక్రం వేసి సిరసూ నరికేశాడు.

చచ్చినంత చచ్చి, కడప సాల్వసేన కాళ్ళకి బుద్ధి చెప్పేసింది. కనపడినంతమేరా కణుపు కొట్టారు యాదవులు.

పెద్ద గద పట్టుకువచ్చి కృష్ణుడి తల మీద కొట్టాడు దంతవక్త్రుడు. చలించలేదు కృష్ణుడు. కౌమోదకి గదతో దంతవక్త్రుడి ఎదురురొమ్ముమీద ఒక్కటి కొట్టాడు. రక్తం కక్కుకున్నాడు దంతవక్త్రుడు. వెల్లకిలాపడి, చచ్చి వూరు కున్నాడు.

"మా అన్నని చంపావు. నిన్ను నరికిపారేస్తాను. అంటూ కత్తిదూశాడు విదూరథుడు. సుదర్శన చక్రం వేసి అతడి సిరసు ఎగరగొట్టేశాడు నవ్వుతూ కృష్ణుడు.

అలా గెలుపు సాధించి పట్నంలో ప్రవేశించాడు కృష్ణుడు. పాంచజన్యం పూరించాడు. గరుడ పతాకం గాలిలో ఎగిరింది. దారికడాకూ పువ్వులు చల్లారు ద్వారక స్త్రీలు. అతడి మీద గెలుపు పాటలు పాడారు. శంఖాలు పూరించారు జనం. భేరీలు మోయించారు. యాదవవీరులందరూ అతణ్ణి పొగుడుతూ వెంట నడిచారు.

దేవకీ వసుదేవులకి మొక్కి, నవ్వుతూ లోగిళ్ళలోకి వెళ్ళాడు కృష్ణుడు.

## కుచేలుడు

రామకృష్ణులు గురుకులంలో సాందీపుడి దగ్గిర చదువు కుంటూ వున్నప్పుడు ఒక బీద బ్రాహ్మడు కూడా వారితో చదువుకుంటూ వుండేవాడు. బట్టలులేక చింకిగుడ్డలే కట్టుకునే

వాడతడు. అందుకని అందరూ కుచేలుడు (చింకి గుడ్డలవాడు) అని పిలిచేవారు. కృష్ణుడికీ అతడికీ బాగా స్నేహంగా వుండేది. ఆకులకోసం, పుడకలకోసం అడివికి వెళ్ళినా, గురువు చెప్పిన ఏ పనికీ ఇద్దరూ కలిసే వెళ్ళేవారు. కలిసే చదువుకునే వారు.

విద్యపూర్తి చేసి రామకృష్ణులు వచ్చేశారు. కుచేలుడూ తనవూరు తాను వెళిపోయాడు. తనలాటి పేదపిల్లనే ఒక దానిని పెళ్ళిచేసుకున్నాడు. కాని దినం గడవడం కష్టంగా వుండేది. పూటకి బత్తెముండేది కాదు. పస్తులు పడుకుండే వాడు. ఎముకలగూడులాటి శరీరం. కప్పేందుకు గుడ్డముక్క వుండేదికాదు. అలా అని బాధపడేవాడు కాడు. ఒకరిని బాధ పెట్టి బిచ్చమడిగేవాడు కాడు. మాట వచ్చినప్పుడు భార్యతో కృష్ణుడు నా నేస్తం అని చెపుతూ వుండేవాడు.

ఎప్పటిలాగే అవాళా పస్తు పడుకున్నారు ఆలూ మగలూ కుచేలుడు. ఆకలితో కిరకిరలాడిపోతూ అంది ఇల్లాలు :

"ఏమండీ! మీ నేస్తం కృష్ణుడు ద్వారకలో మహా రాజులా వున్నాట్ట! వేలాదిమంది వెలుతున్నారు. కావలిసిన సొమ్ములు తెచ్చుకుంటున్నారు. హాయిగా వుంటున్నారు. నేస్తాన్ని ఆమాత్రం చూడడా? ఆకలితో చచ్చిపోతున్నా నండీ."

"అయితే స్నేహితుణ్ణి ఇబ్బంది పెట్టమంటావుటే? బావుంటుందా? ఏమనుకుంటాడో! ఇంతకీ మనకి ఇంతే ప్రాప్తం. ఏం చేస్తాం?" అన్నాడు కుచేలుడు.

"ఆ మహానుభావుడికి ఇబ్బందేవిటండీ! చెడి స్నేహితుడింటికే వెళ్ళమన్నారు. సందేహించకండీ. ఓమారు వెళ్ళిరండీ."

"అయితే తప్పదంటావు. నాకూ వెళ్ళాలనే వుంది. ఎన్నాళ్ళయిందో నేస్తాన్ని చూసి. ఓమారు చూసి వస్తాను. అవునుగాని, వెళ్ళక వెళ్ళక వెళుతున్నాను, పట్టికెళ్ళడానికి ఏమైనా వుందా? ఉత్తిచేతులతో ఎలా వెళ్ళనూ! చూడూ, ఇంట్లో ఏమైనా వుందేమో!"

ఇల్లంతా వెదికింది ఇల్లాలు. అయ్యవారి నట్టిల్లు ఇంత కంటే నయం. ఇరుగు పొరుగు ఇళ్ళకి వెళ్ళి నాలుగు పిడికిళ్ళు అటుకులు సంపాదించి తెచ్చింది. చింకిపాతలో మూటకట్టాడు బ్రాహ్మడు పదిలంగా. వేకువనే లేచి ద్వారక పయనం కట్టాడు. దారికడాకూ నడుస్తూ, కూచుంటూ చివరికి ద్వారక చేరాడు.

ఎటుచూసినా వెలిగిపోతూ వుంది ద్వారక. "పోలుస్తాడో, పొమ్మంటాడో!" జంకుతూ, జంకుతూ వెళ్ళాడు బ్రాహ్మడు. ఆ ప్రాకారాలూ, మేడలూ, మండపాలూ కళ్ళు తిరిగిపోతూ వుంది కోట. పదహారు వేల లోగిళ్ళు. మబ్బుల్ని తాకుతున్న పట్టపు దేవేరుల మేడలు. మేడలమీద గుమ్మటాలు, గుమ్మటాల మీద జెండాలు, చిరుగంటలు, వాటి మధ్య కృష్ణుడి బంగారు భవనం ధగధగా మెరిసిపోతూ వుంది.

"ఎవరేమంటారో?" జంకుతూ, జంకుతూ లోపలికి వెళ్ళాడు కుచేలుడు. బంగారం మంచం పట్టుపానుపుమీద

ప్రియురాళ్ళతో కులాసాగా కూచున్నాడు కృష్ణుడు. అల్లంత దూరాన కుచేలుడ్ని చూశాడు. ఉన్నపాళాన లేచి ఎదురు వచ్చాడు.

"కుచేలా! కుచేలా!" అంటూ గుచ్చి గుచ్చి కౌగిలించుకున్నాడు. చెయ్యి పట్టుకు తీసుకువెళ్ళి తన ఏనుగు దంతాల బంగారం మంచంమీద, పట్టుపరుపుమీద కూచోపెట్టాడు. రుక్మిణీదేవిచేత చామరం వేయించాడు. "నడిచి వచ్చావా?" అంటూ కాళ్ళు వొత్తాడు. కుశల మడిగాడు.

"ఎప్పుడూ నిన్ను తలుచుకుంటూనే వుంటాను. మనం చదువుకున్న దినాలు ఎంత సరదాగా గడిచాయి. జ్ఞాపకముందా? ఒకనాడు సమిధలకోసం అడివికి పంపారు గురువుగారు. రాత్రిపడింది. గాలీ, వానా వచ్చాయి. తెల్లవార్లూ అడివిలోనే వుండిపోయాం. మనకోసం గురువుగారు నిద్ర లేకండా వెదికారు. ఎంత ప్రేమ శిష్యులంటే ఆయనకి! సరే, నాకోసం ఏం తెచ్చావు నేస్తం?" అని చెయ్యి చాచాడు.

చింకిపీలికనించి అటుకులు విప్పి అందిచ్చాడు కుచేలుడు.

"ఓ! ఓ! అటుకులంటే ఇష్టం నాకు" అంటూ గుప్పెడుతీసి నోట్లో వేసుకున్నాడు కృష్ణుడు.

"ఎంత బావున్నాయి!" అంటూ నమిలేసి మరో గుప్పెడు తీయబోయాడు.

"చాలు" అంటూ చప్పున అడ్డుకుంది రుక్మిణి. కుచేలుడికి ఘుమ ఘుమ లాడుతున్న నలుగులు పూయించాడు

కృష్ణుడు. పన్నీరు జలక మాడించాడు. చందనం పూయించాడు. ఆరురసాలతోనూ తృప్తిగా భోజనం పెట్టించాడు. కప్పూరపు తాంబూలమిప్పించాడు.

"ఈ బక్క బాపనయ్యకి, మురికి పాతలరాయుడికి ఇంత వైభోగ మెందుకమ్మా?" అంటూ నవ్వుకున్నారు ఆడంగులు.

కొన్నాళ్ళుండి వచ్చేశాడు కుచేలుడు. "ఎందుకు వచ్చావు? ఏం కావాలి?" అని అడగలేదు కృష్ణుడు.

"ఇందుకు వచ్చాను. ఇది కావాలి" అని అడగనూ లేదు కుచేలుడు. ఏమీ ఇవ్వలేదని విచారించనూ లేదు. ఉత్తి చేతులతోనే ఇంటిదారి పట్టాడు బ్రాహ్మడు.

ఎలా వెళ్లాడో అలాగే ఇంటికి వచ్చేశాడు కుచేలుడు. అయితే 'ఏదీ తన పాక? ఈ నాలుగిళ్ళ భవంతి తనదేనా? ఈ గుమ్మాలేమిటి! ఈ మండువాలేమిటి? ఈ నౌకర్లేమిటి?' నివ్వెరపోతూ గుమ్మంలో నించున్నాడు బ్రాహ్మడు.

"రండీ లోపలికి రండీ, అలా నించుండిపోయారేమిటీ? ఇంకా రాలేదేమని చూస్తున్నాన్నేను." అంటూ నవ్వుతూ ఎదురు వచ్చింది ఇల్లాలు. ఆమె వంటినిండా బంగారు నగలున్నాయి.

## పాండవుల పరామర్శ

మయసభ పరాభవంతో కుమిలిపోతూ వచ్చాడు దుర్యోధనుడు. మాయజూదం కల్పించి పాండవుల్ని అడివికి

పంపించాడు. విని వించారించాడు కృష్ణుడు. యాదవులతో కలిసి వెళ్ళి, కామ్యక వనంలో పాండవుల్ని కలుసుకున్నాడు. ద్రౌపదినీ, తమ్ముళ్లతో ధర్మరాజునీ పరామర్శించాడు. కౌరవుల అన్యాయం విని మండిపడ్డాడు. "మాయజూదం మాటే ఎరగన్నేను అప్పుడు సాల్వుడితో యుద్ధంలో వుండి పోయాను. నేనే వుంటే ఇంతపని జరిగేది కాదు." అంటూ ఓదార్చాడు. ద్రౌపదిని సముదాయిస్తూ "చెల్లెమ్మా, విచారించకు. కౌరవులకు కాలం మూడింది." అంటూ ఓదార్చాడు. ధర్మరాజుకి ధైర్యం చెబుతూ కామ్యకంలో కొద్దిరోజులున్నాడు.

ఓనాడు ఏకాంతంగా ద్రౌపదితో కబుర్లు చెబుతూ కూచుంది సత్యభామ. ఆమాటా, ఈమాట చెబుతూ అడిగింది:

"చూడమ్మా, ద్రౌపదీ! నాకు నచ్చిన ఆడబడుచువి నువ్వు. ఏమీ అనుకోనంటే ఓమాట అడుగుతాను. మీ అన్నయ్యని అదుపులో పెట్టలేక సతమతమయిపోతున్నాను. మా అన్నదమ్ములు అయిదుగురినీ ఎలా తిప్పుకుంటున్నావో, ఆశ్చర్యం వేస్తుంది నాకు. దీని గుట్టేమిటో అడగాలని ఎన్నాళ్ళయో అనుకుంటాను. అవకాశం చిక్కలేదు. నువ్వు చెప్పినట్టు వింటారు వాళ్ళు. వాళ్ళంటే నువ్వూ, నువ్వంటే వాళ్ళూ ప్రాణం పెడతారు. ఏమిటి రహస్యం? ఏమైనా మందు పెట్టావా? మంత్రం సాధించావా? పడకలో ఏమైనా మెలకువ సంపాదించావా? అది నాకూ కాస్త చెబితే..."

నవ్వుకుంది ద్రౌపది. చీదరించుకుంది.

"అలాంటి వేవీ తెలీవు వదినా" అంది. "మందులూ,

మాకులూ మా ఇంటా వంటా లేవు. మెలకువలూ, మెరుపులూ ఎరగన్నేను.

మగడు మన మనసు పట్టి నడవాలంటే, వదినా! మనం మగడి మనసు పట్టి నడవాలి. నేనెరిగిన రహస్యమంతా ఇదే నమ్మా!"

పాండవులతో కొద్ది దినాలు గడిపి ద్వారక వచ్చేశాడు కృష్ణుడు. చెల్లెలు సుభద్రనీ, మేనల్లుడు అభిమన్యుణ్ణీ తనతో తీసుకు వచ్చేశాడు. యుద్ధ విద్యలో అభిమన్యుణ్ణి ఆరితేరి నట్టు తరిబీదు చేశాడు.

## రుక్మి

చెల్లెలు రుక్మిణీ పెళ్ళిలో కృష్ణుడిచే ఓడిపోయి, ఒట్టు పెట్టుకున్న ప్రకారం కుండిన పొలిమేర చూడలేదు రుక్మి. భోజకటమే రాజధాని చేసుకున్నాడు. అతడికి రుక్మవతి అని కూతురుండేది. చక్కని చుక్క. కూతురికి స్వయంవరం చాటించాడు రుక్మి. మేనమామ కూతురని స్వయంవరానికి వెళ్ళాడు ప్రద్యుమ్నుడు. ఒక్కడే వెళ్ళాడు.

రుక్మవతి ప్రద్యుమ్నుణ్ణి వరించింది. కృష్ణుడి పగ వుండినా చెల్లెలి కొడుకు కదా అని కాళ్ళు కడిగి కన్య నిచ్చాడు రుక్మి. దీంతో యాదవులతో చుట్టరికం మరింత దగ్గిరయింది. వెనకటి విరోధం సన్నగిల్లుతూ వచ్చింది.

అయితే తాను బలవంతుడు అన్న భావం ఎన్నడూ పోలేదు రుక్మికి. ఆ భావంతోనే కౌరవులూ, పాండవులూ, యుద్ధానికి సిద్ధపడుతున్నపుడు ఉభయుల దగ్గిరికీ వెళ్ళి "మీాకు

భయంవేస్తే నా సాయం కోరండి" అన్నాడు. ఉభయులూ ఇతడి సాయం అక్కరలేదన్నారు. అందుకని అంత వీరుడైనా భారత యుద్ధంలో రుక్మికి చోటు లేకండాపోయింది.

రుక్మికి రోచన అని మనమరాలుండేది. ఆమెని రుక్మిణి మనవడికి- అంటే ప్రద్యుమ్నుడి కొడుకు అనిరుద్ధుడికిచ్చి పెళ్ళిచేశాడు. అసంగతమే అయినా రెండువేపుల వారూ అంగీకరించారు పెళ్ళి.

మనవడి పెళ్ళికి కృష్ణుడూ, బలరాముడూ మొదలైనవారు ద్వారకనించి భోజకటం తర్లివచ్చారు. ఘనంగా జరిగింది పెళ్ళి.

పెళ్ళిలో సరదాగా రుక్మీ, బలరాముడూ పాచికలాట పెట్టుకున్నారు. బలరాముడు చెయ్యి తిరిగిన ఆటగాడు కాడు. కాని సరదా హెచ్చు.

ఒకటి రెండాటలు రుక్మి గెలుచుకున్నాడు. పెద్ద మొత్తం ఒడ్డాడు బలరాముడు. ఆ ఆట రుక్మి ఓడిపోయాడు. కాని బుకాయించాడు. కళింగ దేశం రాజూ మొదలైన రుక్మి స్నేహితులు "అవును, రుక్మే గెలిచాడు" అంటూ గల్లంతు చేశారు.

పదికోట్ల పందెం వొడ్డాడు బలరాముడు. ఈమారూ రుక్మి వోడిపోయాడు. కాని మళ్ళీ "నేనే గెల్చాను" అని బుకాయించాడు. పైగా "ఇది గొల్లపల్లె కాదు బలరామా! భోజకటం. ఛేది రాజధానికి. ఇది సొమ్ములు కాయడం కాదు.

రాజులాడే పాచికలాట!" అంటూ విరగబడిన అతడికి తాళం వేశారు, కళింగరాజూ మొదలైనవారు.

భగ్గుమన్నాడు బలరాముడు. ముసలం తీసి, రుక్మి నడి నెత్తిని కొట్టాడు. సిరసుపగిలి చచ్చిపోయాడు రుక్మి. కళింగం రాజు కనపడితే ఒట్టు. కడమరాజులూ కాలికి బుద్ధి చెప్పారు. ఏమీ అనకండా చూస్తూ వూరుకున్నాడు కృష్ణుడు.

## ఉష కల

ఉష బాణుడి కూతురు. బాణుడు బలిచక్రవర్తి కొడుకు. శోణితపురంరాజు. బలిచక్రవర్తికి నూరుగురు కొడుకులుండే వారు. వారిలో పెద్దవాడు బాణుడు.

ఉష అల్లారు ముద్దుబిడ్డగా పెరిగింది. అపురూపమైన అందకత్తె. దోరవయసులో ఉంది. ఒకనాడు ఆమెకిమంచి కల వచ్చింది.

తన ఈడు అందగాడొకడు- ముసిముసి నవ్వులతో తన దగ్గరికి వచ్చాడు. ప్రేమ కలాపాలు సాగించాడు. పొదివి పట్టుకున్నాడు. ముద్దులు కురిపించాడు. కళలు కరిగించాడు. పొత్తు కలిశాడు.

తెలువుకుంది ఉష. అంతా నిజంలాగే వుంది. అతడు మాత్రం అవుపడలేదు. ఎవరతడు? ఎలా దొరుకుతాడు? ఉస్సురంటూ కూచుంది ఉష.

బాణుడికి కుంభాండుడు అని ఒక మంత్రి వుండేవాడు. అతడికి చిత్రలేఖ అని ఒక కూతురుండేది. ఉషని చూడక

పోతే వుండలేక పోయేది చిత్రలేఖ. ఇద్దరికీ అంత స్నేహం. ఎప్పటిలాగే వచ్చి ఉషని చూసిందామె. ఆవలిస్తే పేవులు లెక్కపెట్టేస్తుంది తాను. అన్నికళలూ తెలుసు తనకి. "ఏమిటి ఉషా! అలా వున్నావు?" అని అడిగింది.

"ఏం లేదూ, కల."

"ఆఁ! ఏం కల? చెప్పు, చెప్పు! మంచి కలేనా? ఎవడైనా——?"

"పోవే. ఎవడో ఏమిటి? అంత అందమయినవాడు ఎక్కడా వుండడు."

"ఆఁ, ఏం చేశాడట?"

"ఏం చెయ్యాలో అదే చేశాడు. అతణ్ణే పెళ్ళి చేసుకుంటాను. చిత్రలేఖా! అతడు లేకపోతే బతకనే, బతకను"

"ఎవరో చెప్పగలవా? పేరయినా చెప్పాడా?"

"లేదు. నువ్వే వెదకాలి."

"నీ కలలో మనిషిని నేనెలా వెదకనూ? పోనీ ఎలా వుంటాడట?"

"చెప్పాను గదా, చెప్పలేనంత అందంగా వుంటాడు. అబ్బా! నేను మరి బతకనే."

"విచారించకు. చిత్రపటం చూస్తే పోల్చగలవు కదా?"

"పోలుస్తాను."

"నా సంగతి నీకు తెలుసుకదా ? నా పేరే చిత్రలేఖ. ప్రపంచంలోని రాజకుమాళ్ళ చిత్రపటాలన్నీ వేస్తాను. అందులో నీవాడెవరో నువ్వు పోల్తిపడితే చాలు, ఎక్కడున్నా, ఎవడైనా లాక్కు వస్తాను విచారించకు."

దేశదేశాల రాజకుమాళ్ళ చిత్రాలు రాసింది చిత్ర లేఖ. ఆ వరసలో ఒక చిత్రపటం చూసి ఉలిక్కిపడింది ఉష. "ఇతడే, ఇతడేనే" అంటూ తల వంచుకుంది.

"ఇంకేం, ఇతడా? ఇతడు అనిరుద్ధుడు. కృష్ణమూర్తి గారి మనవడు. ప్రద్యుమ్నుడి కొడుకు, ద్వారక. మరి బాధ పడకు ఉషా! ఉషారుగా వుండు, ఈ రాత్రే వస్తాడు" అంది చిత్రలేఖ.

శక్తిమంతురాలు చిత్రలేఖ. అసుర మాయలన్నీ ఎరుగు నామె. అర్ధరాత్రి దాటాక ఆకాశమార్గాన ద్వారక వెళ్ళి అనిరుద్ధుడ్ని పట్టుకు వచ్చింది. రెండో కంటి వాడికి తెలీకండా ఉష గదిలోకి చేర్చింది.

ఉషా, అనిరుద్ధులు రాణివాసంలో రహస్యంగా ప్రేమకలాపాలు సాగిస్తూ వచ్చారు.

బాణుడికి వుప్పందింది. వెళ్ళి కళ్ళారా చూశాడు. అని రుద్ధుడ్ని పాశాలతో కట్టి ఖైదులో పడేశాడు.

ఉన్నట్టుండి అనిరుద్ధుడు అవుపడకపోడంతోనే ఆందో ళన పడ్డారు యాదవులు.

మనవడ్ని శోణితపురంలో బాణుడు బంధించాడని విన్నాడు కృష్ణుడు. పెద్ద యాదవ సేనతో వెళ్ళి శోణితపురం ముట్టడించాడు. బలరాముడూ, సాత్యకీ, ప్రద్యుమ్నుడూ, గదుడూ, సాంబుడూ, సారణుడూ, నందుడూ, ఉపనందుడూ, భద్రుడూ - ఇంకా ఎంతోమంది యాదవవీరులూ వెళ్ళి బాణుడి రాజధానిమీద విరుచుకు పడ్డారు. పట్నం పాడు చేశారు. సైనికుల్ని చావగొట్టారు.

బాణుడు బలమంతా ప్రయోగించాడు. ఘోరంగా పోరాడాడు. తుదకి కృష్ణుడితో ఓడిపోయాడు. ఉషని అనిరుద్ధుడికిచ్చి పెళ్ళిచేశారు. సారె పెట్టి సాగనంపాడు.

ఉష కల నిజమయింది.

## ఉత్తర పెళ్ళి

పాండవులు పన్నెండేళ్ళ వనవాసం పూర్తిచేశారు. ఒకయేడు అజ్ఞాతవాసమూ గడిపారు. అదంతా అయాక విరాటరాజు తన కూతురు ఉత్తరని, సుభద్ర కొడుకు అభిమన్యుడి కిచ్చి పెళ్ళిచేశాడు. ద్వారకనించి అభిమన్యుడ్నీ, సుభద్రనీ తీసుకుని విరాటనగరం వచ్చాడు కృష్ణుడు. బలరాముడూ, సాత్యకీ, కృష్ణుడి వియ్యంకుడు కృతవర్మా, అక్రూరుడూ, ప్రద్యుమ్నుడూ, సాంబుడూ, గదుడూ మొదలైన కుమార్లూ, యాదవ ప్రముఖులూ వచ్చారు. అలాగే ద్రుపదుడూ మొదలైన బంధువులూ వచ్చారు. ముచ్చటగా జరిగిపోయింది ఉత్తరాఅభిమన్యుల పెళ్ళి.

నాగవిల్లి నాలుగోనాడు, "తరవాత ఏం చెయ్యాలి?" అంటూ హెచ్చరించాడు, "మాయజూదంలో కౌరవులు పాండవుల రాజ్యం కాజేశారు. న్యాయమో అన్యాయమో పన్నెండేళ్ళు అడవుల్లో వుండి, పదమూడో ఏడు అవుపడకండా వుండి, ఒప్పందం పూర్తిచేశాడు ధర్మరాజు. గడువు పూర్తయినా కాలేదంటున్నాడు దుర్యోధనుడు. ఈ తగువు తెమలకపోతే యుద్ధం తప్పదు. నాకు వాళ్ళెంతో వీళ్ళూ

అంతే. కనక మనలో తగినవారు మధ్యవర్తులుగా వుండి పాండవుల రాజ్యం పాండవుల కిప్పించాలి" అన్నాడు.

"నిజమే" అంటూ అందుకున్నాడు బలరాముడు. "కాని మాయజూద మేముంది? ధర్మరాజుకి ఆటలో సరదా తప్ప, నేరుపు లేదు. ఓడిపోయాడు. కనక కౌరవుల దగ్గిరికి కబురుపంపి, వినయంగా ప్రార్థించి కార్యం సాధించాలి" అన్నాడు.

"ప్రార్థించడం దేనికి?" అంటూ సాగదీశాడు సాత్యకి. "పాండవుల రాజ్యం పాండవులకి రావాలి. దయాధర్మ భిక్ష కాదిది. కాదంటే యుద్ధం చేసి తమరాజ్యం తాము తీసుకుంటారు పాండవులు. మేమంతా వుండనే వున్నాం."

"మీరు ఒప్పుకుంటే మా పురోహితుణ్ణి హస్తిన పంపుతాను" అన్నాడు ద్రుపదుడు.

"బాగుంది" అన్నాడు కృష్ణుడు, "మీ మాట విని ధర్మరాజు రాజ్యం ధర్మరాజుకి ఇస్తే సరేసరి. కాదు, యుద్ధమే తప్పనప్పుడు, సహాయం కోరవలిసిన వారందరికీ కబురుపంపాక, మాకు కబురంపండి ద్వారక."

సభ ముగిసింది. రాజులూ, చుట్టాలూ ఎవరి వూళ్ళకి వాళ్ళు వెళ్ళారు. రామకృష్ణులూ, తక్కిన యాదవులూ ద్వారక వచ్చేశారు.

## సహాయం

ద్రుపదుడు పంపిన రాయబారం ఫలించలేదు. పాండవులూ, కౌరవులూ యుద్ధం తప్పదే అనుకున్నారు.

సహాయంకోసం రాజులందరికీ సందేశాలు పంపారు. ద్వారకకి స్వయంగా దుర్యోధనుడే వచ్చాడు. ముందు కృష్ణుడి దగ్గిరికే వెళ్ళాడు. నిద్రపోతున్నాడు కృష్ణుడు. అతడివేపు ఆసనం మీద కూచున్నాడు దుర్యోధనుడు. అంతలో అర్జునుడూ అక్కడికే వచ్చాడు. కృష్ణుడి కాళ్ళవేపు కూచున్నాడతడు.

కొంచేపట్లో మేలుకున్నాడు కృష్ణుడు. ముందు అర్జునుణ్ణి పలకరించాడు. తరవాత వెనక్కి తిరిగి దుర్యోధనుణ్ణి చూశాడు, కుశలమడిగాడు.

దుర్యోధనుడూ, అర్జునుడూ ఇద్దరూ "యుద్ధంలో నీ సాయం కావాలి" అని కృష్ణుణ్ణి కోరారు.

"నా దగ్గిర పదివేల సేన వుంది. మీలో వాళ్ళ నొకరికిస్తాను. నేను ఒక్కణ్ణీ ఒకరివేపు వస్తాను. నేను ఆయుధం పట్టుకోను, యుద్ధం చేయను. నా సేన యుద్ధం చేస్తుంది. సేన కావాలో నేను కావాలో మీరే కోరుకోండి" అన్నాడు కృష్ణుడు.

"నేను ముందు వచ్చాను, కనక నేను ముందు కోరుకుంటాను" అన్నాడు దుర్యోధనుడు.

"నువ్వు ముందు వచ్చావు. నేను ముందు అర్జునుణ్ణి చూశాను. అంచేత ఇద్దరూ సమానమే. అయితే అర్జునుడు చిన్నవాడు. చిన్నవాడు ముందు కోరుకోవాలి" అన్నాడు కృష్ణుడు.

కృష్ణుడిన్నే కోరుకున్నాడు అర్జునుడు.

దుర్యోధనుడు వెళ్ళాక అర్జునుడిన్ని అడిగాడు కృష్ణుడు:

"యుద్ధం చేసే సైన్యం ఒదిలేసి, ఆయుధమైనా పట్టుకోని నన్ను కోరుకున్నావేమిటి అర్జునా?"

"నువ్వు ఎక్కడుంటే అక్కడే గెలుపు బావా!" అన్నాడు అర్జునుడు.

"నువ్వే గెలుస్తావు. నువ్వు రథివయితే, నేను సారథిగా కూచుంటాను" అన్నాడు కృష్ణుడు.

అర్జునుడితో కలిసి, ధర్మరాజు దగ్గిరికి వచ్చేశాడు.

## రాయబారం

"పోరు నష్టం, పొందు లాభం." ఆలోచించాడు ధర్మరాజు. హస్తిన వెళ్ళి సంధి చేసుకురమ్మని కృష్ణుణ్ణి వేడుకున్నాడు. "మా ఐదుగురికీ అయిదూళ్ళయినా ఇమ్మను. యుద్ధం రాకండా ఆపద తప్పించు" అన్నాడు.

సాత్యకినీ, కృతవర్మనీ వెంట పెట్టుకుని హస్తినాపురం వెళ్ళాడు కృష్ణుడు. విదురుడి ఇంటికి అతిథిగా వెళ్ళాడు. మేనత్త కుంతిని చూశాడు. పాండవుల క్షేమం చెప్పాడు. మర్నాడు కౌరవుల సభకి వెళ్ళాడు. ధర్మరాజు సందేశం ధృతరాష్ట్రుడికి వినిపించాడు.

"నా కొడుకు నా మాట వినడంలేదు." అన్నాడు ధృతరాష్ట్రుడు.

"అయితే అతణ్ణి తరిమేయి. ఒక్కడికోసం కులమంతా బుగ్గి చేసుకోకు" అన్నాడు కృష్ణుడు. నల్లమబ్బులురిమినట్టు కౌరవ సభలో సందేశం వినిపించాడు.

శకునీ, కర్ణుడూ, దుశ్శాసనుడూ, దుర్యోధనుడూ కుమ్మక్కయారు. కృష్ణుడ్ని పట్టుకుని కట్టెయ్యాలని చూశారు.

కనిపెట్టాడు కృష్ణుడు. విశ్వరూపం కనపరిచాడు. సాత్యకీ, కృతవర్మలతో కలిసి కౌరవసభనించి వచ్చేశాడు. కుంతీతోనూ, విదురుడితోనూ చెప్పి ద్వారక వచ్చేశాడు. సాగనంపవచ్చిన కర్ణుడితో అతడి పుట్టుగుట్టు చెప్పి, పాండవులతో చేరమన్నాడు.

"నువ్వు కుంతీ కుమారుడివి. కన్యగా వున్నప్పుడు నిన్ను కన్నదామె, పాండవులలో నువ్వే రాజువవుతావు. ద్రౌపది నిన్నూ మగడిగా వరిస్తుంది." అన్నాడు.

వినుకోలేదు కర్ణుడు. "నన్నే నమ్ముకున్నాడు దుర్యోధనుడు. స్వామి ద్రోహం చెయ్యలేను" అన్నాడు.

పాండవుల దగ్గిరికి వచ్చేశాడు కృష్ణుడు. యుద్ధానికి కురుక్షేత్రం బయలుదేరండన్నాడు. రణభేరీ వేయించాడు.

## బలరాముడి తటస్థ భావం

యుద్ధంకోసం దేశాలన్నీ కుతకుతలాడిపోతున్నాయి. అదంతా నచ్చలేదు బలరాముడికి. ఓవేపు తన ప్రియ శిష్యుడు దుర్యోధనుడు. మరోవేపు తమ్ముడు కృష్ణమూర్తి. అందుకని ఏ వేపూ వెళ్ళక తటస్థంగా వుండిపోయాడు. ముందుగానే తీర్థయాత్రకి వెళిపోయాడు. ప్రభాసం, పృథూదకం, బిందుసరం, సుదర్శనం, విశాలం, బ్రహ్మతీర్థం, చక్ర

తీర్థం వెళ్ళాడు. సరస్వతీ, గంగా, యమునా నదులలో స్నానాలు చేస్తూ, నైమిషారణ్యాం వెళ్ళాడు.

అక్కడ సత్రయాగం చేస్తున్నారు మునులు. రోమహర్షణుడు పురాణ కథలు చెపుతున్నాడు. రోమహర్షణుడు సూతుడు. వ్యాసుడి శిష్యుడు. సూతులు ప్రతిలోమ జాతివారు. అంటే బ్రాహ్మణ స్త్రీకీ, క్షత్రియ పురుషుడికీ కాని, క్షత్రియ స్త్రీకీ వైశ్యుడికీ గాని పుట్టినవారు.

బలరాముడిని చూసి నైమిషారణ్యాం మునులు లేచి గౌరవించారు. రోమహర్షణుడు లేవలేదు, గౌరవించనూలేదు.

"వీడు బ్రాహ్మడు కాడు. అయినా ఎత్తు పీటమీద కూచున్నాడు. పైగా నన్ను చూసి లేవలేదు" అని కోపం తెచ్చుకున్నాడు బలరాముడు. రోమహర్షణుడిని చంపేశాడు.

"అన్యాయం! బలరామా, అన్యాయం" అంటూ అరిచారు మునులు. "దీనికి ప్రాయశ్చిత్తం చేసుకోవాలి నువ్వు" అన్నారు.

చేసిన పనికి నొచ్చుకున్నాడు బలరాముడు. సూతుడికి దీర్ఘాయు విచ్చాడు.

సంతోషించారు మునులు. "రామా ! ఈ ప్రాంతంలో వల్వలుడని ఒక రాక్షసుడున్నాడు. అప్పుడప్పుడు వచ్చి, మా సత్రయాగం పాడుచేస్తూ వుంటాడు. అతడి బాధ లేకండా అనుగ్రహించు" అన్నారు.

ఇలా మునులు అంటూనే వున్నారు. వచ్చి పడ్డాడు వల్వలుడు. ఇల్వలుడి కొడుకతడు. నల్లటి మబ్బులా వున్నాడతడు.

నాగలి తీసి ఒక్కటి వేశాడు బలరాముడు. చచ్చి పూరుకున్నాడు వల్వలుడు.

నైమిషారణ్యంనించి కౌశిక, సరయూ, ప్రయాగ, పులహాశ్రమం, గండకి, గయ, గంగా సముద్ర సంగమం, మహేంద్రం, అఖండగోదావరి, శ్రీశైలం, తిరుమల, వేణా, పంపా, కావేరీ, కన్యాకుమారి మొదలైన తీర్థాలు తిరిగాడు బలరాముడు. కురుక్షేత్రంలో పద్దెనిమిది దినాలు జరిగింది భారతయుద్ధం. పద్దెనిమిది అక్షోణీల సైన్యం హతవయింది. చివరి రోజున కాని తిరిగి రాలేదతడు.

## కృష్ణుడి సారథ్యం

కురుక్షేత్రంలో భారతయుద్ధం ఆరంభమయింది. కృష్ణుడు యుద్ధం చెయ్యలేదు. ఆయుధమూ పట్టుకోలేదు. పట్టుకోవలిసిన పగ్గాలు మాత్రం పట్టుకున్నాడు. రథంమీద సారథిగా కూచున్నాడు. సారథ్యం చేశాడు. యుద్ధం చెయ్య లేదు. కాని యుద్ధమంతా తానే నడిపించాడు. అంత సేనా తానే చంపించాడు. కృష్ణుడు లేని యుద్ధంలేదు.

అర్జునుడికే కాదు, పాండవులకే సారథి కృష్ణుడు. సారథి మాత్రమే కాదు—మంత్రి, బంధువు, గురువు, దేవుడు.

పద్దెనిమిది దినాలు ఘోరంగా జరిగిపోయింది భారత యుద్ధం. పద్దెనిమిది అక్షోణీల సైన్యం హతవారిపోయింది. చివరినాడు భీముడికీ దుర్యోధనుడికీ గదాయుద్ధం నిశ్చయ మయింది.

తీర్థయాత్ర ముగించి ప్రభాసతీర్థంకి వచ్చి విన్నాడు బలరాముడు.

ఈ గదాయుద్ధం కాకండా చూడాలని కురుక్షేత్రం వచ్చాడు.

"సమయంకాని సమయంలో వచ్చాడు అన్నయ్య. ఎటుపోయి ఎటోస్తుందో!" అనుకున్నాడు కృష్ణుడు. ధర్మరాజుతో కలిసి ఎదురు వెళ్ళాడు. నమస్కరించి రణస్థలానికి తీసుకువచ్చాడు.

భీముడూ, దుర్యోధనుడూ గదలెత్తి పట్టుకున్నారు. కొట్టుకోడానికి సిద్ధంగా వున్నారు.

"ఆగండి" అన్నాడు బలరాముడు, "భీమా! నువ్వు బలవంతుడివి. నాకు తెలుసు. కాని గదలో మెలకువ లెరగవు. కనక దుర్యోధనుణ్ణి గెలవ లేవు. దుర్యోధనా! గదలో నేర్పుంది నీకు. కాని బలంలో భీముడి ముందు తీసికట్టు. కనక నువ్వూ గెలవలేవు. ఇద్దరికిద్దరూ సమానమే కనక గదా యుద్ధం కట్టిపెట్టండి."

బలరాముడి మాట చెవిని పెట్టలేదు దుర్యోధనుడు. అటు వేపు చూడన్నా చూడలేదు భీముడు.

"సరే, అనుభవించండి" అంటూ ద్వారక వెళ్ళిపోయాడు బలరాముడు.

భీముడూ,దుర్యోధనుడూ కలబడ్డారు.ఖణేల్ ఖణేల్ మని నిప్పులు కక్కాయి గదలు కళ్ళు మూసుకుపోయాయి. ఒళ్ళు గరిపొడిచింది. బలరాముడు సరిగానే బేరీజు కట్టాడు.

ఒకడు బలంలో గట్టివాడయితే, ఒకడు ఒడుపులో గడుసు వాడు.

చూస్తూనే వున్నాడు కృష్ణుడు. గెలుపు తక్కెడ ముల్లులాగ అటూ, ఇటూ వూగిసలాడి నవ్వాడు, భీముడు చూసినట్టు తన తొడమీద చరుచుకున్నాడు. సైగ గ్రహించాడు భీముడు. దుర్యోధనుడి తొడలమీద కొట్టేశాడు. తొడలు విరిగి పడిపోయాడు దుర్యోధనుడు.

అక్కణ్ణుంచి సాత్యకినీ, పాండవులైదుగురినీ గుడారాలకి దూరంగా తీసుకుపోయాడు కృష్ణుడు ఆరాత్రి పాండవుల గుడారాలలో చొరబడ్డాడు అశ్వత్థామ. అందరితోపాటు ద్రౌపది కుమాళ్ళని అయిదుగురినీ చంపేశాడు.

కొడుకుల చావువిని నేల గేవుతూ ఏడ్చింది ద్రౌపది. అశ్వత్థామని హతవారుస్తానని బయలుదేరాడు అర్జునుడు. రథం పూసి పగ్గాలు పట్టుకు కూచున్నాడు సారథి కృష్ణుడు. విల్లూ, బాణాలూ పట్టుకు కూచున్నాడు అర్జునుడు. పారిపోయిన అశ్వత్థామ మీదికి పరుగులు తీసింది అర్జునుడి తెల్లగుర్రాల రథం.

ఆపద గమనించాడు అశ్వత్థామ. అమాంతం బ్రహ్మాస్త్రం ప్రయోగించాడు.

"నువ్వూ బ్రహ్మాస్త్రం వెయి" అంటూ అర్జునుణ్ణి తొందర చేశాడు కృష్ణుడు. బ్రహ్మాస్త్రానికి బ్రహ్మాస్త్రమే వేశాడు అర్జునుడు. ప్రళయం పుట్టినట్టయింది. పెద్దపెద్ద మునులు పరిగెత్తుకు వచ్చారు. అశ్వద్ధామనీ అర్జునుణ్ణీ అస్త్రాలు ఉపసంహరించమన్నారు.

అర్జునుడు ఉపసంహరించాడు. బ్రహ్మాస్త్రం వెయ్యడమే తెలుసు అశ్వత్థామకి. ఉపసంహరించడం తెలీదు. అందుకని అతడి అస్త్రమూ అర్జునుడే ఉపసంహరించాడు.

అయితే అశ్వత్థామని పట్టేశాడు అర్జునుడు. "కనికరించకు వీణ్ణి" అన్నాడు కృష్ణుడు.

అశ్వత్థామని కట్టేసి ద్రౌపది దగ్గిరికి తీసుకు వచ్చాడు అర్జునుడు.

అశ్వత్థామ తలలో సహజమైన మణి వుండేది. కృష్ణుడి మాట మీాద అతడి తల కత్తిరించి మణి తీసుకున్నాడు అర్జునుడు.

"ఇదిచాలు, విడిచిపెట్టు" అన్నాడు కృష్ణుడు, "ఎంత యినా బ్రాహ్మడు. గురువు కొడుకు. జుత్తు కత్తిరించడమూ, మణి లాక్కోడమూ చంపడంతో సమానం" అన్నాడు.

"అవును, కొడుకులకోసం నా కడుపు తరుక్కుపోతున్నట్టే ఇతణ్ణి చంపేస్తే, ఇతడి తల్లి కృపి కడుపు చెరువయిపోతుంది. కట్లువిప్పి, ఒదిలేయండి" అంది ద్రౌపది.

భీముడు మాత్రం పళ్ళు పటపట కొరికాడు.

కట్లు విప్పేశాడు అర్జునుడు. తల ఒంచుకు వెళిపోయాడు అశ్వత్థామ.

భారతయుద్ధం అయిపోయింది. పెద్ద వల్లకాడులా వుంది కురుక్షేత్రం. హస్తిన నుంచి గాంధారీ, ధృతరాష్ట్రుడూ, తలచెడిన వందమంది కోడళ్ళూ, ఎంతో మంది రాణివాసం స్త్రీలూ వచ్చారు. ద్రౌపదీ, సుభద్రా మొదలయిన

పాండవుల స్త్రీలూ వచ్చారు. తమతమ భర్తలా, కుమాళ్ళా శవాల మీదపడి గోలుగోలుమన్నారు.

గాంధారీ ధృతరాష్ట్రులకి నమస్కరించారు పాండవులు. భీముణ్ణి కౌగిలించుకోబోయాడు ధృతరాష్ట్రుడు. భీముణ్ణి వెనక్కిలాగి, ఉక్కుభీముణ్ణి గుడ్డిరాజుకి అందించాడు కృష్ణుడు. ధృతరాష్ట్రుడి కౌగిలిలో గుండపిండి అయిపోయింది వుక్కుభీముడు. ముందే పసికట్టి వుక్కుభీముణ్ణి పెట్టాడు కృష్ణుడు.

శవాల రణరంగం గమనించింది గాంధారి. "ఇదంతా నువ్వే చేశావు" అంటూ కృష్ణుణ్ణి శపించింది.

"కౌరవవంశంలాగే ముప్ఫయ్యారేళ్ళ తరవాత మీ యాదవవంశం నాశనమవుతుంది" అంది.

"నువ్వు అన్నా, అనకపోయినా అది అలాగే జరుగుతుంది" అన్నాడు కృష్ణుడు.

## పరీక్షిత్తు

"అపాండవం కావాలి" అంటూ మహాస్త్రం ఒదిలాడు అశ్వత్థామ. అగ్గికురుస్తూ పాండవుల మీదికి వచ్చిందది. అస్త్రాలు పట్టుకు సిద్ధపడ్డారు పాండవులు.

"అస్త్రాలు దీనిమీద పని చెయ్యవు. కింద పడెయ్యండి" అంటూ తన సుదర్శనంతో దాన్ని చెదరగొట్టాడు కృష్ణుడు.

అయితే అభిమన్యుడి భార్య ఉత్తర చూలాలుగా వుంది అప్పటికి. పాండవుల వంశం నిలవాలంటే ఆమె

గర్భంలోని మొలకే ఆధారం. అశ్వత్థామ అస్త్రం ఉత్తర గర్భాన్ని వేధించింది. కృష్ణుడి ముందు మొరపెట్టింది ఉత్తర. శిశువుని రక్షించాడు కృష్ణుడు. కుమారుణ్ణి కంది ఉత్తర. అతడే పరీక్షిత్తు.

యుద్ధానంతరం పాండవులతో హస్తిన వెళ్ళాడు కృష్ణుడు. ధర్మరాజు పట్టాభిషేకం ఘనంగా జరిపించాడు. అతడి విచారం పోగొడుతూ కొన్నాళ్ళు అక్కడే వున్నాడు.

అన్నీ అయినా కోలుకోలేదు ధర్మరాజు. అంతమంది బంధువుల్ని, ప్రజల్ని యుద్ధంలో చంపినందుకు దుఃఖంగా వుండే దతడికి. రాజ్యభోగాలు రుచించేవి కావు. అప్పుడప్పుడు అన్నీ వొదిలి అడివికి పోవాలనుకునేవాడు. అతడు కుదుట పడాలంటే జ్ఞానం ఉపదేశించడం అవసరం అనుకున్నాడు కృష్ణుడు. తాను చెప్పిందంతా చెప్పాడు. భీష్ముడిచేతా చెప్పించా లనుకున్నాడు. అంపశయ్యమీద పడున్నాడు భీష్ముడు. అన్నీ తెలిసిన మహాత్ము డతడు.

ధర్మరాజుని తమ్ముళ్ళతోకూడా భీష్ముడి దగ్గిరికి తీసుకువెళ్ళాడు కృష్ణుడు. అంపశయ్యమీాంచే అందరినీ ఆదరించాడు భీష్ముడు. కృష్ణుడ్ని కీర్తించాడు. అతడి మాట ప్రకారం ధర్మరాజుకి అంతులేని జ్ఞానం ఉపదేశించాడు. ధర్మరాజు అడుగుతూ వచ్చాడు. భీష్ముడు విసుగు లేకండా చెపుతూ వచ్చాడు.

ధర్మాలూ, ధర్మరహస్యాలూ, ఆశ్రమాలూ, ఆశ్రమ ధర్మాలూ, ధర్మార్థ కామమోక్షాలూ, వాటి మర్మాలూ,

రాజనీతులూ, వాటి లోతులూ, ఉపఖ్యానాలతో వినిపించాడు.

తనచావు తన చేతిలోనే వుండేది భీష్ముడికి. ఉత్తరాయణం వచ్చేవరకూ అంపశయ్యమీదే వున్నాడతడు. ఉత్తరాయణం వచ్చాక కృష్ణుడిమీద దృష్టినిలిపి శరీరం వొదిలి పెట్టాడు. తుది ఘడియల్లో కృష్ణుడూ, పాండవులూ, మునులూ, పర్వతుడూ, నారదుడూ, ధౌమ్యుడూ, వ్యాసుడూ, భరద్వాజుడూ, వశిష్ఠుడూ, త్రితుడూ, అసితుడూ, గౌతముడూ, అత్రీ, విశ్వామిత్రుడూ, అతడిచుట్టూ కూచున్నారు.

కృష్ణుడ్నీ, పాండవుల్నీ ఓమారు కళ్ళువిప్పి చూశాడు భీష్ముడు. అతడి కళ్ళల్లో నీళ్ళు కమ్మాయి. పాండవులతో ఇలా అన్నాడు:

"వెళుతున్నానయ్యా నేను. కృష్ణుడినీడ వుంది మీకు. ఇంతకంటే ఏం కావాలి? పడరాని కష్టాలు పడ్డారు మీరు. దీనికి కాలమే కారణం. మనిషి ఏమీ చెయ్యలేడు. కాలగతి కానలేం. వీరాధి వీరులు మీరు. పైగా కృష్ణుడు బంధువు. అయినా తప్పలేదు కష్టాలు! మీ కష్టాలు తలుచుకుంటే గుండె తరుక్కుపోతుంది.

ఇవేవీ కళ్ళ చూడకండా వెళిపోయాడు పాండురాజు. పసికూనల్ని పట్టుకుని హస్తిన వచ్చింది పాపం కుంతి. తండ్రి లేని బిడ్డలకోసం ఎన్ని పాట్లు పడింది! పాండురాజు తరువాత నువ్వే అండ అని నీకే అప్పగించింది కొడుకుల్ని.

మీకు నమ్మిన చుట్టమయ్యాడు కృష్ణుడు. మంత్రి అయ్యాడు. దూత అయ్యాడు తుదకి. సారథిగా పని చేసాడు. ఎంత గొప్పవాడు! ఎవరు గుర్తించగలరితడ్ని!

అర్జునుడి రథం నామీదికి వురికించినప్పుడు, నా బాణాలతో కవచం పగిలి, నన్ను చంపుతానని రథం దూకినప్పుడు చూశాను, సామాన్యుడా కృష్ణుడు! ఆయుధం పట్టనన్నా నాకోసం ఆయుధం పట్టుకున్నాడు.

అంత మహాయుద్ధంలో, ఆ పది రోజులూ, అర్జునుడి రథంమీద పగ్గాలు పట్టుకుని రణరంగ మంతా తానే కన పడ్డాడు నాకు. పీరులు తెగిపోతూ వుంటే, రక్తాలు వరద కడుతూ వుంటే చిరునవ్వు మాయని ఈ కృష్ణుడి మొహం కళ్ళముందే వుంటుంది నాకు.

ఈ చిరునవ్వే గొల్లభామల్ని వెర్రెత్తించి వుంటుంది.

ప్రణయమూ, ప్రళయమూ ఒకటే ఈ కృష్ణుడికి. ఇతడు మీవాడు, కొరతేమిటి మీకు?"

అలా అని కృష్ణుడ్ని స్తుతించి కళ్ళు మూశాడు భీష్ముడు.

గొల్లుమన్నారు పాండవులు. కంటతడి పెట్టుకున్నాడు కృష్ణుడు. గంభీరముద్ర వహించారు మునులు.

భీష్ముడి అపర క్రియలు యథావిధిగా జరిపించాడు ధర్మరాజు. తాత మరణంతో మరింత కుంగిపోయాడతడు.

"రాజ్యంకోసమని తాతవంటివాణ్ణి చంపుకున్నాను." అంటూ దుఃఖపడ్డాడు, "తెలివిమాలిన వాణ్ణి. నిలకడ లేని

బతుకుకోసం, కాకులూ గెద్దలూ పీక్కు తినే ఈ పాడు దేహం కోసం, జానెడు పొట్టకోసం పద్దెనిమిది అక్షౌహిణీల సేన వల్ల కొట్టిపాలు చేశాను. నెత్తురుకూటికి తెగించాను. ఎంతమంది తల్లులు కొడుకుల కోసం ఏడుస్తున్నారు! ఎంతమంది మగల కోసం మొత్తుకుంటున్నారు. ఎంత నిష్ఠురం క్షత్రియధర్మం!

ఎంతపాపం చేశాను. గృహస్థాశ్రమంలో శాంతి లేదు నాకు. కల్లు పులుముకుని, కల్లుతో కడగడమే అవుతుందిది. అందుకని అడివికి పోతాను." అంటూ కన్నీళ్ళు కారుస్తూ కూచున్నాడు. విచారిస్తూ కూచున్నాడు.

జ్ఞానం బోధించి ఓదార్చాడు కృష్ణుడు:

"రాజా! తెలియని మనిషిలా విచారిస్తున్నావు. నీ దుఃఖం, మరణించిన వారికీ దుఃఖం కలిగిస్తుంది. నువ్వు విచారించిన మాత్రాన వారు మళ్ళీ రారు కదా! అన్నీ భీష్ముడి దగ్గిర తెలుసుకున్నావు. తిరిగీ అజ్ఞానంలో పడి పోతున్నావు. తాతతండ్రుల రాజ్యం, ధర్మయుద్ధంలో గెల్చు కున్న రాజ్యం విడిచిపెట్టి అడివికి పోతాననడం అవివేకం. పలాయనం పాపం. ధర్మరాజువి నువ్వు. ధర్మం పాలించు. నీ విచారానికి మోహమే కారణం. ఇది పోవాలంటే బయటి శత్రువుల్ని కాదు, లోపలి శత్రువుల్ని జయించు. విచారం విడిచిపెట్టు. విచారం వినాశనం కలిగిస్తుంది" అన్నాడు.

"అవును" అంటూ కృష్ణుణ్ణి సమర్ధించాడు వ్యాసముని, "ధర్మరాజా! నువ్వేదో పాపం చేశానని బాధపడుతున్నావు కదూ, నువ్వు చేసిన పాపమేమీ లేదు. యుద్ధం రాజుల ధర్మం. తాను చావడమో ఎదటివాణ్ణి చంపడమో యుద్ధంలో

తప్పనిసరి. దీనికింత దుఃఖందేనికి? అయినా నీ విచారం పోడానికి ఉపాయం చెపుతాను. అశ్వమేధ యజ్ఞం చెయ్యి. పాపాలు పోతాయి. తాపాలు తీరతాయి" అన్నాడు.

"యజ్ఞాలకి ధనమెక్కడుంది తండ్రీ!" జాలిగా అన్నాడు ధర్మరాజు, "ధనాగారంలో ధనమంతా యుద్ధంలో వినియోగించేశాడు దుర్యోధనుడు."

"ధనంకోసం విచారించకు" - అందుకున్నాడు వ్యాసుడు. "పూర్వం మరుత్తరాజు యజ్ఞంలో గుట్టలుగుట్టలు బంగారం మిగిలింది. అదంతా హిమాలయం దగ్గర గుప్తంగా పడుంది. ఇప్పుడు ఎవరిదీ కాదది. ఎవరయినా తెచ్చుకో వచ్చు. అది తెచ్చుకో, అశ్వమేధం చెయ్యి."

"బాగుంది" అన్నాడు కృష్ణుడు. తమ్ముళ్ళని పంపాడు ధర్మరాజు.

భీమార్జునులూ, నకుల సహదేవులూ వెళ్ళారు. రథాలమీదా, ఏనుగులమీదా, లొట్టిపిటలమీదా, గుర్రాల మీదా, కంచర గాడిదలమీద బంగారం రాసులు పట్టించుకు వచ్చారు. ఏ లోపమూ లేకుండా "ఔరా!" అన్నట్టు జరిగింది అశ్వమేధం.

అలా ధర్మరాజు చేత మూడు అశ్వమేధాలు చేయించాడు కృష్ణుడు. అతడి ఉపదేశం పాలిస్తూ రాజ్య మేలుతూ వచ్చాడు ధర్మరాజు. తమ్ములు తలలో నాలుకలాగ మసులుకుంటూ వుండేవారు.

అదునికి వానలు పడేవి. పాడీ పంటా పుష్కలంగా వుండేవి. దారిదోపుళ్ళు, దొంగతనాలూ నాశనమయాయి.

అబ్దాలూ, లంచాలూ అంతరించాయి. కరువులూ, కాటకాలూ కరువయాయి. మనవడు ఉత్తర కొడుకంటే ముచ్చట పడేవాడు ధర్మరాజు. ధౌమ్యుడిచేతా, కృపాచార్యుడిచేతా జాతకర్మలు చేయించాడు. గొప్పవాడవుతాడంటే మురిసిపోయేవాడు. పాండురాజంత వాడవుతాడంటే పక్కున నవ్వేవాడు.

తల్లి కడుపులో వున్నప్పుడు కృష్ణుణ్ణి కలలో చూశాడు ఉత్తరకొడుకు. అందుకని అలాటి మనిషి - నల్లకలవలాటి శరీరమూ, తామర రేకుల్లాటి కళ్ళూ, పసుప్పచ్చటి పట్టు బట్టలూ, చిరునవ్వుతో కలకల్లాడుతున్న మొహమూ - ఎంచక్కా కనబడ్డాడు కలలో కృష్ణుడు. ఆ కలలో మనిషి కనపడతాడా అని అందరినీ పరీక్షగా చూసేవాడు కుర్రాడు. అందుకని అతడిపేరు పరీక్షిత్తు అన్నాడు ధర్మరాజు.

## ద్వారక తిరుగుపయనం

భీష్ముడిమరణంతో కౌరవుల అఖండజ్యోతి ఆరిపోయింది. కురుక్షేత్రం రణరంగంలో కృష్ణుడూ, అతడి బావమరుదులూ అయిదుగురు పాండవులూ, అతడి తమ్ముడు సాత్యకీ, వియ్యంకుడు కృతవర్మా, కృపుడూ అతడి బావ అశ్వత్థామా, యుయుత్సుడూ మాత్రం మిగిలారు.

ఆయుధం పట్టకండా, తల పూవు వాడకండా అంతా తానే నిర్వహించాడు కృష్ణుడు. ధర్మరాజుని గద్దె ఎక్కించాడు. అతడిచేత అశ్వమేధం చేయించాడు. తన మేనల్లుడి కొడుకుని కౌరవ రాజ్యానికి వారసుడిగా నిలిపాడు.

అలా కొన్నాళ్ళు హస్తినలో వుండి ద్వారక పయన మయాడు కృష్ణుడు. "వెళ్ళి వస్తాను" అంటే ఒప్పుకోక, ఒప్పుకోక తల వూపాడు ధర్మరాజు. అర్జునుడు పాదివి పట్టుకుని ఏడ్చాడు. భీముడూ, నకులసహదేవులూ, అలాగే కళ్ళ నీళ్ళు పెట్టుకున్నారు. ద్రౌపదీ, సుభద్రా, కుంతీ, ఉత్తరా, గాంధారీ - ఇంకా వుండమంటూ బలవంత పెట్టారు.

అందరికీ అన్ని విధాలా నచ్చచెప్పి బయలుదేరాడు కృష్ణుడు. అంతకాలం కలిసిమెలిసి వున్నవాళ్ళని విడిచి వెళ్ళడమంటే తనకీ కష్టంగానే వుంది.

రథం సిద్ధమయింది. శంఖాలు పూరించారు. మద్దెళ్ళు మోయించారు. భేరీలు వాయించారు. వీణలు మీటారు.

రథమెక్కి కూచున్నాడు కృష్ణుడు. అర్జునుడు ముత్యాలతెల్లగొడుగ పట్టాడు. సాత్యకీ, ఉద్ధవుడూ చామరాలు వీచారు.

అర్జునుడితోపాటు ధర్మరాజూ, భీముడూ, నకులసహదేవులూ ఎంతో దూరం వెళ్ళి సాగనంపారు. హస్తిన రాజ వీధి పూలవాన కురిపించారు ప్రజలు. మేడలమీదా, మిద్దెల మీదా స్త్రీలు గుంపులు గుంపులు చూశారు. కృష్ణుడి 'థలే చెప్పుకున్నారు.

వెంట వచ్చిన వాళ్ళని మళ్ళించి రథం పోనిచ్చాడు కృష్ణుడు. కురుజాంగలం, పాంచాలం, శూరసేనం, యామునం, బ్రహ్మావర్తం, కురుక్షేత్రం, మత్స్యం, సారస్వతం మొదలైన దేశాలమీంచి మరుదేశం వెళ్ళాడు. అక్కడ ఉత్తంకుడి ఆశ్రమంలో ఆగాడు.

కుశల మడిగాక కృష్ణుడితో అన్నాడు ఉత్తంకుడు. "కృష్ణా! సర్వ సమర్థుడివి నువ్వు. నువ్వే ప్రయత్నించి వుంటే, భారతయుద్ధం జరిగేదికాదు. ఈ రోజున నాశనం జరిగేదికాదు. కనక నువ్వే అపరాధివి. నిన్ను శపిస్తాను."

"పొరపడుతున్నావు" అంటూ విశ్వరూపం చూపాడు కృష్ణుడు. చేతులు జోడించాడు ఉత్తంకముని.

అక్కడ్నుంచి ఆనర్తదేశం వచ్చేశాడు కృష్ణుడు. దారి కడాకూ పల్లెలూ, పట్టణాలూ జేజేలుచేస్తూ వచ్చాయి కృష్ణుడికి. పగలు ప్రయాణంచేస్తూ, పొద్దుగూకే వేళకి నీళ్ళున్న దగ్గిర మకాం జేస్తూ అలా ఆనర్తదేశం చేరాడు.

ఆనర్త పొలిమేర తగలగానే పాంచజన్యం పూరించాడు.

"వచ్చేశాడు కృష్ణుడు, వచ్చేశాడు. రండి, రండి" అని పిల్చుకుంటూ రథానికి ఎదురు వచ్చారు ఆనర్తం ప్రజలు. ఆడా మగా గుంపులు గుంపులు వచ్చి సాగిలబడ్డారు.

అంతమందినీ ఆదరిస్తూ, ద్వారకలోకి వెళ్ళాడు కృష్ణుడు. మెరికల్లాంటి భటులూ, దశార్హ, కుకుర, అంధక వృష్ణి వీరులూ కంటికి రెప్పలా కాపాడుతున్నారు, ద్వారక. అందరూ చేతులు జోడించి బారులుతీరి నించున్నారు.

చిత్రకం, పంచవర్ణం, పాంచజన్యం, మేరుప్రభ, పుష్పకం, శతావర్తం, చైత్రం, నందనం, భావనం, రమణం అని రకరకాల ఉపవనాలతోనూ, బంగారం ప్రాకారాల తోనూ, లోతునీటి కందకాలతోనూ, మేఘాలంటే మేడల

తోనూ, నాలుగిళ్ళ భవంతులతోనూ, ముత్యాల ముగ్గుల ముంగిళ్ళ తోనూ, గంధర్వ నగరంలా వుంది ద్వారక.

పాంచజన్యం వినపడడంతోనే వసుదేవుడూ, బలరాముడూ, ఉగ్రసేనుడూ, అక్రూరుడూ, ప్రద్యుమ్నుడూ, సాంబుడూ, చారుదేష్ణుడూ, ఎలా వున్నవాళ్ళు అలా లేచారు. ఎదురు వెళ్లారు. బాజాలూ, భజంత్రీలూ, శంఖాలూ, భేరీ మృదంగాలూ, భోగం మేళాలూ, ఏనుగులూ, గుర్రాలూ- పెద్ద ఉత్సవమే ఎదురు వెళ్ళింది. వంది మాగదులు యాదవవంశం కీర్తించారు. కృష్ణుడి కథలు పాటలు పాడారు. ఆడా మగా, ఆబాల గోపాలం వీధుల నిండా మూగారు. దారికడాకూ కిటకిటలాడారు.

వసుదేవుడికీ, ఉగ్రసేనుడికీ, బలరాముడికీ నమస్కారం చేశాడు కృష్ణుడు. బంధువులీన్ని, స్నేహితులీన్ని కౌగలించుకున్నాడు. కుమాళ్ళ వందనాలందుకున్నాడు. సిరసులు ముద్దాడాడు. అందరి క్షేమం విచారించాడు.

లోగిళ్ళలోకి వెళ్ళి ఏడుగురు అమ్మలకీ నమస్కారాలు చేశాడు. రుక్మిణీ మొదలైన ఎనమండుగురు దేవేర్లలోగిళ్ళకీ, పదహారువేల మంది భార్యల లోగిళ్ళలోకీ వెళ్లాడు. అందరితోనూ ఆనందంగా పలకరించాడు. చిరు చిరు నవ్వులతో సల్లాపాలాడాడు.

అమావాస్యపోయి, పున్నమిలో ఎలా వుంటుంది ప్రపంచం, అదిగో అలాగ కలకలలాడింది ద్వారకా పట్నం. రోజుకి రోజు పెరుగుతూ వుండేది. యాదవకులం తామర తంపరగా పెరిగింది. యాదవ కుమాళ్ళ లెక్క కోట్లకి

మించింది. సేనలు ఇక చెప్పనే అక్కరలేదు. ఒక్క ద్వారకా నగరంలోనే ఎనిమిది వేల రథాలు తిరుగుతూ వుండేవి. బురుజుల మీాద ఒకేసారి వందేసిమంది పగవాళ్ళ చంపే యంత్రాలూ, చక్రాలూ అమర్చి వుండేవి. రైవతక పర్వతం మీాద ఆడాళ్ళు కూడా యుద్ధం చెయ్యడానికి అనువయిన కోటలుండేవి.

## కృష్ణుడి భార్యలు

ద్వారకలో ఆడంగులందరూ అందంగా వుండేవారు. నిండుగా ముస్తాబులయే వాళ్ళు. పాటలు పాడే వాళ్ళు. బంతులాడే వాళ్ళు. కోకిలలు కో అంటే కో అనేవాళ్ళు. చిలకలు కిలకిలమంటే కిలకిలమనేవాళ్ళు. తామరకోనేళ్ళలో జలక్రీడలాడేవాళ్ళు.

కృష్ణుడి పదహారువేలమంది భార్యల లోగిళ్ళలోనూ కోనేళ్ళుండేవి. అన్నిటిలోనూ రకరకాల తామరలు పూసేవి. తుమ్మెలు పాడేవి. రాజహంసలు ఈదేవి. అన్నిటిలోనూ అన్ని రూపాలయి జలక్రీడలాడేవాడు కృష్ణుడు. భార్యలమీాద నీళ్ళు చిమ్మేవాడు. వాళ్ళందరూ ఒక్కటయి అతడిమీాద పడే వాళ్ళు. వాళ్ళ రొమ్ముల పరిమళాలు అతడి ఒళ్ళంతా పరిమళించేవి.

కృష్ణుడు కనుమరుగయితే చాలు విరహంతో వెర్రెత్తి పోయేవారు అతడి భార్యలు. విరహగీతాలు పాడేవారు మిపపెట్టి.

"కన్ను మూతపడదా కురరీ? రాతిరి గుసగుస విన పడదూ! నాలాగే ఏడుస్తున్నావంటే నీవాడికోసం!"

అనేది వొకామె.

"నల్లని సామిలాగే కనపడలేదటే చక్రవాకీ? రాత్రంతా ఏడుపుతోనే గడిచిపోతుందే?"

అనేది మరొకామె.

"కడలీ! నాలాగే మరుగుతూందా నీ మనసు? సిటమైనా పూరుకోవు, పగలనవు, రేయనవు. హోరుమని ఏడుస్తావు. ఎందుకమ్మా ఈ విరహం?"

అంటూ వుస్సురనేదొకావిడ.

"అయ్యో, సంపంగీ! ఎందుకని ఇలా చిక్కిపోతావూ? కనికరిస్తాడా కృష్ణుడు?"

అనేది మరొకావిడ.

"అబ్బా! ఎందుకమ్మా గాలీ, మండుతున్న వాళ్ళు మరింత మండిస్తావు? ఏ పొదలో వున్నాడమ్మా, అతణ్ణి రాసుకువచ్చావు?"

అంటూ కళ్ళు తుడుచుకునేది ఒక భామ.

"కన్నీరు కార్చినా, కంఠమెత్తి ఏడ్చినా, నా బతుకూ, నీ బతుకూ ఒకటేనా మబ్బూ! నల్లనివాణ్ణి నమ్ముకుంటే బతుకంతా చీకటే."

అంటూ ఆకాశం చూసే దొకతె.

"కుహూ, కుహూ! కోకిలమ్మా! నాలాగే పిలుస్తున్నావా? పిల్లంగోవి వూత్తున్నావా?" అనేది వేరొకామె.

"రావే, రావే, రాజహంసీ! కబురు తెచ్చావా? రమ్మన్నాడా? నన్నే రమ్మన్నాడా?"

అంటూ హంసలాగే నడిచేది ఒకామె.

ఇలా రకరకాలయేవారు వాళ్ళు. ఇంతలోనే కృష్ణుడ్ని చూసి వింతవింతలయే వాళ్ళు. అందరినీ ఆనంద పరిచేవాడు కృష్ణుడు. ఎవరికి వారు తమనే ప్రేమిస్తున్నాడన్నట్టు నటించే వాడు.

## కుబ్జ కొడుకు

అవాళ మథురలో కృష్ణుడితో పొత్తుకలిసి, గర్భవతి అయింది కుబ్జ—త్రివక్రి. నెలలు నిండాక కొడుకుని కంది. అతడి పేరు ఉపశ్లోకుడు.

కృష్ణుడి స్పర్శతో గూనిపోయి అందాల రాణిగా వుండేది కుబ్జ. కృష్ణుడి పొందుతో కొడుకుని కని మహారాణిలా మురిసింది. కొడుకుని అల్లారుముద్దుగా పెంచింది. విద్యాబుద్ధులు నేర్పింది. ప్రయోజకుణ్ణి చేసింది.

తండ్రిని కృష్ణుణ్ణి సేవించాడు కుబ్జ కొడుకు ఉపశ్లోకుడు. గొప్ప జ్ఞానవంతుడయాడు. "సాత్వతసంహిత"అని తంత్రశాస్త్రం రాశాడు. ఆడాళ్ళకీ, అన్నికులాల వాళ్ళకీ వైష్ణవ సంస్కారం కల్పించాడు. శూద్రుడనీ, బ్రాహ్మడనీ భేదం లేకుండా చేశాడు.

ఉపశ్లోకుడి సాత్వతతంత్రం ముక్తి మార్గానికి మేలి బాట అయింది.

కృష్ణుడి కుమాళ్ళూ, మనవలూ ఇంతమంది అని

చెప్పడం అంత తేలికపని కాదు. వాళ్ళకి చదువు చెప్పే గురువుల సంఖ్యా ఇంతా అంతా కాదు.

కృష్ణుడి కొడుకులూ, మనవలూ వీరాధివీరులు. వాళ్ళందరిలోకీ రుక్మిణి కొడుకు ప్రద్యుమ్నుడు కృష్ణుడంత ప్రతాపవంతుడు. అతడి కొడుకు అనిరుద్ధుడు తండ్రికి తగిన కొడుకు. ఎన్నో ఏనుగులంత బలశాలి అతడు.

అనిరుద్ధుడి కొడుకు వజ్రుడు. అతడి కొడుకు ప్రతిబాహుడు. ప్రతిబాహుడి కొడుకు సుబాహుడు. ఇతడి కొడుకు ఉగ్రసేనుడు. ఈ ఉగ్రసేనుడి కొడుకు శాంతసేనుడు. శాంతసేనుడి కొడుకు శతసేనుడు.

అనిరుద్ధుడి కొడుకు వజ్రుడు యాదవుల మలితరానికి మొలకగా నిలిచాడు.

కృష్ణుడి కుమాళ్ళలో అనిరుద్ధుడని ఒక కుమారుడు కూడా వుండేవాడు.

ద్వారకలో యాదవ కుమాళ్ళు యావన్మందీ గుండెలు తీసినబంట్లు. వారిలో కృష్ణుడి కొడుకులు అగ్గిపిడుగులు. వారిలో ఇంకా చెప్పాలంటే ప్రద్యుమ్నుడూ, అనిరుద్ధుడూ, దీప్తిమంతుడూ, సాంబుడూ, మధుడూ, బృహద్భానుడూ, మిత్రవిందుడూ, అరుణుడూ, పుష్కరుడూ, దేవబాహుడూ, శ్రుతదేవుడూ, సునందుడూ, చిత్రబాహుడూ, విరూపుడూ, కవీ, న్యగ్రోధుడూ, వృకుడూ - ఈ ఎంపికయిన పదిహేను మందీ సాటిలేని మేటివీరులు.

# యాదవకులంలో ముసలం

మహాభారత యుద్ధంతో ఛప్పన్న దేశాలూ చల్లారి పోయాయి. ఎన్నో రాజవంశాలు సన్నగిల్లి పోయాయి. యాదవులు మాత్రం అడ్డూ ఆపూ లేకండా పెరిగారు. కృష్ణుడి బలం చూసుకుని, కిందూ మీదూ కనపడేది కాదు వారికి. యువకులలో అవినీతి అలుముకుంది. విచ్చలవిడితనం హెచ్చింది. పెద్దలమీద పిన్నలు తిరగబడ్డారు. కొడుకు తండ్రిని లెక్కచేయలేదు. ఆలు మగణ్ణి మన్నించలేదు. చిన్నా పెద్దా తాగి తందనాలాడారు. తాగుడు మానండని ఉగ్రసేనుడు శాసనం చాటించాడు. ఫలితం కలగలేదు. తగు మనుషులే తాగుడు మానలేదు.

ఇదంతా చూస్తూనే వున్నాడు కృష్ణుడు. ఏం చెయ్యాలో ఆలోచిస్తూనే వున్నాడు.

యాదవుల్ని మరొకరు మట్టిపెట్టలేరు. తమలో తామే ఒకళ్ళ నొకళ్ళు కొట్టుకోవాలి. ఒకళ్ళ నొకళ్ళు చంపుకోవాలి. అదిమాత్రం అంత సామాన్యమా?

ఇలా వుండగా ఓనాడు అక్కడి పిండారక తీర్థానికి విశ్వామిత్రుడూ, అసితుడూ, కణ్వుడూ, దూర్వాసుడూ, అంగీరసుడూ, అత్రీ మొదలైన మునులు వచ్చారు.

అక్కడే తందనాలాడుతున్నారు కొంతమంది యాదవ కుమాళ్ళు. మునుల్ని చూసి ఓ గమ్మత్తు చేశారు.

సాంబుడికి ఆడవేషం వేశారు. కడుపుమీద గుడ్డలు కట్టి, చూలాలులా తయారుచేశారు. మునుల ముందుకి

పట్టుకు వచ్చారు. దొంగ వినయంతో వంక దండాలు పెట్టి, అడిగారు:

"మునీశ్వరులారా! ఈవిడగారు మా బభ్రుడి భార్య, చూడండి కడుపుతో వుంది. నేడో రేపో కంటుంది. చెప్పండీ చూస్తాం, ఈవిడ కడుపులో ఏం పుడుతుందో? కొడుకు పుడతాడా? కూతురు పుడుతుందా? ఏం పుడుతుంది?"

ఈ వేళాకోళానికి ఒళ్ళుమండింది మునులకి. "కొడుకూ కాదు, కూతురూ కాదు, ఇనపముసలం పుడుతుంది" అన్నారు, "అది మీ యాదవకులం అంతం చేస్తుంది" అంటూ వెళ్ళిపోయారు.

మునులు వెళ్ళిపోయాక సాంబుడి ఆడవేషం విప్పేసి, కడుపుమీద కట్టిన గుడ్డలు చూస్తే నిజంగానే ముసలముంది. యాదవకులంలో ముసలం పుట్టింది!

భయపడ్డారు యాదవకుమాళ్ళు. ముసలం ఉగ్రసేనుడి దగ్గిరికి తీసుకువెళ్లారు. జరిగింది జరిగినట్టు చెప్పారు. విచారించాడు ఉగ్రసేనుడు. ముసలం రంగరించి గుండ చేయించాడు. సముద్రంలోపల పారబోయించాడు. ఇనపగుండే అయినా సముద్రంలో మునిగిపోలేదు ముసలంగుండ. కెరటాల్లో ఒడ్డుకి కొట్టుకు వచ్చింది. దట్టంగా తుంగగడ్డి అయి బలిసింది.

నూరగా నూరగా చిన్న ముక్క మిగిలిపోయింది ముసలం. అదికూడా సముద్రంలోనే పారవేయించాడు ఉగ్రసేనుడు. ఒక చేప మింగేసింది దాన్ని. జాలర్ల వలలో పడిం

దది. దాని కడుపులోని ఆ ముసలం ఇనపముక్క జరాకిరా తుడు తన బాణానికి మొనగా చేసుకున్నాడు.

మునులు రావడమూ, కుమాళ్ళు వెటకారం చేయ డమూ, ముసలం పుట్టడమూ, ఉగ్రసేనుడు సముద్రంలో వేయించడమూ, తుంగ పుట్టడమూ, జరాకిరాతుడు బాణం చేసుకోవడమూ అన్నీ తెలుసు కృష్ణుడికి. అయినా ఏమీ చెయ్యలేదతడు. కాగల కార్యం కాలానికే వొదిలిపెట్టాడు.

అవాళ కురుక్షేత్రంలో గాంధారి కృష్ణుడ్ని శపించింది. "కౌరవ వంశంలాగే ముప్ఫయిఆరేళ్ళ తరవాత మీ యాదవ వంశం నాశనమవుతుంది" అని.

"నువ్వు అన్నా అనకపోయినా అది అలాగే జరుగు తుంది" అన్నాడు కృష్ణుడు. అదిగో ఆ కాలం దాపురించి నట్టుంది ఇప్పుడు.

ద్వారకలో విడ్డూరాలు పుట్టాయి.

అవన్నీ చూసి, దిగాలుపడుతూ, యాదవులలో వృద్ధులు కొందరు కృష్ణుడి దగ్గిరికి వచ్చారు. వారు రోజురోజుకీ చూస్తున్న విడ్డూరాలు విన్నవించారు.

"అవును నేనూ చూస్తున్నాను. మనమంతా ప్రభాస తీర్థానికి వెళ్ళి జాతర చెయ్యాలి. బయలుదేరే ప్రయత్నంలో వుండండి" అన్నాడు.

## ఉద్ధవుడు

కృష్ణుణ్ణే నమ్ముకున్న అనుచరుడు ఉద్ధవుడు. అయి

వేళ్ళ చిన్నవయసునించీ కృష్ణుణ్ణే అంటిపెట్టుకు బతుకు తున్నాడు నీడలాగ. అరమరిక లేని కృష్ణభక్తుడు.

ద్వారకలోని విధ్వంసాలు చూసీ, కృష్ణుడు వూరు కోడం చూసీ, అవాళ గాంధారి అన్నమాటలు తలుపుకి తెచ్చుకున్నాడు. మునుల కోపమూ, ముసలం పుట్టడమూ తలుచుకున్నాడు. బాధపడ్డాడు. ఒక్కడూ వున్నప్పుడు కృష్ణుడి దగ్గిరికి వెళ్ళాడు. అడుగులమీద తలమోపి వల వలా ఏడ్చాడు.

"కృష్ణా! నీ దాసుడ్ని, నువ్వు తప్ప లోకంలేదు నాకు. నువ్వు వేసుకుని పారేసిన పూలదండలు వేసుకున్నాను. నువ్వు కట్టి విప్పేసిన బట్టలు కట్టుకున్నాను. నువ్వు తిని ఒది లేసిన అన్నం తిన్నాను.

ప్రభూ! ఎందుకీ ఉదాసీనత? మునుల ముసలం, గాంధారి మాటా మళ్ళించడం నీకు ఓ గొప్ప పనా?

కృష్ణా! నాకు తెలుసు. నువ్వే ఇంత పెంచిన ఈ యాదవకులం నువ్వే ముంచెయ్యాలనుకుంటున్నావు. నీ అంతట నువ్వే కనపడకపోవాలనుకుంటున్నావు.

ప్రభూ! నా ప్రభూ! నీ ఉద్ధవుడిని ఒదిలేసి వెళ్ళి పోతావా? వద్దు. నన్నుకూడా తీసుకుపో. నువ్వులేని బ్రతుకు చీకటి నాకు. ఉండలేను ప్రభూ! వుండలేను" అంటూ జాలిగా ఏడ్చాడు.

"ఉద్ధవా!" ఓదారుస్తూ అన్నాడు కృష్ణుడు. "నీతి మాలిన యాదవకులం నిలవదిక. నేనూ వెళిపోవాలి మరి. మరో వారంరోజులయ్యాక ఈ ద్వారకా నగరం సము

ద్రంలో మునిగిపోతుంది. నేను వుండను కనుక నువ్వూ వుండకూడదిక్కడ. బదరికాశ్రమం వెళ్ళిపో. మమకారం వదిలిపెట్టు. వైరాగ్యం కుదుర్చుకో. అందరినీ ఒక్కలాగే చూడు. కనపడేదీ, వినపడేదీ అంతా మాయ అని తెలుసుకో. నిజం గమనించు. నిజంవేపు వేలు చూపుతాయి వేదాలు. అలా అని వేదాలే నిజమనుకోకు.

నీ ఇంద్రియాలు నువ్వే లొంగదీసుకో. మనస్సు నిలకడ చేసుకో. గుణదోషాలు అంటనివ్వకు. కోరికలు వదిలిపెట్టు.

ఉద్ధవా! ఇదంతా సాధ్యం కావాలంటే వెనకటి ఇతిహాసమొకటి చెపుతాను.

యదుమహారాజు కాలంలో ఒక అవధూత వుండేవాడు. ఏ కోరికా లేకండా సంతోషంగా తిరుగుతుండేవాడు. ఏ వికారమూ అతడిలో వుండేది కాదు. అతణ్ణిచూసి యదుమహారాజు అడిగాడు. 'మహాత్మా! ఈ సిద్ధి పొందడానికి ఎక్కడ, ఏ విద్య నేర్చుకున్నావు?' అని.

అవధూత ఏమన్నాడో, విను. "అంతా లోకంనించే నేర్చుకున్నాను. భూమి దగ్గర ఓర్పు, ఇతర్లకి ఉపకారం చెయ్యడమూ నేర్చుకున్నాను. గాలి దగ్గర మనోవికారం లేకండా వుండాలనీ, ఆకాశం దగ్గరదేన్నీ అంటకండా వుండాలనీ తెలుసుకున్నాను. నీటి దగ్గర నిర్మలత్వం గ్రహించాను. అగ్గిదగ్గర అంతా ఒకలాగే చూడాలని గ్రహించాను. శరీరానికి వికారం కలుగుతూవున్నా ఆత్మకి వికారం లేదని

చంద్రుణ్ణి చూసి తెలుసుకున్నాను. సూర్యుడి దగ్గిర ఏకాత్మ రహస్యం అలవరుచుకున్నాను. సంసారం మీాద మమకారం పెట్టుకుంటే నాశనం తప్పదని గువ్వపిట్టవల్ల గ్రహించాను! అదెలాగో వినిపిస్తాను, విను.

అడివిలో ఓ గువ్వపిట్ట పెంటిపిట్టతో కాపురం చేస్తూ వుండేది. దానికి నాలుగుపిల్లలూ వుండేవి. పెంటి అంటే ప్రాణం గువ్వకి. పిల్లలంటే అంతకంటే ప్రాణం పెంటిపిట్టకి. ఓనాడు గువ్వజంట మేత తేడానికి వెళ్ళింది. ఇంతలో ఓ పిట్టల వేటకాడు పన్నిన వలలో గువ్వపిట్టలు చిక్కుకున్నాయి. అమ్మకోసం ఏడుస్తూ గింజుకున్నాయి. పిల్లల అరుపులు విని ఎగిరివచ్చింది పెంటిగువ్వ. 'అయ్యో, నా పిల్లలు' అంటూ వలలో పడిపోయింది. పెంటి వెంటే వచ్చింది మగ గువ్వపిట్ట. 'అయ్యో, నా పెళ్ళాం, పిల్లలు అంటూ తాను వలలో పడి పోయింది. అన్నిటినీ మూటకట్టుకు పట్టుకుపోయాడు పిట్టల వేటకాడు. రాజా! నా పెళ్ళాం, నా బిడ్డలు అని మమకారం పెట్టుకుంటే మనిషిగతీ ఇంతే అని తెలుసుకున్నాను.

కొండచిలువ దగ్గిర, ప్రయత్నం లేకండా దొరికిం దాంతో తృప్తిపడడం గ్రహించాను. సముద్రం దగ్గర గాంభీర్యం నేర్చుకున్నాను. అగ్నిలో పడే శలభం దగ్గర ఆడదాని వలపు ప్రాణం తీస్తుందని గ్రహించాను. వలపు అగ్ని. వలచినవాడు శలభం.

కూడబెడితే కీడు తప్పదని తేనెపట్టు దగ్గర తెలుసు కున్నాను.

పెంటి ఏనుగుకోసం గోతిలోపడే మగఏనుగుని చూసి, ఆడదానికోసం ఆసపడకూడదని తెలుసుకున్నాను.

ఎరకి ఆసపడి, ముల్లు మింగిన చేపని చూసి, ఆశ కూడదని గ్రహించాను.

మిథిలా నగరంలో పింగళ అని ఒక సాని వుండేది. దాని కథా, దాని పాటా విని ఆస ఒదులుకోడం అన్నిటికంటే సుఖం అని గ్రహించాను.

డబ్బుకోసం పడుచుకునేది పింగళ. ఓ రాత్రి ఆమె దగ్గరికి ఎవ్వడూ రాలేదు. తెల్లవార్లూ నిద్ర మానుకుని గుమ్మంలో కూచుంది. తుదకి నిరాశ చేసుకుంది. ఆసతో వున్నంతసేపూ బాధగా వుండే దామెకి. ఆస విడిచిపెట్టగానే హాయి అనిపించింది. అవాళనించీ డబ్బుమీద ఆశ ఒదులుకుని సుఖపడింది. తన అనుభవమే తాను పాటగా పాడింది.

ఒక లకుముకి పిట్ట చేసిన పని చూసి, దాచుకుంటే దుఃఖమనీ, ఒదులుకుంటే సుఖమనీ తెలుసుకున్నాను. లకుముకిపిట్ట చిన్న మాంసం ముక్క దాచుకుంది. తక్కిన పిట్టలు దాన్ని ఆక్రమించాయి. లకుముకి మాంసం ముక్క ఒదిలేసింది. దాని గండం గడిచిపోయింది.

పిల్లడిదగ్గర చీకూ చింతా లేకండా వుండడం నేర్చుకున్నాను.

ఒంటరితనమే సుఖమని ఒక కన్నెపిల్ల దగ్గర తెలుసుకున్నాను. ఆ పిల్లకి పెళ్ళి నిశ్చయమయింది. చుట్టాలు చూపులకి వచ్చారు. సమయానికి ఇంట్లో ఎవరూ లేరు. చుట్టాలకి అన్నం పెట్టాలి. బియ్యం చాలవు. పెరట్లో

వడ్లు దంచబోయింది పెళ్ళికూతురు. గాజులు చప్పుడయ్యాయి. బావుండదని కొన్ని గాజులు తీసేసింది. అయినా చప్పుడయింది. అన్నీ తీసేసి, రెండేసి గాజులుంచి దంచింది. రెండేసీ గిలు గిలుమంటూ వచ్చాయి. అప్పుడు ఒక్కగాజు మాత్రమే వుంచుకుని, తక్కింది తీసేసింది. చప్పుడు కాకండా పని ముగించింది. అంటే హెచ్చుమంది వుంటే గొల్లు తప్పదు. ఇద్దరే వున్నా జగడం తప్పదు.

మనస్సు స్థిరంగా వుంచాలని బాణం తయారు చేసే పనివాడి దగ్గిర తెలుసుకున్నాను. బాణానికి మొనవేస్తూ అతడు, రాజు వచ్చినా కన్నెత్తి చూడలేదు.

ఎవరి సహాయం అక్కర లేకండా తిరగడం పాము దగ్గిర తెలుసుకున్నాను."

గయ్యాళి సవతులు మగణ్ణి పీక్కుతిన్నట్టు శరీరాన్ని ఇంద్రియాలు పీక్కుతిని కవుకులు పెడతాయి. వీటిని అదుపులో పెట్టడం లోకం దగ్గరే తెలుసుకున్నాను."

ఇలా చెప్పి తనదారిని తాను వెళ్ళాడు అవధూత. కనక ఉద్ధవా! ఆత్మతత్వం అవగాహన చేసుకో. నేను చెప్పిన స్వధర్మం మననం చేసుకో. ఆత్మతత్వం తెలిశాక కర్మలు చేసినా, చెయ్యకపోయినా ఒక్కటే.

మచ్చరం, అభిమానం, బద్ధకం మురికితనం విడిచి పెట్టు.

ఉద్ధవా! నువ్వు నా అనుచరుడివి. నమ్మకమైనవాడివి. అందుకే ఇంతగా నీకు చెబుతున్నాను. మంచివాళ్ళ సాంగత్యం కంటే మించింది మరొకటిలేదు. మంచివాళ్ళ సాంగత్యం

వల్లే వెనక ప్రహ్లాదుడూ, వృషపర్వుడూ, బలీ, విభీషణుడూ, సుగ్రీవుడూ, జటాయువూ, ధర్మవ్యాధుడూ మొదలైనవారు తరించారు అలాగే.

ఇప్పటిప్పటిమాట - గొల్లపల్లి గోపికలూ, మధుర కుబ్జ త్రివక్రీ, యజ్ఞశాల బ్రాహ్మల భార్యలూ సత్సాంగత్యం వల్లే ధన్యులయ్యారు. వీళ్ళు ఎవరూ వేదాలు వల్లించలేదు; నోములు నోచలేదు; తపస్సులూ చెయ్యలేదు. మంచివాళ్ళ సాంగత్య మహిమే అదంతా."

ఉద్ధవుడు అడిగాడు :

"విషయాలు విషాల వంటివి. ఇది తెలిసినా మనుషులు కుక్కల్లా, పందుల్లా, గాడిదల్లా ఆ విషయాల వేపే ఎందుకు పరిగెడతారు ?"

కృష్ణుడు చెప్పాడు:

"సత్వము, రాజసము, తామసము - ఈ మూడూ ప్రకృతి గుణాలు, ఆత్మగుణాలుకావు. సత్వంతో రాజస, తామస గుణాలు అణచిపెట్టాలి. సత్వం ధర్మం పెంచుతుంది. విషయాశక్తిని అరికడుతుంది.

రజోగుణం పెరిగితే మనస్సు కోరికలకి బానిస అవుతుంది. కోరికలు దుఃఖాలకి దారి తీస్తాయి. ఉద్ధవా ! నువ్వు ఈ గుణాలకి అతీతుడివి కావాలి. తమోగుణం మనిషిని కుక్కని చేస్తుంది; పందిని చేస్తుంది; గాడిదని చేస్తుంది.

మనస్సు మాయే ఈ ప్రపంచం. అంతా భ్రమ. కుమ్మరిసారె వంటిది. ఒక్కటే రకరకాలవుతుంది. కల లాంటిది. అంతా అబద్ధం.

వివేకం వికసిస్తే, భ్రమ విడిపోతుంది. వివేకం సత్వ గుణం వల్ల కలుగుతుంది. వివేకమే కాదు శమమూ, దమమూ, ఓర్పూ, తపస్సూ, దయా, సత్యమూ, స్మృతీ, ఉల్లాసమూ, త్యాగమూ, శ్రద్ధా, లజ్జా, దానమూ, వినయమూ మొదలైనవి కూడా సత్వగుణంవల్లే పుడతాయి.

కామమూ, ప్రయత్నమూ, గర్వమూ, తృష్ణా! భేదమూ, పోరుబిగువూ, మిడిసిపాటు, పట్టుదలా మొదలయినవి రాజసగుణంవల్ల పుడతాయి.

అలాగే క్రోధమూ, లోభమూ, అసత్యమూ, హింసా, కలహమూ, దుఃఖమూ, మోహమూ, దీనత్వమూ, కునికిపాటూ, ఆశా, దిగులూ, మొదలయినవి తమో గుణం లోంచి పుడతాయి.

సత్వగుణంతో జాగ్రదవస్థా, రజోగుణంతో స్వాప్నికావస్థా, తమోగుణంతో సుషుప్త్యవస్థా ఏర్పడుతుంది.

మూడు గుణాల ముప్పిరివల్ల తురీయగుణం ఏర్పడుతుంది.

ఆసక్తిలేని కర్మ సాత్విక కర్మ. రాగకర్మ రాజస కర్మ. విచక్షణలేని కర్మ తామసకర్మ. అహంకార వికారాలు లేని కర్మ నిర్గుణకర్మ.

ఉద్ధవా! ఇంకా విను. దేహం గుణాలకి వునికిపట్టు ఎలకడ లేంది. అసత్యమైంది. అజ్ఞానంవల్ల ఇది సత్యమని పిస్తుంది. లోకమూ అంతే. కనపడేదంతా కలవంటిదే. కల ఎంత నిజమో కాయమూ అంతే నిజం. లోకమూ అంతే నిజం. ఇది తెలిసినవాడు కర్మలకి కట్టుపడడు. కర్మలు చేసినా,

చెయ్యకపోయినా ఒకటే అతడికి. దుఃఖమూ, సుఖమూ ఒక్కలాగే భావిస్తాడతగాడు."

ఇలా ఎంతో జ్ఞానమూ, విజ్ఞానమూ ఉద్ధవుడికి ఉపదేశించాడు కృష్ణుడు. ఆత్మతత్వమూ, సత్సంగ మహిమా, గుణవిశ్లేషణా, యోగసిద్ధులూ, జ్ఞాన, కర్మ, యోగాలూ, తత్వ రహస్యాలూ, క్రియా, యోగమూ, జ్ఞాన యోగమూ, సాంఖ్యయోగమూ మొదలైనవి ఉపదేశించాడు.

"ఉద్ధవా! విచారం విడిచిపెట్టు. బదరికాశ్రమం వెళ్లు. కోరికలు విడిచిపెట్టు. తపస్సు చెయ్యి. జ్ఞానాగ్నితో అజ్ఞానం తగలబెట్టు" అంటూ ప్రబోధించాడు.

కన్నీటితో నుంచున్నాడు ఉద్ధవుడు! తనకి కలిగిన సందేహాలన్నీ అడిగి తెలుసుకున్నాడు. పదేపదే పాదాభివందనం చేశాడు. పదేపదే ప్రదక్షిణ చేశాడు. కదపలేక కదపలేక కాలు కదిపాడు. వెళ్ళలేక వెళ్ళలేక వెళ్ళిపోయాడు. చలనంలేని చూపులతో చూస్తూ వుండిపోయాడు కృష్ణుడు.

## విదురుడు

నీతి తెలిసిన గొప్ప జ్ఞానవంతుడు విదురుడు. విదురనీతి విఖ్యాతమైంది. వెనక పాండవుల రాయబారిగా హస్తిన వెళ్ళినప్పుడు కృష్ణుడు, కృష్ణుడి రాయబారం ఫలించలేదు. దుర్యోధనుడు మొండిపట్టుపట్టాడు. సూది మొనంత నేల అయినా పాండవుల కివ్వనన్నాడు. కృష్ణుణ్ణి కట్టెయ్యడానికి ప్రయత్నించాడు. కృష్ణుడు వెళ్ళిపోయాక విదురుణ్ణి పిలిచి

హితబోధ చెయ్యమన్నాడు ధృతరాష్ట్రుడు. హితమే చెప్పాడు విదురుడు:

"మహారాజా! పాండవులకి జరిగిన అన్యాయానికి నువ్వే బాధ్యుడివి. నీ తమ్ముడి కొడుకులు వాళ్ళు, తండ్రిలేని బిడ్డలు. వాళ్ళని ఎడబెట్టావు. నీ కొడుకుల మీదే ఆసపెట్టు కున్నావు. వాళ్ళని లక్కయింట పెట్టి నిప్పు పెట్టించావు. మాయజూదమాడించావు. ద్రౌపది బట్టలు విప్పించావు. అడివికి వెళ్ళగొట్టావు. గడువు పూర్తిచేసి వచ్చారు వాళ్ళు. వాళ్ళ రాజ్యంకోసం కృష్ణుడంతవాడు రాయబారానికి వస్తే ఇవ్వం పొమ్మన్నారు మీరు. న్యాయం కాలదన్ని, చావు కోరుకున్నారు.

ఎంత ఓర్చాలో అంతా ఓర్చారు పాండవులు. ఆకలితోవున్న సింహాల్లా వున్నారిప్పుడు. నీ కొడుకులకీ, మనవలకీ చావు తప్పదు. ఇప్పుడయినా మించిపోలేదు. వాళ్ళ రాజ్యం వాళ్ళకిచ్చి సంధి చేసుకో.

దుర్యోధనుడు వినుకోడంటావు. అయితే అతణ్ణి విడిచిపెట్టు. తరిమికొట్టు. ఆ మూర్ఖుడు ఒక్కడికోసం వంద మంది కొడుకుల్ని బలిపెట్టకు.

అయిదుగురూ అయిదుగురే పాండవులు. వాళ్ళకి కృష్ణుడు సాయమిప్పాడు. దుర్యోధనుడు దుష్టుడు. తన చావు తాను కానలేకపోతున్నాడు. కౌరవుల నాశనం కోరుకుంటు న్నాడు."

కర్ణ, శకుని, దుశ్శాసనులతో వచ్చి ఇదంతా విన్నాడు దుర్యోధనుడు. విదురుడి మీద విరుచుకుపడ్డాడు.

“ఏమిటీ, కూస్తున్నాడు దాసీకొడుకు! పాండవులంటే పడి చస్తాడు. కౌరవులంటే కంటికి మంట. మా వుప్పుతింటూ మాకే ఎసరుపెడుతున్నాడు. హస్తిన రాజ్యంనించి గెంటెయ్యండి,వీణ్ణి పొమ్మనండి” అంటూ అడ్డమాని తిట్లూ తిట్టాడు.

పల్లెత్తుమాట బదులాడలేదు విదురుడు. కట్టుబట్టలతో ఇల్లు వదిలేశాడు. హస్తిన విడిచిపెట్టాడు. తీర్థయాత్రలు తిరుగుతూ వచ్చాడు. అవధూతలా దినాలు గడిపాడు. దుంపాదుట్రా, కాయా పండూ తినేవాడు. కటికినేల పడుకునేవాడు. నారలే కట్టుకునేవాడు. అలా కొండలూ,కోనలూ, నదులూ,నదాలూ తిరిగితిరిగి ముప్ఫయిఆరేళ్ళకి ఓనాడు యమున ఒడ్డుకి వచ్చాడు. అక్కడ, ద్వారకనించి బదరికాశ్రమం వెళుతూన్న ఉద్ధవుణ్ణి చూశాడు. “ఉద్ధవా!” అంటూ అమాంతంగా అతణ్ణి కౌగిలించుకున్నాడు. యాదవులా, పాండవులా క్షేమమడిగాడు.

“ఉద్ధవా! బలరాముడూ, కృష్ణుడూ బాగున్నారా? వసుదేవుడూ, దేవకీ, ఉగ్రసేనుడూ, కృష్ణుడికుమాళ్ళు, ప్రద్యుమ్నుడూ, సాంబుడూ, గదుడూ అందరూ హాయిగా వున్నారా ద్వారకలో? పాండవులంటే ప్రాణం వారందరికీ.

సాత్వతులూ, వృష్ణి, భోజులూ, దశార్హులూ- అంతా తనువుకి వస్తున్నారు నిన్ను చూస్తే. అందరు కులాసాయేకదా!

అన్నట్టు సాత్యకి ఎలా వున్నాడు? మా అర్జునుడి

ప్రియశిష్యుడతడు. కృష్ణుడిదగ్గిర యోగరహస్యాలు నేర్చుకున్నాడు.

అనిరుద్ధుడూ, అక్రూరుడూ, హృదీకుడూ, చారుధేష్ణుడూ, గదుడూ ఎలా వున్నారట!

మా హస్తినకబుర్లు అందుతున్నాయా? అంత భారతయుద్ధమూ కృష్ణుడి చేతులమీద జరిగింది. కౌరవులు నన్ను కాదన్నారు.. అందరూ హతవారిపోయారు. అంతా విన్నానయ్యా విన్నాను. ధర్మరాజు ధర్మంతో రాజ్యమేలుతున్నాడట కదా! కృష్ణుడు కుడిభుజమయితే అర్జునుడు ఎడమభుజం అతడికి. అతడి మయసభ కన్నుకుట్టింది మా దుర్యోధనమహారాజులుంగారికి. భీముడి గదతో తొడలు విరిగి పడిపోయాడట, పాపం! ఎంతపోరాను! అంతా పైత్యరోగికి పంచదారయింది.

భీమార్జునులూ, నకులసహదేవులూ బాగున్నారా?

పాపం, ద్రౌపది! అయిదుగురు కొడుకుల్నీ చంపేశాడట అశ్వత్థామ. సుభద్ర భద్రమేనా! మనవడుముప్ఫయి ఆరేళ్ళ వాడయుంటాడు. తాతల్నేకాని తండ్రి నెరగడు. అందరి తండ్రులలాటివాడా అభిమన్యుడు! బుద్ధిమంతుడేనా పరీక్షిత్తు?

కోడలు కుంతి బతికుందా! కొడుకులకోసం పడరాని పాట్లుపడింది.

మా అన్న ధృతరాష్ట్రుడు కళ్ళులేని మనిషి. తన మేలు కోరి ఎంతగానో మొత్తుకున్నాను. కొరగాని కొడుకు కోసం కులమంతా చెరుచుకున్నాడు, తమ్ముడ్నీ నన్ను తరిమేశాడు.

ఉద్ధవా! దేనికీ విచారంలేదు నాకు. దేశాలు తిరుగు

తున్నాను. అడివినించి అడివికి తిరుగుతున్నాను. కొండనించి కొండకి తిరుగుతున్నాను. నదులలో మునిగాను. దొరికింది తింటున్నాను. ఏది ఎలా అవాలనుంటే అది అలా అవుతుంది.”

విదురుడి మాటలు వింటూనే వున్నాడు ఉద్ధవుడు. ఉలికులికి పడుతున్నాడు. కృష్ణుడి క్షేమం అడుగుతున్నాడు విదురుడు. గుండెపగిలి పోతున్నట్టుంది ఉద్ధవుడికి. యాదవుల క్షేమం అడుగుతున్నాడు విదురుడు; పేరుపేరునా అడుగుతున్నాడు. తల తిరిగిపోతూ వుంది ఉద్ధవుడికి.అతడి నోట మాట రాలేదు. మొహమంతా కన్నీళ్ళతో నిండిపోయింది.

అయిదేళ్ళ వయస్సప్పటినించీ కృష్ణుడితో నేస్తం కట్టాడు ఉద్ధవుడు. కలిసిమెలిసి తిరిగాడు. కలిసి ఆటలాడాడు. కలిసి కూచున్నాడు. కలిసి నిదరపోయాడు. అలాంటి కృష్ణుడు తనని వదిలేసి, ఈలోకంనించే వెళిపోతున్నాడు. అతడి క్షేమం విచారిస్తున్నాడు విదురుడు. ఏమిటి బదులు చెప్పడం! ఎలా నోరు విప్పడం? అతడిశరీరం గరిపొడిచింది. కృష్ణుడి ఉపదేశం చెవిలో గింగురుమంది. కన్నీరు వరద కట్టింది.

“విదురా!” ఎంతోసేపటికి బొంగురు గొంతుకతో అన్నాడతడు, “క్షేమమడుగుతున్నావా నన్ను. కాలం కాల సర్పం. కబళించడమే దాని స్వభావం. పొద్దుగుంకిపోయాక అంతా చీకటే. అదిగో అలాగేవుంది నా అవస్థ, యాదవుల అవస్థాకూడా.

విదురా! ఇంతప్పటినించీ కృష్ణుడితోనే పెరిగాను.కృష్ణుడితోనే బతికాను.అంత చిన్నప్పుడూ కృష్ణుడి బొమ్మతోనే ఆడుకునేవాణ్ణి. కృష్ణుడి బొమ్మతోనే వూసులాడేవాణ్ణి. అతడి

సేవకుణ్ణి. అతడి భక్తుణ్ణి. ఇలాగే ముసిలి వాణ్ణయిపోయాను. చిన్నప్పుడు అతడితో ఆటలాడేవాణ్ణి. పాటలు పాడేవాణ్ణి. అతడి కథలే వినేవాణ్ణి. అమ్మ తిండికి పిలిచినా వెళ్ళేవాణ్ణికాను. అతడు నవ్వితే నవ్వేవాణ్ణి. అతడు ఏడిస్తే ఏడ్చేవాణ్ణి.

విదురా! మామూల్మాలు మనిషా కృష్ణుడు? అతడి చల్లని చూపులు గొల్లభామలకి వలపు పుట్టించాయి. అతడి అడుగుల గుర్తులమీద దొర్లిపోయేవారు వాళ్ళు. అతడి ఎరుపు చూపులు పగవాళ్ళని భస్మం చేసేవి. అతడి మురళి పాటకి బృందావనం పులకరించేది. ఆకాశం వెన్నెల వొలక పోసేది. అన్నీ నిన్నటిలా వుంది నాకు.

ఇంకేముంది? తన కొడుకుల చావుకి దుఃఖపడి గాంధారి శపించింది. కాలం రావడంతో యాదవ యువకులు మిడిసి పడ్డారు. సాంబుడికి చూలాలు వేషం వేశారు. మునులముందు తెయితెక్కలాడారు. కోపదారి మునులు సాంబుడి కడుపులో ముసలం పుడుతుందన్నారు. యాదవకులంలో ముసలమే పుట్టింది.

కృష్ణుణ్ణి తమలో ఒకడే అనుకున్నారు యాదవులు. అతణ్ణి గుర్తించలేకపోయారు. ఇంకేముంది!

కృష్ణుడి విరహంతో కుంగిపోతున్నాన్నేను. నన్ను బదరికాశ్రమం వెళ్ళిపొమ్మన్నాడు. వెళుతున్నాను."

వెక్కి వెక్కి ఏడ్చాడు ఉద్ధవుడు. విదురుడూ ఏడ్చాడు విని.

ఆ రాత్రి యమునానది ఒడ్డున కృష్ణుడి కథలే చెప్పు

కుంటూ విదురుడూ, ఉద్ధవుడూ గడిపేశారు. మర్నాడు ఉద్ధవుడు బదరికాశ్రమం దారి పట్టాడు. విదురుడు హస్తినా పురం వేపు మళ్ళాడు.

ఇల్లూ వాకిలీ ఒదిలి వెళిపోయి, ముప్ఫయి ఆరేళ్ళకి తిరిగీ హస్తినలో అడుగుపెట్టాడు విదురుడు. ధృతరాష్ట్రుడూ, ధర్మరాజూ, భీమార్జునులూ, నకుల సహదేవులూ యుయుత్సుడూ, సంజయుడూ, కృపుడూ మొదలైన యావన్మందీ అతణ్ని ఆప్యాయంగా ఆదరించారు. గాంధారీ, కుంతీ, ద్రౌపదీ మొదలైన రాణీవాసం స్త్రీజనమూ యథావిధిని గౌరవించారు. పరీక్షిత్తు పాదాభివందనం చేశాడు.

అన్న ధృతరాష్ట్రుడికీ, వదినెలు గాంధారీ కుంతీలకీ నమస్కరించాడు. అందరినీ కుశలమడిగాడు.

అతణ్ని ధృతరాష్ట్రుడితో సమంగా చూసుకున్నాడు ధర్మరాజు. ధృతరాష్ట్రుడి దగ్గిరే వున్నాడు విదురుడు.

అప్పటికే హస్తినలో విడ్డూరాలు అవుపిస్తున్నాయి. ప్రజల్లో దగా, అబద్ధం, కుటిలత్వమూ, క్రోధమూ, నీతి మాలిన తనమూ పెచ్చుపెరిగాయి. కుక్కలు మోరలెత్తి మొరుగుతున్నాయి. దిక్కులు పొగలుకమ్ముతున్నాయి. ఇలాటివన్నీ చూసి, కాలగతి గమనించాడు విదురుడు. అన్నగారికి తత్వబోధ చేశాడు.

"అన్నయ్యా, మన కాలం మళ్ళింది. మిగిలిన మూన్నాళ్లు వైరాగ్యంతో గడపాలిక.

ఈ శరీరం చివికిన గుడ్డపేలికలా అయిపోతుంది. మతిమంతుడు పాడిల్లు విడిచిపెడతాడు. అలాగే ప్రాణం పాడు

దేహం విడిచిపెడుతుంది. చూడు, నీ శరీరం ఒడిలిపోయింది. పళ్ళు పడిపోయాయి. కళ్ళు లేవు. చెవుడు వచ్చింది. అయినా ఒకప్పుడు మహారాజువయిన నువ్వు పాండవుల పంచని పడున్నావు. కుక్కలా కూడు తింటున్నావు.

ఇంతటితో ఈ మమకారం విడిచిపెట్టు. జంజాటం నించి బయటపడు. తపస్సు చెయ్యి. తరించు.”

విదురుడి మాటలతో తెలుసుకున్నాడు ధృత రాష్ట్రుడు. సంసార బంధాలు తెంచుకున్నాడు. మోహం విడిచిపెట్టాడు. వైరాగ్యం కుదుర్చుకున్నాడు. తపస్సుకని అడివికి పయనమయాడు. గాంధారితో కలిసి అర్ధరాత్రి ఎవ రికీ తెలియకండా విదురుడివెంట ఇల్లువిడిచి వెళ్ళిపోయాడు. ఆ వెళ్ళడంవెళ్ళడం వెళ్ళి హిమాలయం చేరుకున్నాడు. అక్కడ గంగానది ఏడుపాయలు పారుతున్న చోట యోగంలో కూచున్నాడు. నీరు మాత్రం ఆహారం చేసు కున్నాడు. వెళ్ళిన అయిదో రోజున కారుచిచ్చులో కాలి పోయాడు. మగడితోనే మంటలో మండిపోయింది గాంధారి.

అన్నగారూ, వదినెగారూ కార్చిచ్చులో కాలిపోడం కళ్ళారా చూశాడు విదురుడు. తల వాల్చుకుని ఉత్తరంవేపు వెళిపోయాడు.

* * *

రోజూ నిత్యకృత్యాలు తీర్చుకుని వచ్చి, గాంధారీ ధృతరాష్ట్రుల అడుగులకి మొక్కి, క్షేమమడిగి వెళ్ళేవాడు ధర్మరాజు. అలాగే విదురుడూ, గాంధారీ ధృతరాష్ట్రులూ వెళిపోయిన మర్నాడు పెదతండ్రి మందిరానికి వచ్చాడతడు. ముగ్గురికి ముగ్గురూ కనపడలేదు. కంగారుపడి సంజయుడ్నడి

గాడు. కంటికి రెప్పలా కనిపెట్టుకు వుండేవాడు సంజయుడు. అతడికీ తెలియకండా వెళిపోయాడు ధృతరాష్ట్రుడు.

## ద్వారకలో విడ్డూరాలు

ద్వారకలో విడ్డూరాలు మితిమీరిపోయాయి. సుడి గుమ్ములు పుట్టాయి. ఎలకలు మందలుగా వీథుల్లో పరుగులు పెట్టాయి. నిద్రలో వున్నవాళ్ళ జుత్తులూ, గోళ్ళూ కొరికి తినేసేవి. మట్టికడవలు కన్నాలు పెట్టేసేవి. యాదవుల ఇళ్ళల్లో మైనగోరలు పొద్దస్తమానం గీపెట్టాయి. సారస పక్షులు పులుగు పిట్టల్లా కూసేవి. మేకలు గాడిదల్లా అరిచేవి.

ఆవుల కడుపులో గాడిదలూ, కంచరగాడిదల కడు పులో ఏనుగుగున్నలూ, కుక్కల కడుపులో పిల్లికూనలూ పుట్టాయి. ముంగిస కడుపులో ఎలకలు పుట్టాయి.

సిగ్గుమాలి తిరిగారు యాదవులు. నీతిమాలి తిరిగారు ఆడంగులు. పిన్నలు పెద్దలమీద తిరగబడ్డారు. తల్లిని కొడుకు దగా చేశాడు. మగడ్ని మగనాలు మోసంచేసింది.

సూర్యుడి చుట్టూ కబంధాలు మూగినట్టు కనపడింది. చుక్కలతో చుక్కలూ, గ్రహాలతో గ్రహాలూ గుద్దు కున్నట్టూ, ఢీకొన్నట్టూ అవుపడింది.

కృష్ణుడు పాంచజన్యం పూరిస్తే యాదవుల మంది రాల్లో గాడిదలు ఓండ్రపెట్టినట్టు వినిపించేది.

అవన్నీ కనిపెడుతూనే వున్నాడు కృష్ణుడు. మహా భారతయుద్ధం జరిగి ముప్ఫయారేళ్ళూ నిండాయి. రేపే చివరి దినం.

సుధర్మ సభలో యాదవుల్ని సమావేశ పరిచాడు. కిటకిటలాడుతూ వుంది సభంతాను. మధ్య సింహాసనం మీంద కూచున్నాడు. అన్నదమ్ముల్నీ, జ్ఞాతుల్నీ, కుమాళ్ళనీ, చుట్టాల్నీ, స్నేహితుల్నీ - యావన్మందినీ - ఓసారి, అదే- చివరిసారి కలయచూశాడు.

ఆ చూపుల్లో ఆందోళన లేదు. తొందరపాటు లేదు. ఏ వికారము లేదు.

ప్రళయానికి ముందు ప్రశాంతంగా వుండే నీలి సముద్రంలా వున్నాడు కృష్ణుడు. ఎంత ప్రశాంతంగా వున్నాడో అంత గంభీరంగానూ వున్నాడు.

"అంతా వినండి"- అందుకున్నాడు కృష్ణుడు, "కనీ వినీ ఎరగని విడ్డూరాలు కనిపిస్తున్నాయి మన ద్వారకలో. మనకి అపశకునాలివి. అనిష్టం సూచిస్తున్నాయి. కాలం కాల సర్పంవంటిది.

ఈ పట్నంలో మనం వుండకూడదిక, దీనిని విడిచి పెట్టి వెళ్ళిపోవాలి, తప్పదు.

వ్యవధి లేదు. ఇప్పుడే పయనం కావాలి. రేపు తెల్లవారక ముందే మనం ప్రభాస తీర్థంలో వుండాలి.

వృద్ధుల్నీ, చిన్నపిల్లల్నీ, స్త్రీ జనాన్నీ శంఖో ద్ధార తీర్థం దగ్గర చేర్చాలి.

పొద్దుటిపూట స్నానాలు మనమంతా సరస్వతీ నదిలో చేయాలి."

# యాదవుల మహాయాత్ర

సుధర్మ తుది మహాసభ ముగిసింది. "ప్రభాసానికి పయనంకండి" అని నగరంలో దండోరా వేయించాడు కృష్ణుడు.

రథాలమీదా, మేనాలమీదా, బళ్ళమీదా బయలు దేరారు యాదవులు. పడవలమీదా, ఓడలమీదా సముద్రం దాటారు. ప్రభాసతీర్థం చేరారు. పడమరగా పారుతూ సముద్రంలో పడుతున్న సరస్వతిలో మునిగారు. మున్నాబులు చేసుకున్నారు. రకరకాల బట్టలు కట్టుకున్నారు. రకరకాల గంధాలు పూసుకున్నారు. రకరకాల దండలు వేసుకున్నారు. రకరకాల పిండివంటలు తిన్నారు. మాంసాలు, మద్యాలు తాగారు. కేరింతలాడారు. మీసాలు దువ్వారు. రోసాలు పలికారు. కారుకూతలు కూశారు. కయ్యాలకి కాలు దువ్వారు. ధనుస్సులు తీశారు. కత్తులు దూశారు.

కృష్ణుడి కళ్ళముందే కల్లు తాగారు. పదేపదే తప్ప తాగారు.

ఒకడు రథమెక్కితే, ఒకడు ఏనుగెక్కాడు. ఒకడు గుర్రమెక్కితే ఒకడు లొట్టిపిట మీదికి ఎగబడ్డాడు. ఒకడు గాడిదెక్కితే ఒకడు మనిషిమీదెక్కాడు.

బాజాలు వాయించారు. సానిమేళాలాడించారు. పాటలు పాడారు. ఆటలాడారు.

కృష్ణుడి ఎదటే కూచుని అతడి వియ్యంకుడు కృత

వర్మా, అన్న బలరాముడూ, తమ్ముడు సాత్యకీ, గదుడూ, బభ్రుడూ, తప్ప తాగారు. మత్తులో మతీ సుతీ లేకండా పోయింది.

ఉన్నట్టుండి పూరికే కృతవర్మమీద ఎగిసిపడ్డాడు సాత్యకి.

"ఏయ్, కృతవర్మా! అవాళ నిద్రపోతున్న వాళ్ళ మీదపడి చంపావు అర్ధరాత్రి. యదువంశం వాళ్ళందరూ 'థూ' అన్నారు!"

"అవును. ఉన్నమాటే అది." అంటూ పల్లవి పాడాడు ప్రద్యుమ్నుడు.

"సాత్యకీ" వురిమాడు కృతవర్మ. "చెయ్యి తెగి చావ డానికి కూర్చున్న భూరిశ్రవుణ్ణి చంపినవాడివేనా, పెద్ద కబుర్లు చెబుతున్నావు !"

చురచురా చూశాడు కృష్ణుడు.

చర్రున కత్తి తీశాడు సాత్యకి. కృతవర్మ తల నరికే శాడు.

భోజులూ, అంధకులూ చుట్టుముట్టి సాత్యకిని చంపే శారు.

యాదవకులంలో గాలి గుమ్మి రేగింది. ప్రభాసం సముద్రపొడ్డంతా మూడు పలకల తుంగ బలిసుంది. ఉగ్ర సేనుడు సముద్రంలో పారబోయించిన ముసలంగుండే అలా తుంగ బలిసింది.

కల్లు నిషాలో తుంగగాలి గంగవెర్రు లెత్తించింది పొగరబోతు యాదవుల్ని. సాత్యకీ కృతవర్మల రక్తం కళ్ళ

చూసి రాక్షసులే అయిపోయారు వాళ్ళు. అయినవాళ్ళె వరో కానివాళ్ళెవరో అయిపు లేకండా పోయింది. అన్న తమ్ముడిమీద పడ్డాడు. తమ్ముడు అన్నమీద పడ్డాడు. తండ్రి కొడుకుమీద పడ్డాడు. కొడుకు తండ్రిమీద పడ్డాడు.

ప్రద్యుమ్నుడూ, సాంబుడూ కొట్టుకున్నారు. అక్రూరుడూ భోజుడూ కొట్టుకున్నారు. సుభద్రుడూ, సంగ్రామజితుడూ కొట్టుకున్నారు. గదుడూ, అనుగదుడూ కొట్టుకున్నారు. సుమిత్రుడు అలాగే అనిరుద్ధుడూ, నిశకుడూ, ఉల్ముకుడూ, శతజిత్తూ, సహస్రజిత్తూ, భానుడూ పరస్పరం నరుక్కున్నారు; పొడుచుకున్నారు, ఒకళ్ళ నొకళ్ళు చంపుకున్నారు.

వీరందరూ వీరాధివీరులు, అసహాయశూరులు. మంచి చెడ్డ లెరిగిన వాళ్ళు. బుద్ధిమంతులలో బుద్ధిమంతులు. ఒక్కొక్కడూ ఒక్కొక్క రాజ్యమేలగల వాళ్ళు. అయితేనేం మధుపానంతో మతులు పోగొట్టుకున్నారు. ఆయుధాలతో కొట్టుకున్నారు. ఆయుధాలు అంతమయాక, ముసలం తుంగతో కొట్టుకున్నారు. యాదవుల చెయ్యి తగిలితేచాలు తుంగగడ్డి ఇనప ముసలాలలాగ బిగుసుకునేది. దానిదెబ్బ తగిల్తే చాలు ఠారుమనిపోయేవారు.

దాశార్హ, వృష్ణి, అంధక, భోజ, సాత్వత, మధు, అర్బుద, మాథుర, శూరసేన, కుకుర, కుంతీ వంశీయులందరూ చుట్టరికాలు మరిచిపోయి స్నేహాలకి స్వస్తి చెప్పారు. చంపడమే, చావడమే సరదాగా సేనలతోకూడా చావులపండగ సాగించారు.

ఆ ఆవేశంలో బలరాముడూ, కృష్ణుడూ కలిశారు.

అనుకోకుండానే పిడికిళ్ళతో ముప్పేకల తుంగ పెరికారు. తమ జ్ఞాతుల్నే తరిమి చంపారు మారి మసిగినట్లు, దావానలం రేగినట్లు, ప్రళయం పరుగెత్తినట్లు, నిప్పుకొండ పగిలినట్లు, పెట్రేగిపోయింది తుంగ.

వందలు వందలు వేలు వేలు కుప్పలు పడ్డాయి శవాలు. తమలో తామే కొట్టుకు చచ్చారు యాదవులు. అంతమందీ అయిపోయారు. అయితే కృష్ణుడు విసరిన తుంగతోనే హెచ్చుమంది చచ్చిపోయారు. అయితే ఏ వికారమూ కలగలే దతడిలో.

అంత యాదవకులమూ అంతమయిపోయింది. కారణం ఏదయినా జరిగిందంతా తాగుడువల్లే జరిగింది.

తాగిన మత్తుతోనే సముద్రం గట్టున కూచుని కళ్ళు మూశాడు బలరాముడు.

## జరాకిరాతుడు

అన్నగారి చావూ చూశాడు కృష్ణుడు. జీబుగా వున్న రావిచెట్టుకింద, చేరబడి కూచున్నాడు. చెట్టుకింద కారుమబ్బు వాలినట్టయింది.

ఎప్పటిలాగే పసుప్పచ్చటి పట్టుబట్ట కట్టుకున్నాడు. అలాటిదే వుత్తరీయం వేసుకున్నాడు. ఒంటరిగా కూచున్నాడు. ఎక్కడా ఏ అలికిడీ లేదు.

కుడితొడమీద ఎడమకాలు వేసుకుని, కట్టికినేల కూచున్నాడు.

అంతయినా చింతా వంతా లేదు. మొహంలో కలి విడి మాయలేదు. తామరరేకుల్లా వున్నాయి కళ్ళు. ఎంచక్కా ఎర్ర తామరలా అవుపిస్తూ వున్నాయి అడుగులు.

అదే సమయానికి అడివిలో వేటాడుతూ ఒక కిరాతుడు అక్కడికి వచ్చాడు. అతడి పేరు జరుడు.

భయంకరంగా వున్నాడు జరుడు. చేతిలో ధనుస్సూ, వాడి వాడి బాణాలూ వున్నాయి. మృగాలు వెదుకుతూ వచ్చాడతడు.

చెట్టుకింద కృష్ణుడు మృగమే అనుకున్నాడు జరుడు. కృష్ణుడి పాదం లేడి నోరులా కనపడింది. చప్పున బాణం తొడిగాడు.

వెనక చేప కడుపులో దొరికిన ముసలం ముక్క మొన చేసిన బాణమది. అదే ధనుస్సుకి తొడిగాడు కిరాతుడు. గురిచూసి కొట్టాడు.

కృష్ణుడి ఎడమ పాదానికి తగిలింది బాణం. జంతువు కోసం పరిగెత్తాడు జరుడు. తాను కొట్టింది జంతువు కాదు కృష్ణుడు.

జజ్జరిల్లిపోయాడు జరుడు. గుండెలు బాదుకున్నాడు. విల్లూ, అమ్ములూ పడేశాడు. కృష్ణుడి కాళ్ళమీద పడ్డాడు గోలు గోలుమన్నాడు.

"ఎంత పని చేశాను! ఎంత పని చేశాను! అపరాధమయిపోయింది ప్రభూ! ప్రభూ! నన్ను చంపెయ్యి. నా చేతులు నరికెయ్యి." అంటూ కింద దొర్లిపోయాడు.

నెత్తీ, నోరూ మొత్తుకున్నాడు. మెల్లిమెల్లిగా కళ్ళు విప్పాడు కృష్ణుడు.

"విచారపడకు" నెమ్మదిగా అన్నాడు, "ఇది ఇలాగే జరగాలి, వెళ్ళు."

## తుది మాట

ప్రభాసతీర్థం, యీనాపొద్దు విశాలమైన అంతమేరా శవాలే శవాలు. కృష్ణుణ్ణి వెదుక్కుంటూ తిరిగాడు దారుకుడు. కనబడలేదు కృష్ణుడు. వెదికి వెదికి ఎలాగో, కృష్ణుడు పడున్న రావిచెట్టు దగ్గిరికి వచ్చాడు. కృష్ణుడు అవుపడగానే పరిగెత్తుకు దగ్గిరికి వెళ్ళాడు. బావురుమన్నాడు.

"వచ్చావా, సారథీ!" నెమ్మదిగా అన్నాడు కృష్ణుడు, "విచారించకు. ఏం జరగాలో అదే జరిగింది. నువ్వు చెయ్యవలిసిన పని కొంచెం మిగిలింది. ద్వారక వెళ్ళు. అమ్మనీ, నాన్ననీ చూడు. అంతా అయిపోయింది. అన్నయ్య బలరాముడు వెళిపోయాడు. నేనూ వెళుతున్నాను.

అర్జునుడు వస్తాడు. అతడితో మనవాళ్ళందరినీ ఇంద్రప్రస్థం వెళిపోమను. నా తరవాత ద్వారక సముద్రంలో మునిగిపోతుంది. గొడ్డూ, గోదా ఏదీ ద్వారకలో వుంచకూడదు. వెళ్ళు ఇక్కడ ఆగకు".

కృష్ణుడి తుదిమాట విన్నాడు దారుకుడు. లోకం చీకటే అయిపోయిందతడికి. ఏడుస్తూ ద్వారక వెళ్ళాడు.

ప్రపంచం చిత్రమైన నాటకశాల. నాటకం మొదలవుతుంది. నటుడు రకరకాల వేషాలతో వస్తాడు. అంతా

నిజమే అనిపిస్తాడు. నాటకమయిపోతుంది. వేషాలూ వుండవు, నటుడూ వుండడు, మరుగయిపోతాడు.

అదిగో అలాగే కృష్ణచరిత్ర చిత్రమైన మహా నాటకం.

బందిఖానాలో ఖైదీల కడుపున పుట్టాడు కృష్ణుడు. గొల్లపల్లె గొల్లలఇంట పెరిగాడు. ఆవులు మేపుతూ బతికాడు. గొల్లపడుచులతో తిరిగాడు. బృందావనం పులకలెత్తించాడు. మధుర వెళ్ళి యాదవరాజ్యం ఉద్ధరించాడు. సముద్రంలో ద్వారక నిర్మించాడు. మహాయుద్ధాలు చేశాడు. రాజకీయాలు నిర్వహించాడు. మహాభారత యుద్ధం ఒక్క చేతిమీద నడిపించాడు. పాండవుల వంశాంకురం నిలిపాడు. యాదవకులం తుదముట్టించాడు. పరలోకం వేంచేశాడు.

## అర్జునుడు

అర్జునుడు ద్వారక వచ్చాడు. మగడు చచ్చిన ముండలా వుంది ద్వారక. దుఃఖంతో కుంగిపోయాడతడు.

అతణ్ని చూసి కృష్ణుడి భార్యలందరూ గొల్లుమన్నారు. ఏడుస్తూనే వాళ్ళని ఓదార్చాడు అర్జునుడు. అక్కడ్నుంచి మామ వసుదేవుడి దగ్గిరికి వెళ్ళాడు. కుమాళ్ళ చావు విని కుమిలి కుములి ఏడుస్తున్నాడు వసుదేవుడు. నేలపడున్నాడు.

దుఃఖం ఆపుకోలేకపోయాడు అర్జునుడు. మామ పాదాలు పట్టుకుని వెక్కి వెక్కి ఏడ్చాడు.

అర్జునుడ్ని లేవనెత్తబోయాడు వసుదేవుడు. కాని లేవలేకపోయాడు. ఎలాగో అతడ్ని గుండెల కద్దుకున్నాడు. కుమాళ్ళనీ, తమ్ముళ్ళనీ, మనవల్నీ, చుట్టాలనీ తలుచుకుని పనివి పనివి ఏడ్చాడు.

"అర్జునా! ఏరయ్యా! నావాళ్ళు? అయినా బతికే వున్నాను! చావు నాకు లేదా?"

"మామయ్యా! ఏడుస్తూ అన్నాడు అర్జునుడు. "కృష్ణుడులేని ఈ లోకం చూడలేను. అన్నయ్యలు ధర్మరాజూ, భీముడూ, కవల తమ్ములూ, ద్రౌపదీ నాలాగే కృష్ణుడు లేని లోకంలో వుండలేరు.

కృష్ణుడు వెళిపోయాడు, మేమూ వెళిపోతాం మామయ్యా! కాలం వచ్చేసింది.

స్త్రీలనీ, పిల్లల్నీ, వృద్ధుల్నీ ఇంద్రప్రస్థం తీసుకు వెళతాను."

వసుదేవుడ్ని ఓదార్చి, సుధర్మ సభలోకి వెళ్ళి కూచున్నాడు అర్జునుడు. మంత్రుల్నీ, వయసు మళ్ళినవాళ్ళనీ సమావేశపరిచాడు.

"ఎన్నో గొప్పగొప్పసభలు జరిగినసభ సుధర్మ - కృష్ణుడి గంభీరమయిన ఉపన్యాసాలతో మారుమోగిన మహాసభ. నిత్యకల్యాణం పచ్చతోరణంగా వుండిన యాదవసభ. దీపంలేని కొంపలా దిన్నపోయిందిప్పుడు. దీనంగావుంది. ఎవరి మొహంలోనూ చిక్కితే నెత్తురు చుక్క లేదు. కన్నీళ్ళు తుడుచుకుంటూ అన్నాడు అర్జునుడు:

"ఇవాళనించీ ఏడోనాడు ద్వారకాపట్నం సముద్రంలో మునిగిపోతుంది.

ఏడోరోజు పొద్దుదూకేసరికి ద్వారకలో పిట్టమనిషి వుండకూడదు.

డబ్బూదస్కం, గొడ్డూగోదా, పిల్లాజెల్లా-అన్నీ తీసుకుని మీరంతా పట్నం వొదిలిపెట్టెయ్యాలి.

వృష్ణి, అంధక వంశాలవారి స్త్రీలనీ, పిల్లల్నీ నేను ఇంద్రప్రస్థం పట్టుకు నెళతాను. కృష్ణుడి మనవణ్ణి వజ్రుణ్ణి యాదవులరాజుగా అభిషేకిస్తాను. కృష్ణుడి ఆదేశమిది."

ఆ రాత్రి కృష్ణుడి మందిరంలోనే గడిపాడు అర్జునుడు.

తెల్లవారేసరికి వసుదేవుడి మందిరంలో ఏడుపులు వినిపించాయి. రాత్రి వసుదేవుడు కాలం చేశాడు.

దేవకీ, రోహిణీ, భద్రా, మదిరా మొదలయిన వసుదేవుడి భార్యలు మగడి చితిమీద సహగమనం చేశారు.

యాదవులందరికీ అగ్నిసంస్కారం జరిగించాడు అర్జునుడు. ఎంతోమంది యాదవ స్త్రీలు తమ భర్తల చితులమీద అగ్గిలో ఆహుతి అయిపోయారు.

బలరాముడి భార్యలూ, కృష్ణుడి కోడళ్ళూ అలాగే సహగమనం చేశారు. రుక్మిణీ మొదలయిన దేవేరులూ అగ్ని

ప్రవేశం చేశారు. సత్యభామా మరికొందరూ తపస్సుకని అడవికి వెళిపోయారు.

ఏడోనాడు ద్వారక విడిచిపెట్టేశాడు అర్జునుడు. మిగిలిన కృష్ణుడి భార్యల్నీ, పిల్లల్నీ, ముసిలాళ్ళనీ తీసుకుని ఇంద్రప్రస్థం బయలుదేరాడు. వజ్రుణ్ణి ముందుంచుకుని పయనమయారు యాదవులు. ఏనుగులమీదా, గుర్రాలూ, గాడిదలూ, ఎడ్లూ, ఎనుపోతులూ, ఒంటెలూ పూనిన బళ్ళమీదా, రథాలమీదా పట్నంలో పిట్టమనిషి వుండకండా వచ్చేశారు. రహస్యంగా ఆయుధాలు కట్టి ఏనుగులమీద పెట్టారు. వాటి రక్షణకోసం పదాతుల్ని పెట్టారు.

కృష్ణుడి పదహారువేలమంది భార్యలూ, అతడి మనవలూ వజ్రుణ్ణి అంటిపెట్టుకుని నడిచారు. భోజ, వృష్ణి, అంధక వంశాల వితంతువుల సంఖ్య ఎన్నో అన్ని వేలుంది.

ఇటు అర్జునుడు వచ్చేస్తూవుంటే అటు పట్నం ముంచేస్తూ వచ్చింది సముద్రం.

ద్వారకా నగరం సముద్రంలో మునిగిపోయింది. కృష్ణుడి భవనముండినచోటు మాత్రం మిగిలిపోయింది.

సముద్రం పాలబడకుండా ద్వారక ప్రజల్ని తప్పించి, అంతమందితోనూ ముందుకి నడిచాడు అర్జునుడు. అంతమందికీ అతడు ఒక్కడే దిక్కు. అలా వెళ్ళివెళ్ళి పంచనద దేశంలో ఆగాడతడు.

అక్కడి దోపిడి దొంగలు చూశారు. అంతమంది ఆడాళ్ళు. అంతమందీ వితంతువులు. నగలు కోకొల్లలు. అందరూ అందగత్తెలు. రాణివాసం రాజహంసలు. దొంగలకి ఆసపుట్టింది. ఒకళ్ళతో ఒకళ్ళు కూడబలుక్కున్నారు.

"మంచి బేరం తగిలింది మనకి. అంతా ఆడంగులు. మగాళ్ళలో ఒక్కడే మొనగాడు. మిగతా అంతా మూడు కాళ్ళ ముసిలాళ్ళు, ముక్కుపచ్చలారని పిల్లకాయలు."

అంటూ వేలాదిమంది కర్రలూ, కత్తులూ పట్టుకుని యాదవస్త్రీలమీద విరుచుకుపడ్డారు. సేవకుల్ని చిదక గొట్టారు. చేతికందిన స్త్రీలనల్లా లాక్కుపోడం లంకించు కున్నారు.

అర్జునుడు గర్జించాడు. లెక్కచేయలేదు దొంగలు. గాండీవం తీశాడు అర్జునుడు. చిత్రం, ఎక్కుపెట్టడానికే ఉక్కిరిబిక్కిరి అయాడు. ఎలాగో ఎక్కుపెట్టాడు. బాణం పట్టుకున్నాడు. ప్రయోగించలేకపోయాడు. సిగ్గుతో తల వంచుకున్నాడు. శాయశక్తులా పోరాడాడు. కాపాడగలిగి నంత మందిని కాపాడాడు.

నాలుగువేపులా ముట్టడించారు దొంగలు. అంద మయిన ఆడాళ్ళని ఎత్తుకుపోయారు. ధనరాసులు కొల్ల గొట్టారు. కొంతమంది స్త్రీలని బలవంతంగా ఎత్తుకుపోయారు. కొంతమంది తమంత తామే దొంగలవెంట వెళ్ళారు.

శక్తి సన్నగిల్లినా ఫూరుకోలేదు అర్జునుడు. చెమటలు పోసుకుంటూనే బాణాలు వేశాడు. ఎంతోమందిదొంగల్ని చంపాడు. తరుగులేనివి తన తూణీరాలు. కాని వృత్తి పోయాయి. తెల్లబోయాడు అర్జునుడు. గాండీవం వింట్రితోనే కంటపడిన వాణ్ణల్లా కొట్టి తరిమాడు.

హెచ్చుమంది స్త్రీలని ఎత్తుకుపోయారు దారిదోపుడు దొంగలు. చేతికందిందల్లా చేజిక్కించుకుపోయారు. మిగిలిన స్త్రీలనీ, పిల్లల్నీ, ముసిలాళ్ళనీ తీసుకుని ముందుకి సాగాడు అర్జునుడు. అతడి హృదయం కుంగిపోతూవుంది.

"అర్జునుణ్ణేనా నేను. నా భుజాల శక్తి ఏమయిపోయింది? గాండీవం ఇంత నిస్సారమయిపోయింది! అక్షయతూణీరాలు వృత్తిపోయాయి. అస్త్రవిద్యకూడా అశాశ్వతమేనా?"

## పాండవుల మహాయాత్ర

అర్జునుడు ద్వారక వెళ్ళి ఇంకా హస్తినకి తిరిగిరాలేదు. ధర్మరాజు మనస్సు మనస్సులో లేదు. దినాలు తిన్నగా లేవు. అపశకునాలకి అంతులేకుండా వుంది. దిగులు దిగులుగా వుంది. రాళ్ళు తేలిపోతూ బెండ్లు మునిగిపోతున్నట్టున్నాయి.

విచారిస్తూ కూచున్నాడు ధర్మరాజు. భీముణ్ణి పిలిచి ఇలా అన్నాడు:

"భీమన్నా, అర్జునుడింకా రాలేదు. ఎన్నాళ్ళయి పోయింది! మనస్సేమీ బాగుండలేదు.

మహాయుద్ధం జరిగి ముప్ఫయ్యారేళ్ళు అయిపోయింది. యాదవులు—మనవాళ్ళంతా ఎలావున్నారో! మామ వసుదేవుడూ, మేనత్త దేవకీ బాగా ముసిలాళ్ళయిపోయివుంటారు. పాపం ఎన్ని కష్టాలు పడ్డారు!

కృష్ణుడు పుట్టి, కంసుణ్ణిచంపాక కాని వాళ్ళ ఖైదు తప్పలేదు. కృష్ణుడే యాదవుల కష్టాలు ఆదుకున్నాడు. మహానుభావుడు. సామాన్యుడా కృష్ణుడు.

యాదవుల సంగతి అలా వుంచు. మనం ఇవాళ ఇలా వున్నామంటే-ఇదంతా కృష్ణుడు పెట్టిన భిక్ష.

మనమీద ఈగ వాత్తే, అతడిమీద ఏనుగు వాలేది. పాండవులే పంచప్రాణాలు కృష్ణుడికి. ఎన్నెన్ని ఆపదలలో అడ్డుపడ్డాడు ! జయద్రధుడి వధలో అర్జునుడ్ని రక్షించాడు. బాబయ్యగారికి నీ వుక్కు—బొమ్మ అందిచ్చి నీ ప్రాణం కాపాడాడు. మనిషికాదయ్యా, కృష్ణుడు మన పాలి దేవుడు.

ఇవాళయినా వస్తాడా అర్జునుడు ! తమ్ముడి మొహం కళ్ళముందు దీనంగా కనపడుతుంది. ఎడమకన్ను అదురుతుంది. ఎడమ భుజం బెదురుతుంది. ఎన్నడూ లేదు, మనస్సంతా కలిచేస్తూవుంది.

